# అద్వైత బోధిని.

సుప్రసిద్ధ వేదాంత శబ్ద శాస్త్రపారంగతులగు

బ్రహ్మశ్రీ శిష్ట్లా నృసింహశాస్త్రులుగారిచే

పరిష్కృతము.





బందరు తాలూకా, చిన్నాపురం గ్రామములోని శ్రీ

ఆనందాశ్రమము వారిచే

ప్రకటితము.



మొదటికూర్పు : 1000.



ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల, లిమిటెడ్,

బెజవాడ.

1922.

 [వెల రు 2—8—0]

---

# అంకితము.

శ్రీ సద్గురూత్తమా!

భవదీయ నిర్హేతుక జాయమాన కరుణాకటాక్షంబున "ఆత్మజ్ఞానం" బను "నౌక" చే దరిఁగానని యీ యనాది సంసార సాగరమునుండి నన్నుద్ధరించిన యుష్మచ్ఛ్రీ పాద పద్మయుగళంబు సన్నిధి ననేక వందన సహస్రములతో నేతద్గ్రంథము నర్పించుచున్నాడ.

గ్రంథకర్త.

# విషయ సూచిక.

# స్తోత్రాదికము.



శ్లో॥ అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా।
చక్షురున్మీలితంయేన తస్మైశ్రీగురవేనమః ॥౧॥

శ్లో॥ యస్యాంతర్నాదిమధ్యం నహికరచరణం నామగోత్రం నసూత్రం।
నోజాతిర్నైవవిద్యా నభవతిపురుషో నానపుంసం నచస్త్రీ।
నాకారంనైవకారం నహిజనిమరణం నాస్తిపుణ్యంనపాపం।
తత్త్వంనోతత్త్వమేకం సహజసమరసం సద్గురుంతంనమామి ॥౨॥

శ్లో॥ యస్యప్రసాదాదహమేవసర్వం। మయ్యేవసర్వం పరికల్పితంచ।
ఇత్థంవిజానామిసదాత్మరూపం।తస్యాంఘ్రిపద్మంప్రణతోస్మినిత్యం॥౩॥

శ్లో॥ ఆబ్రహ్మస్తంబ పర్యంతం పరమాత్మస్వరూపకం।
స్థావరంజంగమంచైవ ప్రణమామిజగన్మయం ॥౪॥

శ్లో॥ మన్నాథశ్శ్రీ జగన్నాథో। మద్గురుశ్శ్రీజగద్గురుః।
స్వాత్మైవసర్వభూతాత్మా తస్మైశ్రీగురవేనమః ॥౫॥

శ్లో॥ అలంవికల్పైరహమేవకేవలం। మయిస్థితంవిశ్వమిదంచరాచరం।
ఇదంరహస్యం మమయేనదర్శితం। సవందనీయో గురురేవకేవలం॥౬॥

శ్లో॥ ఆత్మాత్వంగిరిజామతిః పరిజనాః ప్రాణాః శరీరంగృహం।
పూజాతేవిషయోపభోగరచనా నిద్రాసమాధిస్థితిః।
సంచారఃపదయోః ప్రదక్షిణవిధిః స్తోత్రాణిసర్వాగిరః।
యద్యత్కర్మకరోమితత్తదఖిలం శంభోతవారాధనం ॥౭॥



శ్రీగురుభ్యోనమః
హరిః ఓం

# అద్వైతబోధిని

గ్రంథప్రారంభః

నేను, నేను, నేను యని ప్రతివారును లోకములో వ్యవహరించు చున్నారు. ఈ "నేను" ఎవరు? నేననువ్యవహారము కలిగినతోడనే యెదుటనుండు పదార్థ సముదాయమునుండి కొంత భాగమును "నాది, నాది, నాది," యని స్వీకరించుచున్నారు. ఈ నాది యనబడు దాని స్వరూపమేమి? ఈ రెండు ప్రశ్నలను మానవజన్మమెత్తిన ప్రతివారును విచారించి యీరెంటియొక్క జ్ఞానమును బొందు టత్యవసరమైయున్నది. అట్లు పొందని యెడల ప్రతివారును తాముజేయు వ్యవహార మంతయు నజ్ఞానమై యుండును. ఏవిషయమైనను తెలియుట వలన సుఖము గలుగును. కనుక ప్రతివారును తమ యజ్ఞానమును తొలగించుకొని జ్ఞానమును బొందుట యావశ్యకమై యున్నది.

శ్లో॥ బోధో ఽ న్యసాధనేభ్యోహి సాక్షాన్మోక్షైక సాధనం।
పాకస్యవహ్నివద్ జ్ఞానం వినా మోక్షోనసిధ్యతి॥

తాత్పర్యము:— ఆత్మస్వరూపానుభవమును గలుగ జేయు జ్ఞానము తపోమంత్ర యోగాదులైన యితరసాధనములకంటె ప్రత్యక్షమైన సంసారబంధవిమోచనమునకు ముఖ్యసాధనము.

వంటచేయుటకు నిప్పు యెట్లువలె సాధనమో యటువలె ఆత్మస్వరూపజ్ఞానము లేక ముక్తి (దుఃఖనివృత్తి) గలుగనేరదు.

(శ్రీ శంకరాచార్యకృత ఆత్మబోధమునుండి)

శ్లో॥ అవిరోధితయాకర్మనావిద్యాం వినివర్తయేత్।
విద్యా ఽ విద్యాం నిహంత్యేవ తేజస్తిమిర సంఘవత్॥

తాత్పర్యము:— కర్మ అవిద్యతో తనకు విరోధము లేక పోవుటచేతఅజ్ఞానమును మరలింపలేదు. జ్ఞానమనిననో వెలుగు దట్టమైన చీకటినివలెనే అజ్ఞానమును కొట్టివేయును.

౨. స్థూలదేహము "నేను" కాదు.

ఈ కనబడు కాలు, చేయి, ముఖము, కన్ను, మొదలైన అవయవములతో చేరియుండిన రూపమును శరీరములేక దేహము అని వ్యవహరించుచున్నాము. ఈ దేహమునకు వేరుగానుండెడి పదార్థ సముదాయమంతయు నాదియను దానిలో జేరుచున్నది గనుక పదార్థ సముదాయము నేనుకాదు. కానియెడల శరీరము నేనైయుందునేమొ విచారింతము. శరీరమన అవయవ సంఘాతమైయున్నది. అవెవ్వియన— 1 శ్రోత్రము(చెవి) 2 త్వక్కు (చర్మము) 3 చక్షువు(కన్ను) 4 జిహ్వ (నాలుక) 5 ఘ్రాణము (ముక్కు) 6 వాక్కు (మాట్లాడునది) 7 పాణి (చేయి) 8 పాదము (కాలు) 9 ఉపస్థ (మూత్రవిసర్జనము సంగమాదిక్రియలుచేయునది) 10 పాయువు (మలమును విసర్జించునది). ఈ పదియు నింద్రియములు. వీనికూడికయే శరీరము. ఇందు మొదటి దైదును బాహ్యపదార్థములను గ్రహించి వాని జ్ఞానమును బొందునవి గనుక వానికి జ్ఞానేంద్రియములనియును రెండవదైదును నియమితకార్యములనునిర్వహించునవి గనుక వానికి కర్మేంద్రియములనియును నామములు. ఇందు జ్ఞానేంద్రియములను విచారింతము.

శ్రుతి॥ శ్రోత్రాదివిజ్ఞానేంద్రియాణి। శ్రోత్ర-మాకాశే। వాయౌ-త్వక్। అగ్నౌ-చక్షు।రప్సు-జిహ్వా। పృథివ్యాం-ఘ్రాణమితి॥-

శారీరకోపనిషత్ ॥-

తాత్పర్యము:—శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వ, ఘ్రాణములనెడి నీయైదును జ్ఞానేంద్రియములనబడును. శ్రోత్రమాకాశమందును, త్వక్కు వాయువునందును, చక్షువుఅగ్నియందును, జిహ్వజలమునందును, ఘ్రాణముపృథివియందును, సంబంధించియున్నవి. శ్రీవేదాంత పంచదశియందు,

శ్లో॥ సత్వాంశైః పంచభి స్తేషాం క్రమాద్ధీంద్రియపంచకం
శ్రోత్రత్వగక్షి రసన ఘ్రాణాఖ్య ముపజాయతే ॥

తాత్పర్యము:—ఆకాశాది సూక్ష్మభూతములయొక్క అయిదైనస త్వగుణభాగములచేత క్రమముగా శ్రోత్రత్వగక్షి రసనఘ్రాణములనెడి పేర్లుగల జ్ఞానేంద్రియ పంచకము పుట్టుచున్నది.

## 3. జ్ఞానేంద్రియములు 5.

1. శ్రోత్రేంద్రియము. ఇది శబ్దమును గ్రహించును. స్థూలశరీరమందు కనుపడు గోళాకారమైన చెవి శ్రోత్రేంద్రియము కాదు. ఇదియే శ్రోత్రేంద్రియమైనయెడల శబ్దమును గ్రహించునదిచెవియే యై యుండవలెను. కాని చెవిటివాడు సుప్తుడు, మృతుడుమొదలైనవారు చెవియుండియు శబ్దమును వినుటలేదు. కనుక బాహ్యమందు గోచరించు చెవి శ్రోత్రేంద్రియముకాదు. ఇదిగోళము. దీని నాశ్రయించుకొని బహుసూక్ష్మముగా నుండి శబ్దమును గ్రహించు శక్తియే శ్రోత్రేంద్రియమైయున్నది. శరీరావయవమైనచెవి గోళమును, దీనినాశ్రయించుకొని దీనికి వేరై బహుసూక్ష్మముగానుండి శబ్దమునుగ్రహించుశక్తి శ్రోత్రేంద్రియమనబడును. దీనికి అధిష్ఠానదేవత దిక్కు. ఈదేవతచే ప్రేరేపింపబడి యీయింద్రియము శబ్దమును గ్రహించుచున్నది. ఇటులనే మిగత యింద్రియములకును నూహింపవలయును.

2. త్వక్కు. ఇది స్పర్శమును గ్రహించును. ఈ దేహమందుండు చర్మము త్వగింద్రియముకాదు. ఈ యింద్రియము శరీరమున సర్వత్ర వ్యాపించియుండును. దీనికి వాయువధిష్ఠాన దేవత.

3. చక్షువు. ఈ యింద్రియము సర్వరూపములను గ్రహించును. ఇది కంటిగ్రుడ్డు నాశ్రయించుకొని యున్నది. ఆనల్లగ్రుడ్డుకు

వేరై రూపగ్రహణ శక్తిగలదై సూక్ష్మంబైన యొక వస్తువు చక్షురింద్రియ మనంబడును. దీనికి సూర్యుం డధిష్ఠాన దేవత.

4. జిహ్వ. ఇది రుచిని గ్రహించును. ఇది కొననాలుక నాశ్రయించుకొని యున్నది. కొననాలుకకు వ్యతిరిక్తంబై రసగ్రహణ శక్తిగలదై సూక్ష్మంబై యుండు ఒక వస్తువగును. దీనికి వరుణుం డధిష్ఠాన దేవత.

5. ఘ్రాణము. ఇది గంధమును గ్రహించును. ఇది నాసికాగ్రంబు నాశ్రయించుకొని యున్నది. నాసికాగ్ర వ్యతిరిక్తంబై గంధగ్రహణ శక్తిగలదై సూక్ష్మంబైన యొక వస్తువై యున్నది. దీనికి అశ్వినీదేవత లధిష్ఠాన దేవతలు.

౮. కర్మేంద్రియములు 5.

1. వాక్కు. శబ్దంబులన్నియు దేనిచే నుచ్చరింపబడుచున్నవియో అది వాగింద్రియము. ఇది నాలుక—తాలుమూలంబులు, ఉత్తరోష్ఠాధరోష్ఠంబులు, కంఠహృదయంబులు, బ్రహ్మ రంధ్రంబులను నీ యెనిమిదిస్థానంబుల నాశ్రయించుకొని యున్నది. ఈ యష్టస్థానంబులే వాగింద్రియంబని చెప్పిన యెడల సుషుప్తి, మృతి, మూర్ఛాదులయందుగూడ నాస్థానంబులచే శబ్దంబు లుచ్చరింపబడవలయును. అట్లుచ్చరింపబడుటలేదు. కనుక నా యష్టస్థానవ్యతిరిక్తంబైవచన గ్రహణ శక్తిగలదై సూక్ష్మంబై యుండు నొకవస్తువు వాగింద్రియంబనబడును. దీనికధిష్ఠానదేవత చతుర్ముఖుండు. ఆ యధిష్ఠానదేవతచేత బ్రేరేపింపబడిన వాగింద్రియంబు సమస్త శబ్దంబుల నుచ్చరించుచుండును. ఇట్లు సర్వేంద్రియంబులకు నూహింపదగినది.

2. పాణి. ఇది పదార్థములను విడచుట గ్రహించుట యను క్రియలు చేయునది. ఈచేయి పాణీంద్రియముకాదు. ఇది గోళమును

నీ యరచేతి నాశ్రయించుకొని సూక్ష్మముగా నుండి క్రియలనాచరించునది పాణీంద్రియమునైయున్నది.

3. పాదము. గమనాగమనంబులను జేయునది పాదేంద్రియమన బడును. ఈకాలు గోళమును దీని నాశ్రయించుకొని సూక్ష్మముగా నుండునది యింద్రియమునైయున్నది. దీని కధిష్ఠానదేవత ఉపేంద్రుడు.

4. పాయువు. ఇది మలవిసర్జనమును జేయును. ఈగోళము నాశ్రయించి మలవిసర్జనము జేయు శక్తి యింద్రియమునై యున్నది. ఇది గుదము నాశ్రయించియున్నది. దీని కధిష్ఠానదేవత మృత్యువు.

5. ఉపస్థ. శుక్ల, మూత్రములను విసర్జించునది ఉపస్థేంద్రియంబన బడును. ఇది యోనిలింగముల నాశ్రయించియున్నది. దీని కధిష్ఠానదేవత ప్రజాపతి.

ఇందుకు శ్రుతి॥ వాక్పాణి పాదపాయూపస్థాఖ్యాని। కర్మేంద్రియాణి। తేషాంక్రమేణ వచనాదానగమన విసర్జనానందాశ్చైతే విషయాః। పృథివ్యాది మహాభూతేషు క్రమేణోత్పన్నాః॥ శారీరకోపనిషత్తు॥

తాత్పర్యము :—వాక్కు, పాణి, పాద, పాయూపస్థంబులను నీయైదును కర్మేంద్రియములు. అవి వరుసను మాటలాడుట, యిచ్చుట, నడచుట, విసర్జించుట, ఆనందించుట అను క్రియలను జేయును. పృథివ్యాది మహాభూతముల యంశములతో క్రమమున గలిగినవి.

స్థూలశరీరావయవములగు పైని నుదహరించిన యింద్రియ గోళములు పదియునుగాక నఖ, కేశ, రక్త, మాంస, శల్యములు మొదలైన జడపదార్థముల కూడికయె స్థూలశరీరమైయున్నది. ఇది కేవలము జడము. దీనికి బాహ్యపదార్థములను గ్రహించు శక్తిలేదు. నాశర్రీ

రము బలిసినది కృశించినది యను వ్యవహారమువలన నిదియు నాటి యనబడు పదార్థసముదాయములో జేరుచున్నది. కనుక ఈదేహము నేనుకాదు.

శ్రుతి॥ నాహంమాంసం నచాస్థీని। దేహాదన్యఃపరోస్మ్యహం। ఇతినిశ్చితవానంతః క్షీణావిద్యోవిముచ్యతే॥ నాహందుఃఖినమేదేహో బంధకోస్యాత్మనిస్థితః ! ఇతిభావానురూపేణ ముచ్యతే॥ మహోపనిషత్॥

తాత్పర్యము:—మాంసము, యెముకలు నేనుకాను. నేను దుఃఖించువాడనుకాను. దేహమును నేనుకాను. నేను దేహమునకంటెను పరమైనవాడను, అను నీ నిశ్చయముచేత అవిద్య నశించి ముక్తినిబొందును.

౫. పంచభూతములు, గుణములు సంబంధము.

ఒకమారుదృశ్యమును జూతము. మనకు గోచరించు సర్వపదార్థములును రూపములేనట్టి ఆకాశములోనున్నటుల గ్రహించుదుము. సర్వమును చలింపజేయుశక్తి నీయాకాశమునం దగుపడుచున్నది. దీనికి వాయువని పేరు. సర్వమును దహింపజేయుశక్తి యంతటను నిండియున్నది. దీనికి అగ్నియని పేరు. ఇదిగాక ద్రవశక్తి అనగా జలమును కాఠిన్యశక్తి అనగా పృథివియును గోచరించుచున్నవి. 1 ఆకాశము. 2 వాయువు. 3 అగ్ని. 4 జలము. 5 పృథివి. ఈ యైదిటితోడను దృశ్యమంతయు నిండియున్నది. ఇందుండెడి రూపములన్నియు నీయైదుభూతముల తోడను గూడియున్నవి. ఈ యైదుభూతములును నీదిగువ నుదహరింపబడిన యొక్కొక ప్రత్యేకగుణమును గలిగియున్నవి.

| భూతములు | గుణములు. |
|---|---|
| 1 ఆకాశము | శబ్దము. |
| 2 వాయువు | స్పర్శము. |
| 3 అగ్ని | రూపము. |
| 4 జలము | రసము. |
| 5 పృథివి | గంధము. |

ప్రతివస్తువునందును నీయైదుగుణములును గూడియున్నవి. ఎట్లనిన- ప్రతివస్తువునందును శబ్దము తెలియుచున్నది. స్పర్శమున్నది. రూపమును, రసమును, యేదియో యొక గంధము, నుంటున్నవి. కనుక ప్రతి వస్తువునందును శబ్దస్పర్శరూపరసగంధములను నీ యైదుగుణములును యుండియున్నవి. కనుక సర్వపదార్థములు పంచభూతమయములు. మనము "నాది" యను మమకారవృత్తితో గ్రహించెడి సమస్తపదార్థములును నీదేహముతో సహా పంచభూతమయములు.

శబ్దాదులకు నాకాశాదులకును బీజవృక్షన్యాయము వర్తించుచున్నది. ఎట్లనిన—శబ్ద తన్మాత్రము (అనగా బీజరూపముగా నుండెడి శబ్దము) వలన ఆకాశమును దానివలన శబ్దముయొక్క బహిర్గతావస్థయు గలుగుచున్నది. అటులనే స్పర్శతన్మాత్రమువలన వాయువును దానివలన స్పర్శమును, రూపతన్మాత్రమువలన నగ్నియు దానివలన రూపమును రసతన్మాత్రమువలన జలమును దానివలన రసమును, గంధతన్మాత్రమువలన భూమియు దానివలన గంధమును గలుగుచున్నవి. అనగా తన్మాత్రమువలన స్థూలభూతమును దానివలన గుణమును గలుగుచున్నవి. ఇటుల తన్మాత్రమునందు భూతమును దాని గుణమును యడగియుండునటుల యొకభూతమునం దితరభూతములు తమ తమ గుణములతో యడగియుంటున్నవి. ఎట్లన గంధగుణముతో సహా పృథివి గంధతన్మాత్రమునందును, గంధతన్మాత్ర రసమందును జలము రసముతో సహా రసతన్మాత్రమునందును నారసతన్మాత్ర రూపమునందును అగ్నిరూపముతో సహా స్పర్శమునందును స్పర్శము వాయువుతో సహా శబ్దతన్మాత్రమునందును బీజరూపములుగా నుంటున్నవి. అనగా స్థూలభూతముగా నుండు ఆకాశము వలన వాయువు, వాయువువలన అగ్ని, దానివలన జలము, నందుండి పృథివియు క్రమముగా గలిగినవి. (శ్రు॥ "ఆకాశాద్వాయుః;—వాయోరగ్నిః,— అగ్నే రాపః—అద్భ్యః పృథివీ" ఇత్యాది.

ఆకాశమునకు గుణము శబ్దమును, వాయువునకు స్వగుణము

స్పర్శమును తనయుత్పత్తికి కారణమైన ఆకాశము యొక్క శబ్దగుణముతో రెండుగుణములను అగ్నికి స్వగుణ ముష్ణమును తన యుత్పత్తికి కారణమగు వాయువుయొక్క శబ్దస్పర్శములును జేరి మూడుగుణములును, జలమునకు స్వగుణము రసమును, శబ్దస్పర్శ రూపములను జేర్చుకొని నాలుగుగుణములును, భూమికి స్వగుణము గంధమును, శబ్ద, స్పర్శ, రూప రసములను జేర్చుకొని యైదుగుణములు నున్నవి.

| | | |
|---|---|---|
| 1 ఆకాశము | శబ్దము | 1 |
| 2 వాయువు | శబ్ద, స్పర్శములు | 2 |
| 3 అగ్ని | శబ్ద, స్పర్శ,రూపములు | 3 |
| 4 జలము | శబ్ద, స్పర్శ, రూప, రసములు | 4 |
| 5 పృధివి | శబ్ద, స్పర్శ, రూప, రస,గంధములు | 5 |

ఇట్లు చెప్పుటవలన ఆకాశమునకు శబ్దమొక్కటియే గుణమనియు మిగతగుణములు లేవనియు నెంచగూడదు. ఆకాశమందు శబ్దగుణము బాగుగా పరిణమించియు మిగతగుణములు పరిణమించక బీజరూపముగా నున్నవనియు అర్థముగాని, లేవనికాదు. ఆలోచించిచూడ ప్రతి భూతమునందును మిగత భూతములన్నియు బాగుగా పరిణమించియో బీజరూపముననో యుండుచునేయున్నవి. కనుక విశ్వమంతయు విచారించువాని దేహముతో సహా పంచభూతమయము. వాయువుమున్నగు భూతములు నాలుగును ఆకాశమందును, నా యాకాశము శబ్దబీజమందును నడగియున్నది. కనుక చరాచర విశ్వమంతయు శబ్దబీజమునం దణగియున్నదనుటయందు ది చుకయు సందేహములేదు. ఈ శబ్దబీజమేదియో విచారింపవలసియున్నది. దీని నిచ్చటనిలిపి ప్రస్తుతాంశమునకు వత్తము. స్థూలదేహాది ప్రపంచము విచారించగా నేనను పదార్థము దొరకలేదు. అదియంతయు "నాది" యనబడుదానిలో జేరుచున్నది.

## ౬. జ్ఞాన కర్మేంద్రియములు "నేను" కాదు.

విశ్వమంతయు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనెడి అయిదు విధములుగా శ్రోత్ర, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణము లను నైదింద్రి

యములద్వారా మన యనుభవములోనికి వచ్చుచున్నది. ఇదిగాక పంచభూతములలో నాకాశదాని గుణము ననుసరించి వరుసను వాక్కు, పాణి పాద, ఉపస్థ, పాయువులను కర్మేంద్రియములు క్రియల నాచరించుచున్నవి. ఇవి నాయనుజ్ఞచొప్పున చేయుటయు, మాను టయు జరుగుచున్నది. కాన వీనికి నేను విలక్షణుడనుగానేయుండి నా యాకార్యములయందు బ్రవేశపెట్టుచున్నాను. కనుక జడములగు కర్మేంద్రియములు "నేను" కాదు. నేను నాకన్నులయెదుట ననేకవస్తు వులను జూచుచున్నాను. చెవులతో ననేకశబ్దములను వినుచున్నాను. కాని యింద్రియములద్వారా బాహ్యావిషయములను గ్రహించు తెలివి పరోక్షమందుండెడి వస్తువును విచారించుచున్నందున యింద్రియములు తమపనినితాము జేయుటలేదు. కనుక జ్ఞానేంద్రియములు "నేను" కాదు.

శ్రుతి॥ "యచ్చక్షుషానపశ్యతి, యేనచక్షూంషిపశ్యతి । తదేనబ్రహ్మత్వం విద్ధినేదంయదిదముపాసతే" "యచ్ఛ్రోత్రేణ నశ్రుణోతి యేన శ్రోత్రమిదంశ్రుతం । తదేవబ్రహ్మత్వంవిద్ధినేదం యదిదము పాసతే"॥ కేనోపనిషత్॥

తా॥ జనులు భిన్నముగా ఉపాసన చేయుచున్న ఈశ్వరుడు మొద లైనది బ్రహ్మ స్వరూపముకాదు. జనులు నేత్రముచేత యేబ్రహ్మ స్వరూపమును చూడనివారై దేనిచేత నేత్రవ్యాపారములను జేయుచు న్నారో దానినే బ్రహ్మస్వరూపముగా నీవు తెలిసికొనుమా. జనులు ఉపాసన జేయుచున్న యీ యీశ్వరుడు మొదలగునవి (అనగా పిపీలి కాది బ్రహ్మపర్యంతము) బ్రహ్మస్వరూపముకాదు. శ్రోత్రముచేత యేబ్రహ్మస్వరూపము వినబడనిదై యేబ్రహ్మస్వరూపముచేత శ్రోత్రమునకు విషయమైన శబ్దము వినబడుచున్నదో దానినే బ్రహ్మ స్వరూపమునుగా నీవు తెలిసికొనుమా (యని గురువు చెప్పెను.)

## ౭. అంతరింద్రియములు "నేను" కాదు.

ఇంద్రియముల ద్వారా బాహ్య విషయములను గ్రహించు తెలివి నీ ఇంద్రియములకు విలక్షణముగా నున్నది. దీనికి మనస్సని

నామము. ఇది సంకల్ప వికల్పములను జేయును. సందేహించుట దీని స్వభావము. ఈమనస్సు బాహ్య పదార్థములను ఇంద్రియముల ద్వారా గ్రహించును. కాని యిదియిట్టిదని నిశ్చయించుటకు వేరొకటి కావలసి యున్నది. దీనినే బుద్ధి యందురు. మనస్సు ఇంద్రియముల ద్వారా విషయములను గ్రహించుటయు దానిని బుద్ధి యిద మిద్ధమని నిశ్చయించుటయు జరుగుచున్నది. చలించు చిత్తము, అహంకారములను రెండు ఇంద్రియములను వేరుగా జెప్పబడుచున్నవి. కాని యీ రెండును వరుసను మనోబుద్ధులలో నంతర్భూతములని తెలియవలెను. ఇట్లు బుద్ధి నిశ్చయించునే గాని దానిని స్థిరముగా నిలువ యుంచుకొను సామర్థ్యము దానియొద్దలేదు. ప్రమాదపడుట మరచుట దాని స్వభావము. దీనిని ప్రబోధించుటకు మరియొకటి కావలయును. నాబుద్ధి మాంద్యముగానున్నది యను వ్యవహార ముండుటచేత దీనికి స్వయం ప్రకాశములేదు. కనుక మనోబుద్ధి చిత్తాహంకారములను నీయంతరింద్రియములు నాలుగును జడములైయున్నవి. ఇవి నాచేత ప్రకాశింపబడుచున్నవి కనుక నివి "నేను"కాదు.

శ్రుతి॥ యన్మనసా నమనుతే యేనాహుర్మనోమతం।
తదేవ బ్రహ్మత్వం విద్ధినేదంయదిదముపాసతే॥

తా॥ మనస్సు చేత యేబ్రహ్మస్వరూపము తలంపబడదో యేబ్రహ్మస్వరూపముచే మనస్సు వ్యాప్తమైన దానినిగా జెప్పు చున్నారో దానినే నీవు బ్రహ్మస్వరూపమునుగా తెలిసికొనుమూ. జనులు యే యీశ్వర స్వరూపాదికమును యుపాసన జేయుచున్నారోయది బ్రహ్మస్వరూపము గాదు.

శ్రుతి॥ శ్రోత్రస్యశ్రోత్రంమనసోమనోయద్వాచోహవాచంస ఉప్రాణస్యప్రాణః। చక్షుషశ్చక్షురతిముచ్యధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవన్తి॥

తా॥ ఓ శిష్యుడా నీవు మనసు మొదలగు సమస్తమును వానివాని పనులయందు బ్రవర్తింపజేయుటకు ప్రేరకుడవదని ఎవని

విషయమై నీవు ప్రశ్న జేసి యుంటివో, వాడే నేత్రము మొదలగు సమస్త యింద్రియముల యొక్క విషయములను తెలిసికొనుచున్న ఇంద్రియ స్వరూపము. అటువంటి యింద్రియరూపమగు ఆయాత్మను జ్ఞానులు తెలిసికొను విషయములను తెలిసికొనుటకు సాధనమైన శ్రోత్రాదిగోళముల యందు "నేను" అనే యభిప్రాయమును విడిచి యీలోకమునుండి మరణమైన తరువాత తిరిగి మరణము లేనివారలై ముక్తులగుచున్నారని శిష్యునితో గురువు చెప్పెను.

— కేనోపనిషత్

## ౮. "నేను"

బుద్ధి తాను జేయు నిశ్చయములను దాచుకొనుటకు నిత్యమై స్థిరమై, అఖండమైన తావొకటి కావలయును. అటుం లేనియెడల యీరోజు నిశ్చయ మీరోజునకే యంత్యము కావలయును గాని రేపు తెలివిలోనికి వచ్చుటకు వీలులేదు. పదిసంవత్సరముల క్రితము చూచిన యొక మనిషిని తిరిగి యిపుడు జూచియు సరిగాగుర్తించలేక కొంత తడవు విచారించి జ్ఞాపకము జేసికొని యెక్కడనో దాచిన వస్తువు నతి ప్రయత్నము మీద పొందినటుల "అవును" జ్ఞాపకమునకు వచ్చినది, వీనిని పది సంవత్సరముల క్రితము జూచి యితనితో నిట్టి వ్యవహారము వ్యవహరించి యున్నానని జెప్పుచున్నది. కనుక నీ పదిసంవత్సరముల నుండియు బుద్ధి యనేక నిశ్చయములను జేయుచు మరచుచుండినను వాని నన్నిటిని భద్రమైన స్థానమునుంచి యవసరమైనపుడెల్లను యందుండిదానిని తిరిగి పొందుచున్నది. సర్వానుభవములను దాచుటకు సత్యమై, జ్ఞానస్వరూపమై, యనంతమై, యేకమైన స్థానమొకటి యుండియే తీరవలయును. అట్టి వస్తువుయొక్క సాన్నిధ్యముచేతనే బుద్ధీంద్రియములు సత్యమైనవిగాను, జ్ఞానము గలవిగాను ప్రకాశించుచు విషయములను గ్రహించుచున్నవి. అట్టి సత్యజ్ఞానానందమైన వస్తువునె "ఆత్మ" యందురు. (శ్రుతి॥ "సత్యంజ్ఞానమనంతం బ్రహ్మ".) ఆత్మయన తానని యర్థము.

"సత్యజ్ఞానానంతానంద స్వరూపమైన తనవలననే" బుద్ధీంద్రియములు బ్రకాశించుచున్నవి.

శ్రుతి॥ "యద్వాచానభ్యుదితంయేనవాగభ్యుద్యతె। తదేవ బ్రహ్మత్వం విద్ధినేదంయదిదముపాసతే."

తా॥ జనులు భిన్నమైన యుపాధులతో కూడుకొనిన యీ ఈశ్వరాదికమును యుపాసన జేయుచున్నారో యిది బ్రహ్మ స్వరూపముగాదు. వాక్కు మొదలగు యింద్రియములచేత ప్రకాశింపని యే బ్రహ్మస్వరూపముచేత వాక్కు మొదలగు సర్వేంద్రియములున్న ప్రకాశింపజేయ బడుచున్నవో అదేబ్రహ్మసరూపమునుగా తెలిసికొనుమా. (అని గురువు జెప్పెను.) కేన.

"జగద్గురు శ్రీ శంకరాచార్యులవారి ఆత్మబోధయందు"

శ్లో॥ సదాసర్వగతోప్యాత్మా నసర్వత్రావభాసతె।
బుద్ధావేవావభాసేత స్వచ్ఛేషు ప్రతిబింబవత్॥. ౧౭॥

తా॥ లోకమందు యాకాశముఅంతట వ్యాపించి యుండేదిగానున్న రూపములేనిదిగానున్న ఉన్నప్పటికిన్ని అద్దము నీళ్లు మొదలైన స్వచ్ఛవస్తువులయందు బయలుగానుండే ఆకాశము తోచేరీతిగా ఆత్మయు అంతటను వ్యాపించి యుండేదిగాను రూపము లేనిదిగాను ఉన్నప్పటికిని (రాగద్వేషాది రహితమైన) బుద్ధియందు మాత్రము ప్రకాశించుచున్నాడు.

శ్లో॥ దేహేంద్రియ మనోబుద్ధి ప్రకృతిభ్యోవిలక్షణం।
తద్వృత్తిసాక్షిణంవిద్యా దాత్మానం రాజవత్సదా॥ ౧౮॥

తా॥ పట్టణమందు రాజాజ్ఞవల్ల మంత్రులు మొదలైనవారు పని చేయుచుండు నప్పుడా రాజు వారివ్యాపారములకు సంబాధించకుండా ఎట్లుచూచుచున్నాడో ఆలాగే దేహేంద్రియములు మొదలైనవి ఆయాత్మ సన్నిధానబలమువల్ల వ్యాపించుచుండగా తాను వానికి సంబంధించక సాక్షిగా చూచుచున్నాడనుట.

శ్లో॥ ఆత్మచైతన్య మాశ్రిత్య దేహేంద్రియ మనోధియః
స్వకీయార్థేషు వర్తంతేసూర్యాలోకం యథాజనాః॥ ౨౦॥

తా॥ జనులు సూర్యప్రకాశమువలన యేలాగున చైతన్యము గలవారైరో దేహేంద్రియ మనోబుద్ధులును ఆలాగే ఆత్మ ప్రకాశమువలన జ్ఞానము గలవిగా అయినవి గాని జడములగు దేహేంద్రియాదులకు స్వతః ప్రకాశము లేదు.

శ్లో॥ ప్రకాశోఽర్కస్యతోయస్య శైత్యమగ్నేర్యథోష్ణతా।
స్వభావస్సచ్చిదానంద నిత్యనిర్మలతాత్మనః॥ ౨౮॥

తా॥ సూర్యునికి ప్రకాశమును నీళ్లకు చల్లదనమును అగ్నికి ఉష్ణత్వమును స్వతస్సిద్ధమైన స్వరూపమైనట్లు ఆత్మకును సచ్చిదానంద నిత్య నిర్మలతాదులె స్వరూపమని ముముక్షువు తెలిసికొనవలసినదనుట.

శ్లో॥ హృదాకాశోదితోహ్యాత్మా బోధభానుస్తమోపహృత్।
సర్వవ్యాపీసర్వధారీ భాతిభాసయతేఖిలం॥ ౬౭॥

తా॥ అజ్ఞానమనే అంధకారమును పోగొట్టుచున్నటువంటిన్ని హృదయమనే ఆకాశమందు ఉదయించినటువంటిన్ని సమస్తమందును వ్యాపించియున్నటువంటిన్ని సమస్తమును ధరించియున్న ఆత్మ జ్ఞానము సూర్యుడుగా ప్రకాశించుచున్నాడు. సమస్తమునున్న ప్రకాశింప జేయుచున్నాడు.

"శ్రీ వేదాంతపంచదశి-ప్రత్యక్తత్త్వ వివేకము"లో

శ్లో॥ శబ్దస్పర్శాదయోవేద్యా వైచిత్ర్యాజ్జాగరేపృథక్।
తతోవిభక్తాతత్సంవిదైకరూప్యాన్నభిద్యతే॥ ౧॥

తా॥ జాగరికతావస్థయందు జ్ఞానముచేత నెరుగదగిన శబ్ద స్పర్శ రూపరస గంధములు నానావిధములుగా నుండుటవల్ల పరస్పరముగా భేదింపబడుచున్నవి. ఆశబ్ద స్పర్శాదులకంటె బుద్ధిచేత విభజింపబడిన శబ్దస్పర్శాదులయొక్క జ్ఞానము, జ్ఞానము జ్ఞానమని యేకాకారముగా నుండుట వల్ల పరస్పరము భేదింప బడదు.

శ్లో॥ తథాస్వప్నేత్ర వేద్యంతునస్థిరం జాగరేస్థిరం।
తద్భేదో తస్త యోస్సంవి దేకరూపానభిద్యతే॥ ౪॥

తా॥ స్వప్నావస్థయందును అప్రకారమే యగును. ఈస్వప్నావస్థయందు జ్ఞానముచేత నెరుగదగిన వస్తుసమూహము మరియొక సమయమందు గనబడదు. జాగరితావస్థయందు నెరుగదగిన వస్తుసమూహము మరియొక కాలమందు గనబడును. అందువల్ల ఆస్వప్న జాగరితావస్థలకు భేదము గలదు. ఆస్వప్న జాగరితావస్థల యొక్క జ్ఞానము యేకాకారమగుచు భేదింపబడదు.

శ్లో॥ సుప్తోత్థితస్య సౌషుప్తతమోబోధోభ వేత్స్మృతిః।
సాచావబుద్ధవిషయా వబుద్ధం తత్తదాతమః॥ ౫॥

తా॥ సుషుప్తినుంచి మేల్కొని లేచినవానికి సుషుప్తికాల సంబంధమైన అజ్ఞానముయొక్క జ్ఞానము స్మరణమునగును. ఆస్మృతి అనుభవింపబడిన విషయముగలది యగును. ఆయజ్ఞానము సుషుప్తికాలమం దనుభవింపబడెనని నిశ్చయింపవలెను.

శ్లో॥ సబోధోవిషయా ద్భిన్నోనబోధాత్స్వప్నబోధవత్।
ఏవంస్థానత్రయేప్యేకా సంవిత్తద్వద్దినాంతరే॥ ౬॥

తా॥ ఆసుషుప్తిసంబంధ అజ్ఞానానుభవము అజ్ఞానముకంటె అన్యమగును. స్వప్నజ్ఞానమువలె మరియొక జ్ఞానమువల్ల భేదింపబడదు. ఈ ప్రకారము ఒకదినమందుగల మూడవస్థలమందును జ్ఞానము ఒక్కటియే యగును. మరియొక దినమందును అటులనె యగును.

శ్లో॥ మాసాబ్దయుగకల్పేషు గతాగమ్యేష్వనేకధా।
నోదేతినాస్తమేత్యేకా సంవిదేషాస్వయంప్రభా॥ ౭॥

తా॥ అనేక ప్రకారములుగా భూత భవిష్యత్కాలములైన, మాసాబ్దయుగకల్పములయందు జ్ఞానమునకు భేదములేదు. ఒక్కటియైన జ్ఞానము పుట్టదు. వినాశమును పొందదు. ఈ అద్వితీయమైన జ్ఞానము స్వయముగా ప్రకాశించుచుండును.

శ్లో॥ ఇయమాత్మా పరానందః పరప్రేమాస్పదం యతః।
మానభూవంహిభూయా సమితి ప్రేమాత్మనీక్ష్యతే॥ ౮॥

తా॥ ఈజ్ఞాన వస్తువు "ఆత్మ" శబ్దముచేత వ్యవహరింప బడును. ఏకారణమువల్ల నిరుపాధికమైన స్నేహమునకు విషయమో ఆకారణమువల్ల పరమసుఖస్వరూపుడగును. ఏకారణమువలన తన విషయమై నేను లేకపోతిననునది లేదు సర్వదా నేనుండువాడ నగుదునుగాకని స్నేహము చూడబడుచున్నది.

శ్లో॥ తత్ప్రేమాత్మార్థ మన్యత్ర నైవమన్యార్థమాత్మని।
అతస్తత్పరమం తేన పరమానందతాత్మనః॥ ౯॥

తా॥ దారాపుత్రాదులయం దేస్నేహము గలదో ఆస్నేహము తన ప్రయోజనము కొరకే యగును. ఈప్రకారము తన యందుగల స్నేహము పుత్ర భార్యాదిప్రయోజన నిమిత్తము కొరకైనది కాదు. అట్టి నిరుపాధికృతమువల్ల ఆత్మవిషయమైన స్నేహము మిక్కిలి అతిశయమైనదగును. అట్టి నిరతిశయ స్నేహవిషయత్వముచేత ఆత్మకు పరమానంద రూపము సిద్ధమగును.

శ్లో॥ ఇత్థంసచ్చిత్పరానంద ఆత్మాయుక్త్యా తథావిధం।
పరబ్రహ్మతయోశ్చైక్యం శ్రుత్యంతేషూపదిశ్యతే॥ ౧౦॥

తా॥ ఈముందుజెప్పిన ప్రకారము యుక్తి చేత ప్రత్యగాత్మ సద్రూపుడును, చిద్రూపుడును, ఆనందస్వరూపుడు నగును. పరబ్రహ్మంబును సత్యజ్ఞానానంద స్వరూపమేయగును. ఆప్రత్యగాత్మ పరబ్రహ్మములకు ఏకరూపత్వము వేదాంతములయందు చెప్పబడుచున్నది.

## ౯. సాన్నిధ్యబలము.

ఆత్మయందుండి యీబుద్ధి నిశ్చయించియు, మనస్సుచే సంకల్పించియు, ఇంద్రియములచే బహిర్విషయములను బొంది యీ వ్యవహరించుచున్నది ఈబుద్ధి ఆత్మయందుండి చెవియై వినుచు, కన్నై చూచుచు,

తనువై స్పర్శమునఁ గొనుచు, జిహ్వయై రుచిఁ జూచుచు, నాసికయై నాఘ్రాణించుచు నిదియె ఆత్మయందుండి కర్మేంద్రియములై నాయా క్రియల నాచరించుచున్నది. జ్ఞానస్వరూపమైన ఆత్మ సాన్నిధ్యము చేతనే బుద్ధ్యాదులు ప్రకాశించుచున్నవి.

శ్లో॥ ఆత్మావభాసయత్యేకో బుద్ధ్యాదీ నీంద్రియాణ్యపి।
దీపోఘటాదివత్స్వాత్మాజడైస్తైర్నావభాస్యతే॥ ౨౮॥
ఆత్మబోధము.

తా॥ ఆత్మ ఒకడుగా నుండువాడైనను మనోబుద్ధి చిత్తాహంకారములనున్న, చక్షురాది ఇంద్రియములనన్న దీపము కుండ మొదలైన వానిని ప్రకాశింప జేయునట్లు ప్రకాశముగా దెలియ జేయుచున్నాడు. జడస్వరూపములైన ఇంద్రియములు మొదలైన వానిచేత ఆత్మ ప్రకాశింపబడదు.

శ్రీమహాభారతము శాంతిపర్వము, పంచమాశ్వాసము.

తే॥ అనఘ యింద్రియములు విషయములు మనసు।
బుద్ధియును నాత్మయును గ్రమంబునన యెక్కు।
డాత్మబుద్ధియునంగ నల్పాంతరంపు।
వస్తువులు బుద్ధియిన్నింట విస్తరిలుట॥ ౧౬౮॥

క॥ కనుఁ గన్నైవినుఁ జెవియై
కొను జిహ్వయయి మూరుకొను నాసికయై
తనువై స్పర్శముగైకొను
వనవద్యాబుద్ధి యాత్మయందు నిలుచుచుఁ॥ ౧౬౯॥

## ౧౦. దృశ్యమంతయు "నాది"

నాబుద్ధి మాంద్యముగా నున్నది. నామనస్సు చంచలించు చున్నది. నాయింద్రియములు బలహీనములైనవి యనుట ప్రతి వానికి ననుభవసిద్ధము. గనుక బుద్ధ్యాదీంద్రియములు మమకార

ముతో గూడిన "నాది" యనబడు పదార్థసముదాయములో జేరు చున్నవి. ఈ బాహ్యాంత రింద్రియములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములనే గ్రహించుచు ననుభవించుచున్నవి. కనుక నివియు భూతములయొక్క సూక్ష్మాంశములే గాని వేఱుగాదు. ఇవి గాక యీ దేహమును గాపాడుచుండెడి సమాన, వ్యాన, ఉదాన, ప్రాణ అపానములను అయిదు వాయువులు పంచప్రాణములను నామము తో వ్యవహరింప బడుచున్నవి. ఇవి వాయువికారములు గనుకను మనస్సుచే నిరోధింపబడునవి గనుకను పంచభూతములలో జేర్పబడినవి. దేహేంద్రియములతో సహా విశ్వమంతయు పంచభూత మయము. ఇది "ఆత్మ" వలన చూడబడుచున్నది. కనుక దీనికి దృశ్య మనియు "ఆత్మ"కు దృక్కనియు నామములు. నావలన చూడబడు చున్నది గనుక దృశ్యమంతయు "నాది" "నాది"యనబడు నీదృశ్య మంతయు పంచభూత మయమనియు, నాభూతములు శబ్దబీజమం దణగి యున్నవనియు తెలిసికొనియున్నాము. కనుక దృశ్యమంతయు శబ్దబీజమందణగి యున్నది.

## ౧౧. త్రివిధ శరీరములు, వివరము.

<u>౧ స్థూలశరీరము.</u> ౧ మనోబుద్ధిచిత్తాహంకారములను
అంతరింద్రియములు. ౪
౨ శ్రోత్రత్వక్చక్షుజిహ్వాఘ్రాణంబులను
జ్ఞానేంద్రియములు. ౫
3 వాక్పాణి పాదపాయూపస్థంబులను
కర్మేంద్రియములు. ౫
౪ సమాన వ్యానోదాన ప్రాణాపానంబులను
ప్రాణములు. ౫
౫ శబ్దస్పర్శరూప రసగంధములను తన్మాత్రములు ౫

తత్వములు వెరశి ౨౪

దీనితో వ్యవహరించు కాలము జాగ్రదవస్థ. ఈ అవస్థయం దిరువది నాలుగు తత్వములతో గూడిన నీస్థూల శరీరముతో వ్యవహరించు తెలివికి విశ్వుడనిపేరు.

శ్రుతి॥ "తేషాం మనుష్యాదీనాం పంచభూత సమవాయశ్శరీరం। జ్ఞాన కర్మేంద్రియైః- జ్ఞానవిషయైః - ప్రాణాది - పంచవాయుమనోబుద్ధి చిత్తాహంకారైః। స్థూలకల్పితైస్సోపి -స్థూల ప్రకృతి రుచ్యతే.॥
-యోగచూడామణ్యుపనిషత్

శ్రుతి॥ జ్ఞానేంద్రియ కర్మేంద్రి-యాంతఃకరణచతుష్టయ సంయుక్తం జాగ్రత్ ॥
-శారీరకోపనిషత్

౨ సూక్ష్మ శరీరము. ఇది భూతములయొక్క సూక్ష్మాంశములగు నింద్రియములు ప్రాణముల వలన నేర్పడినది. స్థూల శరీరమందుండెడి యింద్రియములే దీనియందును గలవు" కాని స్థూలశరీర గోళముల నేర్పరచిన స్థూలభూతసంబంధము దీనియందు లేదు. పైనసుదహరించిన స్థూలదేహ తత్వము లిరువది నాలుగింటిలో శబ్దాదులగు తన్మాత్రలనై దింటిని తగ్గించిన యెడల మిగిలియుండెడి ౧౯ తత్వములతో నీసూక్ష్మదేహము గూడియున్నది. ఇది వ్యవహరించు కాలము స్వప్నము. ఇందు వ్యవహరించు తెలివికి తైజసుడని పేరు.

శ్రుతి॥ జ్ఞానకర్మేంద్రియైః- ప్రాణాది పంచవాయు-మనోబుద్ధిశ్చ సూక్ష్మస్సోపిలింగమిత్యుచ్యతే॥
-యోగచూడామణ్యుపనిషత్ ॥

ఇందు అంతఃకరణ చతుష్టయమును మనోబుద్ధులు రెండుగా జెప్పుటచేత లింగశరీరము ౧౭ తత్వములు గలది యగుచున్నది. ఇంకను కొన్ని శ్రుతులయందు అంతఃకరణ చతుష్టయమును నాలుగుగా విభజింపక యేకతత్వముగా జెప్పుట వలనలింగశరీరము ౧౬ తత్వ

ములతో కూడి "షోడశాత్మక" మని వ్యవహరింప బడుచున్నది. ఈ మూడు విధములలో దేనిని జెప్పినను సూక్ష్మశరీరము లేక లింగశరీర మని తెలిసికొనవలయును.

శ్రుతి॥ "అంతఃకరణ చతుష్టయ సంయుక్తస్స్వప్నః"

అనగా అంతఃకరణ చతుష్టయము మాత్రము తోచుచుండుటయే స్వప్నమనబడును. (శారీరకోపనిషత్) ఈ స్థూల సూక్ష్మ దేహములు రెండును పాంచభౌతికములని తెలిసికొనియున్నాము. ఈభూతముల న్నియు వానివాని వికారములతో నజ్ఞానమందు లయించుచున్నవి. ఈ అజ్ఞానమును మనము గాఢసుషుప్తియందనుభవించుచున్నాము. జాగ్రత్స్వప్నములయందుగు వ్యవహరించు వ్యవహారమంతయు సుషుప్తి యందు లయించుచున్నది.

3 కారణశరీరము. ఇందు భౌతికములగు తత్వములులేవు. ఇది అజ్ఞానమను యొకే తత్వముతో గూడిన శరీరము. ఇది వ్యవహరించు కాలము సుషుప్తి. ఇది వ్యవహరించు తెలివికి ప్రాజ్ఞుడని నామము.
శ్రుతి॥ "అనాదిమాయాసుప్తోజీవః"

ఈ జీవునికి అనాదిగా గలిగి యుండు అజ్ఞానమే కారణశరీర మనబడును.

శ్రుతి॥ "చిత్తైకకరణా సుషుప్తిః"

కేవల అజ్ఞానమందు అంతఃకరణ చతుష్టయము లయించి యుండుటే నిద్రావస్థయనబడును.

శ్లో॥ అవిద్యావశగస్త్వన్యస్తద్వైచిత్ర్యాదనేకధా।
సాకారణశరీరం స్యాత్ప్రాజ్ఞస్తత్రాభిమానవాన్॥ ౧౭
—వేదాంత పంచదశి ప్రత్యక్తత్వ వివేకము.

తా॥ అవిద్యయందు ప్రతిబింబించి అవిద్యా వశమును పొందిన చిదాత్ముడో జీవుడాయెను. ఆ యవిద్యయొక్క యవిశుద్ధి

భేదము వల్ల నానావిధములు గలవాడగుచున్నాడు. ఆయావిద్య కారణ శరీరమగును. ఆకారణశరీరమందు నేననెడి యభిమానము గల జీవుడు ప్రాజ్ఞుడని చెప్పబడును.

## ౧౨. కోశపంచకము.

ఈమూడు శరీరములనే పంచకోశములుగా పెద్దలు విభజించి యున్నారు.

| శరీరము. | కోశములు. | వివరము. |
|---|---|---|
| ౧ స్థూలశరీరము. | ౧ అన్నమయకోశము. | ఇది మనము భుజించెడి అన్నము వలన వృద్ధి పొందింప బడుచున్నది. |
| ౨ సూక్ష్మశరీరము. (మూడుకోశములను గలిగి యున్నది.) | ౨ ప్రాణమయ కోశము | ఇది ప్రాణములు కర్మేంద్రియముల తోఁగూడి యున్నది. |
| | ౩ మనోమయ కోశము. | ఇదిమనస్సు పంచజ్ఞానేంద్రియములతోఁ గలసి యేర్పడుచున్నది. |
| | | ఇది బుద్ధి, జ్ఞానేంద్రియము లైదును గలసినది. |
| ౩ కారణశరీరము. | ౫ ఆనందమయకోశము. | ఇది అజ్ఞానముతో నావరింపబడి ప్రియ, మోద, ప్రమోద, వృత్తులతోఁగూడి యున్నది. |

ప్రియమనగా— ఇష్టవస్తుదర్శనమువలన లోపల యుదయించెడి సుఖ వృత్తి.

మోదమనగా— ఇష్టవస్తువు తనకు లభించినపుడు. గలుగు సుఖవృత్తి.
ప్రమోదమనగా— ఇష్టవస్తువును తాననుభవించు నప్పుడు గలిగెడు

శ్రుతి॥ అన్నకార్యాణాంసమూహోహ్యన్నమయకోశః॥ ప్రాణాదిదశవాయవోన్నమయకోశేయథావర్తంతే తథాప్రాణమయకోశః॥ ఏతత్కోశద్వయ సంయుక్తం ఆత్మామన ఆది చతుర్దశ కరణైశ్శబ్దాది విషయ- సంకల్పాది- ధర్మా- యదాకరోతి- తదామనోమయ కోశః॥ ఏతత్కోశత్రయ విశిష్టాంతఃకరణె తద్గత విశేష ధ్యానమననాది వృత్తయో యదోత్పద్యంతె తదా విజ్ఞానమయ కోశః॥ ఏతత్కోశ చతుష్టయ- కారణాజ్ఞాన సంపృక్తం। స్వకారణ జ్ఞానం- స్వరూపసుఖె- వటధానాసు- వటవృక్షఇవ। యదావర్తతే తదానందమయ కోశః॥ కోశోపాధ్యుపహితఏవ ఆత్మాకోశఇత్యుపచర్యతే॥ సర్వసారోపనిషత్.

శ్లో॥ పంచకోశాదియోగేన తత్తన్మయ ఇవస్థితః। శుద్ధాత్మా నీల వస్త్రాది యోగేనస్ఫటికోయథా॥ ౧౫॥ —ఆత్మబోధ

తా॥ పంచకోశసంబంధము చేత కల్మషరహితుడైన సచ్చిదానందాత్మ నలుపు, ఎరుపు, పసపు మొదలైన వస్త్రములయొక్క సంబంధముచేత స్ఫటికమణి యేప్రకార మాయా రంగులనందినటు లగుపడుచుండునో అటులనే (ఈ యాత్మ) ఆయాస్వరూపమున బొంది న వానివలెనే ఉంటున్నాడు.

శ్లో॥ వపుస్తుషాదిభిః కోశైర్యుక్తం యుక్త్యవఘాతతః।
ఆత్మానమాంతరం శుద్ధం వివిచ్యాత్తండులంయథా॥ ౧౬॥
—ఆత్మబోధ

తా॥ లోకములో జనులు ధాన్యముగా నోచేబియ్యమును వడ్లవల్లపొందుటకై దంచడముచేత పొట్టు, తవుడు మొదలైన వాటిని వేరు

పరచి తెలిసికొనే ప్రకారముగానే పంచకోశముల వలెనే తోచే ఆత్మనున్ను శ్రవణమనన నిధిధ్యాసములచేత శోధించి ఈసమస్తనామ రూపాత్మకమైన ఉపాధులు అసత్యమున్ను మిథ్యయున్నైనందున వీని కంటె విలక్షణుడై సత్యజ్ఞానానంద స్వరూపుడై పుణ్యాపాప రహితుడై యుండే ఆత్మ నేనేయని తెలిసికొన వలసినదనుట.

శ్లో॥ అన్వయవ్యతిరేకాభ్యాం పంచకోశవివేకతః।
స్వాత్మానం తతఉద్ధృత్య పరంబ్రహ్మప్రపద్యతే॥ ౩౭॥
పంచదశి. ప్రత్యక్తత్వ వివేకము.

అన్వయ వ్యతిరేకములచేత పంచ కోశములకంటె ప్రత్యగాత్మను బుద్ధిచేత భిన్నముగా జేసినైననను, లేక తన స్వరూపమగు ప్రత్యగాత్మకంటె పంచకోశములను బుద్ధిచేత భిన్నముగా జేసినైనను సస్వరూపమగు ప్రత్యగాత్మను నాపంచకోశములనుంచి బుద్ధిచేత నెత్తి బ్రహ్మమును పొందుచున్నాడు. అనగా ప్రత్యగాత్మకు చిదానంద రూపమును నిశ్చయించుటచేత పంచకోశముల కంటె అన్యమగు ప్రత్యగాత్మ రూప పరబ్రహ్మమె పురుషుడగుచున్నాడని యభిప్రాయము.

ఆత్మ యీ యైదు కోశముల వలనను ఆవరింపబడి కోశములే తానను తాదాత్మ్యభావమును బొందుచున్నది. ఈ యైదు కోశములును స్థూల, సూక్ష్మ, కారణములను మూడు శరీరములయందు దిమిడి యున్నవి. ఇట్టి తాదాత్మ్య భావమును బొందుటకు అజ్ఞానము మూల కారణము.

(తానుకాని దానియందు తానని దోచు భ్రమ తాదాత్మ్య మనబడును)

౧౩. "అజ్ఞానమె జీవత్వము."

కారణమగు నీ యజ్ఞానమువలన నావరింపబడి "ఆత్మ" తాను పాంచభౌతికుడననియు సుఖదుఃఖములు తానే పొందుచుంటిననియు, దేహోత్పత్తియందు పుట్టి దేహపాతమందు మరణించుచుంటినను నీ మొదలగు భ్రాంతులలోనై స్థూలాదిదేహ తాదాత్మ్యమునుపొంది

జీవుడని వ్యవహరింపబడుచు జనన మరణములకు లోనగుచున్నాడు. సుషుప్త్యవస్థయందు తనకేమియు తెలియలేదనెడి యజ్ఞానమునేగాక తాను హాయిగా నుంటిననెడి ఆనందానుభవమును గూడను బొందు చున్నాడు. తా నానందమాత్రుడుగా నుండినను అజ్ఞానావరణ ముం డుటచేత భ్రిమాత్ముడై వివిధావస్థలయందును వ్యవహరించుచున్న టులను తత్ఫలములను బొందుచున్నటుల నున్నాడు. అజ్ఞానావరణము నుండి తొలగి ఆనందమును బొందవలయుననిన పై మూడవస్థలను దాటి నాలవ మెట్టెక్కవలయును. దీనికి తురీయావస్థయని పేరు. ఇటుల జీవుడీ శరీరమందు నీమూడవస్థలను మాటిమాటికి బొందు చున్నటులనే శరీరాంతరములను గూడను బొందుచున్నటు లున్నాడు.

శ్రుతి॥ పంచవర్గ- ధర్మిభూతాత్మ- జ్ఞానామృతేన- వినశ్యత్యాత్మ- సన్నిధౌ । నిత్యత్వేన ప్రతీయతేచ । మూలావిద్యేత్యాత్మోపాధి- ర్యస్తదేవ - లింగశరీరబీజం । హృదయగ్రంథరిత్యుచ్యతే । తత్ప్రతిఫలితం చైతన్యం- యత్ - ప్రకాశతే- సఃక్షేత్రజ్ఞః॥

—సర్వసారోపనిషత్.

తా॥ మనాదులు (అంతరింద్రియములు) ప్రాణాదులు, సత్వాదులు (త్రిగుణములు) భూతాదులు, పుణ్యాదులు, (పుణ్య, పాప, మిశ్రమకర్మలు) అను పంచవర్గములును అవిద్యా-శక్తివలన (అజ్ఞానమువలన) గలిగినవి. ఈ అవిద్యజ్ఞానోదయమగు పర్యంతము నిత్యముగా నుండును. జ్ఞానోదయమైన వెనుక ఆత్మసన్నిధియందు తనకుతానే నశించును. అవిద్యయె- అజ్ఞానమనియు, అంతఃకరణమనియు చెప్పబడును. అదియె లింగశరీరమునకు బీజభూతము. గనుక అవిద్య కారణశరీర మనబడును. అట్టి అవిద్యయే అసంగుడైన ఆత్మకు ఉపాధి యనబడును. ఒక ముఖమె అద్దమునందు ప్రతిబింబించి రెండు ముఖములుగా కనబడుటవలన ముఖమునకు అద్దము ఉపాధియనబడును. అట్లు ఆత్మ (అవిద్యయందు) అంతఃకరణమునందు ప్రతిబింబించి రెండుగా కనబడుటవలన అవిద్య ఆత్మకు ఉపాధియనబడును. అట్టి ఉపా

ధియందు తోచిన ఆత్మయొక్క ప్రతిబింబమే చిదాభాసజీవుడనియు, లేక క్షేత్రజ్ఞుడనియు చెప్పబడును.

శ్రుతి॥ అంతఃకరణ ప్రతిబింబ చైతన్యం యత్ । తదేవావస్థా త్రయ-
భాగ్భవతి॥ సజాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థాః ప్రాప్య । ఘటీయం
త్రవదుద్విగ్నో-జాతో మృత ఇవభవతి॥ పైంగలోపనిషత్ ॥.

తా॥ అంతఃకరణమందు ప్రతిబింబించిన చైతన్యము మూడవస్థలను ప్రకాశింపజేయుచున్నది. అదియె జాగ్రదాద్యవస్థలను బొంది ఘటయంత్రమువలె (ఏతమువలె) పుట్టినదానివలెను మరణించిన దానివలెను ఉంచున్నది.

శ్లో॥ దేహేంద్రియగుణాణ్ కర్మా ణ్యమలే సచ్చిదాత్మని ।
అధ్యస్యంత్య వివేకేన గగనే నీలతాదివత్ ॥౨౧॥

—ఆత్మబోధ

తా॥ దేహేంద్రియగుణములను కర్మేంద్రియవ్యాపారములను స్వచ్ఛమైన సచ్చిదానందాత్మయందు అజ్ఞానముచేత ఆకాశమునందు నీలత్వాదుల నారోపించినట్లు ఆరోపించుచున్నారు.

శ్లో॥ అజ్ఞానాన్మానసోపాధేః కర్తృత్వాదీనిచాత్మని ।
కల్ప్యంతేంబుగతే చంద్రే చలనాది యథాంభసః ॥ ౨౨ ॥

తా॥ నీటియందు ప్రతిఫలించిన చంద్రునియందు నీటియొక్క చలనము మొదలైనవి ఏతీరుననో, ఆతీరుననే అజ్ఞానస్వరూపమైన మనస్సనే ఉపాధివల్ల కర్తృత్వ భోక్తృత్వసుఖత్వాది ధర్మములు ఆత్మయందు కల్పింపబడుచున్నవి.

శ్లో ॥ రాగేచ్ఛా సుఖదుఃఖాది బుద్ధౌ సత్యాం ప్రవర్తతే ॥
సుషుప్తౌ నాస్తి తన్నాశే తస్మాద్బుద్ధేస్తు నాత్మనః ॥ ౨౩ ॥

తా॥ రాగేచ్ఛా సుఖదుఃఖాదులు బుద్ధియందుండి విషయములయందు వ్యాపించుచున్నవి. నిద్రావస్థయందు బుద్ధికి అజ్ఞానమందు లయము కలుగగానే లేకపోవుచున్నవి. అందువల్ల యివిబుద్ధి

ధర్మములేగాని ఆత్మధర్మములుకావు. (అనగా అజ్ఞానముచేత ఆత్మయందారోపింపబడుచున్నవి.)

శ్లో ॥ ఆత్మనస్సచ్చిదంశశ్చ బుద్ధేర్వృత్తి రితి ద్వయమ్ ।
సంయోజ్య చావివేకేన జానామీతి ప్రవర్తతే ॥ ౨౫॥

తా॥ ఆత్మయొక్క సచ్చిత్స్వరూపాంశమైన జీవుడనే ప్రతిబింబమున్ను బుద్ధి వృత్తిన్ని ఈ రెంటిని చేర్చుకొని అజ్ఞానముచేత (జీవుడు) గుర్తెరుగుచున్నానని వ్యవహారమందు ప్రవేశించుచున్నాడు.

శ్లో ॥ ఆత్మనోవిక్రియానాస్తి బుద్ధేర్బోధో నజాత్వపి ।
జీవస్సర్వమలంజ్ఞాత్వా కర్తాద్రష్టేతి ముహ్యతి ॥ ౨౬॥

తా॥ ఆత్మకు వికారములేదు. బుద్ధికి ఒకానొకప్పుడున్ను జ్ఞానములేదు. జీవుడు మనస్సు మొదలైన సర్వమున్ను తానేని భ్రమించి, చేయువాడననిన్ని, చూచువాడననిన్ని మిక్కిలి మోహమును బొందుచున్నాడు.

మూ ॥ యథామదవశాదాత్మా అన్యవత్ప్రతిభాసతే ।
తథైవచిత్త్వావిద్యా తస్యవివాఽసఇతిస్థితః ॥ జ్ఞానవాశిష్ఠము.

తా॥ మద్యాదులచే గలిగిన మత్తువలన తాను ఇతరునివలె తోచునట్లు అవిద్యవలన చిదాత్మకు అచిదాత్మునివలె దోచుచున్నాడు.

## ౧౪. పునర్జన్మములున్నవి.

౧. "రోజు" అనగా సూర్యోదయ ప్రభృతి తిరిగి సూర్యోదయమువరకు మధ్యనుండుకాలము. అనగా పగలును రాత్రియు కలిసి యగుచున్నది. కాని సూర్యోదయము లగాయతు సూర్యాస్తమయమువరకు ఎటులకానేరదో అటులనే జన్మమనగా ఒకపుట్టుకలగాయతు వేరొక పుట్టుకవరకు మధ్యనుండు వ్యవధి. అనగా జీవితమును మరణమును కలిసి జన్మమగును. జీవితము మరణముతో నంత్యమగును. మరణము తిరిగి జన్మించుటతో నంత్యమగుచున్నది. కాని సాధారణముగా

లోకులు యూహించునటుల చనిపోవుటతోడనే జన్మ మంత్యము కానేరదు. కనుక జన్మమని చెప్పుటలోనే తిరిగి పుట్టుక యున్నటుల నర్థమగుచున్నది.

౨. ప్రతికార్యమునకును కారణముండియే తీరవలయును. కారణములేని కార్యముండదు. కనుక నిప్పుడు జన్మించుటకు కారణమును తెలిసికొనవలసియున్నది. ఇందునకు సనాతనధర్మమందు పూర్వజన్మకర్మయే కారణమని చెప్పబడినది. తనచే పూర్వజన్మములందు జేయబడిన కర్మయే ఉత్తరోత్తర జన్మములకు కారణమగుచున్నది. అటులైనయెడల నన్నిటికిని నాదియైన జన్మమునకు కారణమేమని శంకింపవచ్చును. కాని యీజన్మ పరంపరలకు నాదిలేనిదనియు, అనాదినుండియు జీవుడు జన్మపరంపరలను బొందుచుండెననియు, ఈశ్వరు డెట్లనాదియో అటులనే జీవుడును జన్మపరంపరలును అనాదియనియు జెప్పబడియున్నది. అటుల జన్మాంతరములు లేవనునెడల నీజన్మమే నాదియు నంత్యమునని జెప్పు సిద్ధాంతములను విచారించుదము.

ఈజన్మకు కారణము, ఈజన్మము రాకపూర్వము జీవుడెక్కడనున్నది, జన్మాంతరమందెచ్చటనుండునది, మొదలగు నంశములను గురించి యీసిద్ధాంతమందేమి చెప్పబడినదియో గమనించుదము. ఆదియం దీశ్వరు డొక్కడే యుండెననియు, తరువాత ఆయన జీవులను సృష్టించి శరీరములలో ప్రవేశపెట్టెననియును, పిమ్మట లోకమందాచరింపదగు మంచిచెడుగులను నిరూపించెననియు, మంచినిజేయువారు మరణానంతరము దేవునియొద్ద నిత్యసుఖమును బొందుదురనియు చెడుగునుజేయువారు నిత్యనరకములో నుందురనియు జెప్పుచున్నది. ఈసిద్ధాంత మెంత సమంజసముగా నున్నదియు విమర్శింతము. నిష్క్రియుడైన ఈశ్వరునికి సృష్టేచ్ఛ కలిగినది. అట్టిసంకల్పము కలుగుటకు మనస్సుండవలయును. నిశ్చయించుటకు బుద్ధికావలయును. సృష్టించుటకహంకారముండవలయును. జీవులు చేయుమంచిచెడుగులను చూచుటకు విన టకునిరూపించిచెప్పుటకు జ్ఞానకర్మేంద్రియము లావశ్యకములు. ఇంద్రియముల నిలుకడకు శరీరమావశ్యకము. బాహ్యాంతరింద్రియ

ములు మొదలగువానితో శరీరమును గలిగి మంచిచేయువారియందను గ్రహము, చెడుజేయువారియందాగ్రహములను ద్వంద్వములతో గూడి యున్నాడు. అయితే చెఱుపుచేయువారిని శిక్షించుట ద్వేషముకాదనియు వారిని మంచిమార్గమునకు దెచ్చుటకు గనుక నిది యనుగ్రహమేనని కొందరూహింపవచ్చును. కాని అటులకాదు. ఏమన మంచిమార్గమునకు ద్రిప్పుటకు విధింపబడుశిక్ష శాశ్వతముగా నుండదు. చేసిన పాపకార్యములకు తగిన శిక్షను పొందిన పిమ్మట మంచిచెడుగులను నిర్ణయించి చెడుగును విడిచి మంచినాచరించి మంచిలాభమును బొందుటకు తగిన యవకాశము జీవునికి కలుగవలెను. అటుగాక శాశ్వతమైన నరకమును జెప్పుటవలన మంచినాచరించి యనుగ్రహమును పొందుటకు అవకాశములేదు కేవలద్వేషపూరితమైన శిక్షయని చెప్పుటలో సందేహములేదు. చెడుకార్యములను జేయువారినిహమందు కేవలమానవులును, కించిజ్ఞులునగు రాజులైనను కరుణించెడు కార్యములకు శిక్షించినను తిరిగి మంచిగా ప్రవర్తించుటకు తగిన యవకాశము నిచ్చుచున్నారు. కాని పరమదయాస్వరూపుడని జెప్పబడు నీశ్వరున కట్టికరుణ గలిగియుండుటలేదు. కాబట్టి యీ సిద్ధాంతమందు జెప్పబడు నీశ్వరుడు సనాతనధర్మమందు జెప్పబడిన జీవునికంటెను తక్కువ తరగతిలో జేరుచున్నాడు. ఇచ్ఛాద్వేషములను గలిగి పాంచభౌతిక శరీరముతో గూడి యుండినటువంటి ఈశ్వరుడే జీవులను సృష్టించుటకు కారణుడగుచున్నాడు. ఇట్టివానివలన జేయబడు సృష్టిని విచారింతుదము. జీవులందరు ఈశ్వరుడు సంకల్పించిన తరువాత వచ్చినవారుగనుక నంతకుపూర్వము లేరని వేరుగ జెప్పనక్కరలేదు. అనంతముగా నుండుకాలములో శరీరధారణము జేయుచుండెడి జీవులందరును ప్రథమమందు సృష్టింపబడి భిన్నకాలములయందు తెగలుగావచ్చి భూలోకమందు పుట్టుచుందురో లేక యెప్పటికప్పుడు సృజింపబడి లోకమందు జన్మించుచుండిరో సిద్ధాంతమందెచ్చటను జెప్పబడియుండలేదు. ఎటులగలిగినను జీవులందరును శరీరధారణకు పూర్వము సమానులు. శరీరములును ఈశ్వర నిర్మితములుగనుక సమానములు. లోకసంపత్తు జీవులకొరకు జేయబడియు

న్నది. కనుక నందరును సమానముగా బొందుటకు బాధ్యులుగదా! అయితే కొందరు కుశాగ్రబుద్ధులును, కొందరు మందమతులుగను, కొందరు సౌందర్యయుతులుగను, కొందరు కురూపులుగను, కొందరు పూర్ణావయవులుగను, కొందరు వికలాంగులుగను, కొంద రాగర్భశ్రీమంతులుగను, కొందరు గర్భదరిద్రులుగను బుట్టుటకు కారణమేదియో తెలియదు. ఇందునకు వారువారు జేయు మంచిచెడుగులే కారణములని జెప్పనెడల శరీరధారణకు పూర్వము జీవులు మంచిచెడుగులను రెంటియొక్క అనుభవములేనివారు గనుక నొకరియందిచ్ఛయు మరియొకరియందు ద్వేషమును జూపుట కవకాశములేదు. ఈ వ్యత్యాసమీశ్వరలీలగా జెప్పనెడల అంత్యము దుస్సహము మహాఘోరము శాశ్వతనరకమును దలచినయెట్టి ప్రజ్ఞావంతునకైనను గుండెలు తల్లడిల్లును. అట్టిబాధను బొందువారిని జూచినవెంటనే యెట్టి కఠినహృదయుమైనను గరగి నీరగును. కనుక శాశ్వతదుఃఖపర్యవసానము గలిగిన దానిని లీలగా జెప్పగూడదు. ఆదియందు లీలగా ప్రారంభమగునెడల యంత్యము లీలగా పర్యవసానమును బొందవలయును. మంచిని జేయువారును, చెడుగును జేయువారును, వారువారు చేయుకార్యములు వారివారి మనస్సులకింపుగా నుండినవేగాని జేయరు. ఒకనివలన యొక్కమారుగా బుట్టింపబడిన జీవులకట్టి వ్యత్యాసబుద్ధుల గలిగించుట సృష్టికర్తయొక్క లోపముగాని జీవులలోపముకాదు. మంచికార్యములు జేయుయొకనికి చెడుకార్యము జేయునటు లెంతబోధించినను బాల్యమునుండియు వాని బుద్ధి మంచినే యనుసరించును గాని చెడుననుసరించదు. బాల్యమునుండియు కొందరు చెడుకార్యములనే జేయుచు నెన్నినీతులుపదేశించినను యెంతకాలము బోధించినను వారి కార్యములను వారు విడువరు. జీవులయందిట్టి వ్యత్యాసబుద్ధులను తానుగాకల్పించి వానికిఫలితముగా శాశ్వతనిగ్రహానుగ్రహములనుజూపుటఈశ్వరత్వముగాక కేవలరాక్షసకృత్యముగా తెలియవలెను ఇటుల నిరసించుటవలననీశ్వరుని నిందజేయుచున్నటుల దలచగూడదు. ఈ నిందించునది ఈశ్వరతత్త్వమును సరిగా నిర్ణయించలేని వైసిద్ధాంతావలంబులేగాని విమర్శకులుగారు. ఈ సిద్ధాంతము

దీశ్వరతత్త్వము సరిగా నిర్ణయింబపడియుండ లేదని ఋజువుచేయబడినది గాని నిందించుటకాదు. ఈశ్వరతత్త్వము నెటుల నిర్ణయించలేకపోయినదో యటులనే జీవతత్త్వమును, సృష్టిని, నిర్ణయించలేక పోయినదనుటలో సందేహము లేదు. జీవేశ్వర జగత్తత్త్వములను సత్యముగా నిరూపించలేనిది సిద్ధాంతమనుటయెట్లు? ఇది కేవలమపసిద్ధాంతము.

ఇకను స్వభావవాదమును విచారించుదము. ఈ వాదమందు తలిదండ్రుల శుక్లశోణితముల వలన శరీరము లుత్పత్తియై పెరిగి నశించుచున్నవని చెప్పబడుచున్నది. ఇటులుత్పత్తి స్థితిలయములను బొందుచుండుట స్వభావసిద్ధము. సృష్టికి కారణము స్వభావమై యున్నది. స్వభావమననేమి? స్వభావమనిన యొక స్వతంత్ర వస్తువుకాదు. అది యొక శక్తియై యున్నది. శక్తికి స్వాతంత్ర్యపుటునికిలేదు. అది యెప్పుడును యేదియో యొక వస్తువు నాశ్రయించి యుండవలసినదై యున్నది. అది వాని స్వభావము. ఇట్లు చేయుట నా స్వభావము. ఇది వివి స్వభావమని జెప్పుచుండుట మన యనుభవములో నున్నది. గనుక నిది యెవరి స్వభావమో విచారించవలసి యున్నది. ఎవ్వరైతే నేను పుట్టినాను, పెరుగుచున్నాను, బలముగానున్నాను, చిక్కినాను అని శరీరమునకు వేరుగానుండి తద్వారా సుఖదుఃఖముల ననుభవించుచున్నారో యట్టి జీవుల యొక్క స్వభావమని చెప్పవలయునుగాని కేవల శక్తి స్వరూపమైన స్వభావమునకు కారణత్వమును జెప్పగూడదు. గనుక నీ వాదమును సరియైనదికాదు.

౩. లోకమందు జీవులందరును వారివారి స్వభావములచేత బుట్టుచున్న యెడల హెచ్చుతగ్గు భేదములుండుటకు వేరు కారణముండియే తీరవలయును. జీవులందరును హెచ్చుగా నుండవలయునని కోరుచున్నారుగాని తగ్గుగానుండుట కెవరును గోరుటలేదు, అయినను హెచ్చుతగ్గులను బొందుచున్నారు. ఈ హెచ్చుతగ్గులకు కారణమేమి? అది వారివారి పుణ్యపాపఫలము. జీవులకు జన్మాంతరముల నొప్పుకొనిన యెడల పుణ్యపాపము లనుభవించుట కవకాశముగాని, హెచ్చుతగ్గు భేదములకు కారణముగాని లేదు. శాశ్వతమైన స్వర్గనరక

ములను జెప్పినయెడల నపసిద్ధాంతమగును గనుక జీవులందరును వారి వారి స్వభావములచేతనే జన్మపరంపరలను బొందుచు నొక జన్మమందు జేయు కర్మఫలములను జన్మాంతరములయం దనుభవించుచు తద్వారా పుణ్యపాపకర్మలవలన గలిగెడి సుఖదుఃఖములను గ్రహించి దుఃఖ హేతువగు పాపకర్మలనువిడిచి పుణ్యకర్మనుజేసి సుఖించుటకవకాశ మును బొందగలుగుచున్నారు. ఇటుల ప్రతిజన్మమందును మంచి శిక్షణ మును బొందుచు తుదకు సత్కర్మములవలన చిత్తశుద్ధినిబొంది జీవే శ్వరజ్ఞానము గలిగి ముక్తుడగుచున్నాడు. గనుక అనాదిజన్మ పరంపర లను బొందెడి జీవుడు ముక్తుడగుటకు వలయు క్రమశిక్షనుబొందుటకు జన్మాంతరములావశ్యకములు. అట్లులేనియెడల క్రమశిక్షను బొందు టకు వీలులేదు. పాపకర్మములకు ఫలముగా లోకమందు తక్కువ స్థితియందు జన్మించి బాధనుబొందుట క్రమముగా పుణ్యకర్మ ప్రవృత్తి గలిగి పాపకర్మ విముఖుడగుటకు మంచి సాధనము. ఈశ్వరుడు దయాస్వరూపుడు. గనుకనే జీవులకు వారివారి కర్మములద్వారా యనేక జన్మములను గ్రహించి ఆయా జన్మములందు క్రమమగు శిక్షను బొందించి ముక్తులగుటకు నధికారులనుగా జేయుచున్నాడు.

4. ఒకే యీడుగల యిద్దరు బాలురయందు భిన్నస్వభావము లుండుట మనము జూచుచున్నాము. అందొకడు సాత్వికుడుగాను వేరొకడు తామసుడుగాను, ఒకడు కుశాగ్రబుద్ధిగలవాడుగను, వేరొ కడు స్తబ్ధుగాను, ఒకడు సత్ప్రవర్తకుడుగాను, వేరొకడు దుష్టవర్తకు డుగా నుండుటందరికిని యనుభవసిద్ధము. ఇందుకు కారణమేమి? ఇట్టి భిన్నప్రవర్తనములను వారలకెవరు నేర్పిరి? ఇది వారివారి పూర్వజన్మ సంస్కారముగాని వేరుగాదు. గనుక జన్మాంతరముల నొప్పుకొనినను తీరవలయును.

5. అందరు నిప్పుడు తాము జన్మమెత్తినటుల యొప్పుకొను చున్నారు. దీనికి పూర్వజన్మమే కారణము కాని యెడల మరేమైన నుండి యుండవలయును. నిష్కారణముగా వచ్చినదనిన యెడల, కారణములేని కార్యముండుటకు వీలులేదు. అయినను నిష్కారణము

గానే వచ్చినదనినయెడల కారణములేని కార్యముండుటకు వీలులేదు. అయినను నిష్కారణముగానే వచ్చినదని యింకను సాధించునెడల నిటులనే నిష్కారణముగా నిదివరలో ననేకము, నికముం దనేకమును, నిప్పుడు జన్మమెత్తినవానికేల రాకూడదు? నిష్కారణముగానే జన్మ పరంపరలు నుండవచ్చును.

శ్రుతి॥ సర్వజీవభయప్రదా–స్థూలదేహ–విసర్జనీ–మరణావస్థా– భవతి॥ కర్మేంద్రియాణి జ్ఞానేంద్రియాణి – తత్తద్విషయాన్ – ప్రాణాన్ – సంసృత్య – కామకర్మాన్వితావిద్యా –భూతవేష్టితో– జీవః – దేహాంతరం – ప్రాప్య – లోకాంతరం – గచ్ఛతి ॥ ప్రాక్కర్మఫలపాకేన – ఆవర్తాంతర – కీటవద్ – విశ్రాంతిం– నైవగచ్ఛతి ॥ పైంగలోపనిషత్ ॥

తా॥ స్థూలదేహమును విడిచిపోయెడి మరణావస్థ సర్వజీవ భయప్రదమైనది. ఇట్లు స్థూలశరీరమును విడచినవాడై సూక్ష్మ శరీర ముతో కూడుకొని అజ్ఞానమనెడి భూతావేశము గలిగిన యీ జీవుడు స్వర్గనరకలోకంబులను జేరి, పూర్వము తాను భూలోకమునందు స్థూలశరీరముతోడ కూడుకొని చేసినట్టి పుణ్యపాపకర్మానుసారముగా అచ్చట దేవతాశరీరంబులను పొంది సుఖదుఃఖంబు లనుభవించి కర్మ ఫలక్షయానంతరము మరల పూర్వకర్మాను సారముగా భూలోకంబున తల్లి గర్భంబున శిశురూపంబుగానుండి జన్మించు చుండును. మరల కర్మములు చేయుచు మరణించి స్వర్గనరకంబులం బొందుచు మరల భూలోకంబును బొందుచు నిట్లు జలప్రవాహమునం దుండెడు సుడిలో తగుల్కొన్నపురుగు ఆసుడిని తప్పించుకొని దాటిపోవుటకు శక్తిలేకయా సుడియందే చుట్టిచుట్టి తిరుగుచు, నల్లాడుచుండునట్లు, జననమరణ ప్రవాహసుడిలో చిక్కుకొని పలుమారు పుట్టుచు, చచ్చుచు, దాని తప్పించుకొని దాటిపోవుటకు శక్తిలేక యల్లాడుచు దుఃఖించుచుండును.

శ్లో॥ వాసాంసిజీర్ణాని యథావిహాయ । నవానిగృహ్ణాతి నరోపరాణి ।
తథాశరీరాణివిహాయజీర్ణా । న్యన్యాని సంయాతినవానిదేహీ॥

—భగవద్గీత ౨-౨౨

తా॥ మనుష్యుడు ఎట్లు చినిగిన వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను గ్రహించునో అట్లే యాత్మ జీర్ణములైన దేహములను వదలి క్రొత్తదేహములను గ్రహించుచున్నది.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం।
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా।
గతాగతం కామకామా లభంతే॥ భగవద్గీత ౯-౨౧

తా॥ ఆజనులు గొప్పదైన స్వర్గలోక సుఖములను అనుభవించి వారి పుణ్యకర్మఫలము నశించినపిదపమరల మర్త్యలోకమునందు బుట్టుచున్నారు. ఈవిధముగా వేదకర్మలను గామ్యార్థముతో జేయువారు స్వర్గమర్త్యలోకములకు బోవుచును వచ్చుచునున్నారు.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః॥ భగవద్గీత ౧౪-౧౮

తా॥ సాత్త్వికులు దేవాదిలోకములను జెందుచున్నారు. రజోగుణముగలవారు మానుషలోకమందు మనుజులుగా జన్మించుచున్నారు. నికృష్టవ్యాపారమునందున్న తమోగుణస్థులు పశ్వాదిజన్మములను నరకములను జెందుచున్నారు.

మూ॥ కేచిత్ప్రథమజన్మానః కేచిజ్జన్మశతాధికాః ।
కేచిచ్చాఽసంఖ్యజన్మానః కేచిద్విత్రిభవాంతరాః॥ ౬౫॥
ఉపదేశోపాఖ్యానం (స్థితిప్రకరణము)

మూ॥ కేచిత్కిన్నరగంధర్వ విద్యాధరమహోరగాః ।
కేచిదర్కేందువరుణ త్ర్యక్షాధోక్షజపద్మజాః॥ ౬౬॥

మూ॥ కేచిద్బ్రాహ్మణభూపాల వైశ్యశూద్రగణాఃస్థితాః ।
కేచిత్పశ్వౌషధీపత్ర ఫలమూలపతంగకాః॥ ౬౭॥

మూ॥ కేచిత్కదంబజంబీర సాలతాలతమాలకాః ।
కేచిన్మహేంద్రవలయా ప్సహ్యామంపరమేరవః॥ ౬౮॥

మూ॥ కేచిత్తారదధిక్షీరఘృతేక్షుజలరాశయః ।
కేచిద్విశాలాఃకకుభః కేచిన్నద్యో మహారయాః॥ ౮౯॥

తా॥ పుణ్యపాపంబులయొక్క తారతమ్యంబువలన ఈజీవులలో గొందరు పరిధమజన్మంబు గలవారుగను, గొందరు నూటికి టెక్కుడు జన్మంబుల నొందినవారును, కొందరు లెక్కలేని జన్మంబుల నొందినవారును, కొందరు రెండుమూడు జన్మంబుల నొందినవారునగుదురు. అందుగొందరు కిన్నరకింపురుషులుగను, కొందరు సూర్యేందు వరుణ రుద్ర విష్ణు బ్రహ్మలుగను, కొందరు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుగను, కొందరు ఓషధీరూపులుగను, కొందరు కదంబజంబీరాది వృక్షరూపులుగను, కొందరు మహేంద్రసహ్యమందర మేర్వాదిపర్వత రూపులుగను, కొందరు నదీరూపులుగను, కొందరు లవణేక్ష్వాది సముద్రరూపులుగను, కొందరు దిగ్రూపులుగను జన్మించుచున్నారు.

మూ॥ విహరంత్యుచ్చకైః కేచిన్ని పతంత్యుత్పతంతిచ ।
కందుకాఇవ హస్తేన మృత్యునాఽవిరతంహతాః॥ ౭౦॥

మూ॥ భుక్త్వా జన్మసహస్రాణి భూయస్సంసారసంకటే ।
పతంతి కేచిదబుధాః సంప్రాప్యాప్యవివేకితాం॥ ౭౧॥

తా॥ ఈజీవులు మృత్యువుచే నెల్లపుడు పీడింపబడుచు హస్తముచే గొట్టబడిన కందుకంబుల చందంబున పైకి ఎగయుచు క్రిందబడుచు ననేకజన్మంబుల నొందుచు వివేకరాహిత్యంబున సంసారసంకటంబున బడుచున్నారు.

క॥ వినుమలుకయు గూర్మియు లే
దనవద్యా యెజ్జనంబు ♦ లందును విధికిన్
మును జేసిన కర్మము ఫల
మనుభవగోచరముసేయు ♦ నంతియుతలిత్రోన్॥

భారతము, అను. ౫-౮౭

తా॥ మనుష్యుడు ఎట్లు చినిగిన వస్త్రములను వదలి క్రొత్త వస్త్రములను గ్రహించునో అట్లే యాత్మ జీర్ణములైన దేహములను వదలి క్రొత్తదేహములను గ్రహించుచున్నది.

శ్లో॥ తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం।
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మమనుప్రపన్నా।
గతాగతం కామకామా లభంతే॥ భగవద్గీత ౯-౨౧

తా॥ ఆజనులు గొప్పదైన స్వర్గలోక సుఖములను అనుభవించి వారి పుణ్యకర్మఫలము నశించినపిదపమరల మర్త్యలోకమునందు బుట్టుచున్నారు. ఈవిధముగా వేదకర్మలను కామ్యార్థముతో జేయువారు స్వర్గమర్త్యలోకములకు బోవుచును వచ్చుచున్నారు.

శ్లో॥ ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః ।
జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః॥ భగవద్గీత ౧౪-౧౮

తా॥ సాత్త్వికులు దేవాదిలోకములను జెందుచున్నారు. రజోగుణముగలవారు మానుషలోకమందు మనుజులుగా జన్మించుచున్నారు. నికృష్టవ్యాపారమునందున్న తమోగుణస్థులు పశ్వాదిజన్మములను నరకములను జెందుచున్నారు.

మూ॥ కేచిత్ప్రథమజన్మానః కేచిజ్జన్మశతాధికాః ।
కేచిచ్చాఽసంఖ్యజన్మానః కేచిద్విత్రిభవాంతరాః॥ ౬౫॥
ఉపదేశోపాఖ్యానం (స్థితిప్రకరణము)

మూ॥ కేచిత్కిన్నరగంధర్వ విద్యాధరమహోరగాః ।
కేచిదర్కేందువరుణత్ర్యక్షాధోక్షజపద్మజాః॥ ౬౬॥

మూ॥ కేచిద్బ్రాహ్మణభూపాల వైశ్యశూద్రగణాఃస్థితాః ।
కేచిత్తృణౌషధీవల్లీ ఫలమూలపతంగకాః॥ ౬౭॥

మూ॥ కేచిత్కదంబజంబీర సాలతాలతమాలకాః ।
కేచిన్మహేంద్రవలయా స్సహ్యమందరమేరవః॥ ౬౮॥

మూ॥ కేచిత్క్షారదధిక్షీరఘృతేక్షుజలరాశయః ।
కేచిద్విశాలాః కకుభః కేచిన్నద్యో మహారయాః॥ ౧౯॥

తా॥ పుణ్యపాపంబులయొక్క తారతమ్యంబువలన ఈజీవులలో గొందరు ప్రథమజన్మంబు గలవారుగను, గొందరు నూటికి నెక్కుడు జన్మంబుల నొందినవారును, కొందరు లెక్కలేని జన్మంబుల నొందినవారును, కొందరు రెండుమూడు జన్మంబుల నొందినవారగుదురు. అందుగొందరు కిన్నరకింపురుషులుగను, కొందరు సూర్యేందు వరుణ రుద్ర విష్ణు బ్రహ్మలుగను, కొందరు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులుగను, కొందరు ఓషధీరూపులుగను, కొందరు కదంబజంబీరాది వృక్షరూపులుగను, కొందరు మహేంద్రసహ్యమందర మేర్వాదిపర్వతరూపులుగను, కొందరు నదీరూపులుగను, కొందరు లవణేక్ష్వాది సముద్రరూపులుగను, కొందరు దిగ్రూపులుగను జన్మించుచున్నారు.

మూ॥ విహరంత్యుచ్ఛ్రకైః కేచిన్ని పతంత్యుత్పతంతిచ ।
కందుకాఇవ హస్తేన మృత్యునాఽవిరతంహతాః॥ ౨౦॥

మూ॥ భుక్త్వా జన్మసహస్రాణి భూయస్సంసారసంకటే ।
పతంతి కేచిదబుధాః సంప్రాప్యాప్యవివేకితాం॥ ౨౧॥

తా॥ ఈజీవులు మృత్యువుచే నెల్లపుడు పీడింపబడుచు హస్తముచే గొట్టబడిన కందుకంబుల చందంబున పైకి ఎగయుచు క్రిందబడుచు ననేకజన్మంబుల నొందుచు వివేకరాహిత్యంబున సంసారసంకటంబునం బడుచున్నారు.

క॥ వినుమలుకయు గూర్మియు లే
దనవద్యా యెజ్జనంబు ♦ లందును విధికిన్
మును జేసిన కర్మము ఫల
మనుభవగోచరము సేయు ♦ నంతియుతెలితోన్॥

భారతము, అను. ౫-౮౭

క॥ విను తను చేసినకర్మం
బునఫల మెవ్వరికి దోఁచి • పుచ్చగరా దె
ట్లును గుడువక పో దదియున
దని పార్వతి యిట్టులనియె • విభునకు గృష్ణా॥ ౧౧౫॥

క॥ కావున గుడువక పోలియదు
దేవాసురమునులకైన • దేవీకర్మో
ద్భావితఫల మీయర్థము
నీవలవఱుపుము భవన్మ • నీష దిరముగన్ ॥ ౧౧౬ ॥

క॥ విను కర్మం బొనరించును
జననము మరణంబు నదియు • సౌఖ్యము దుఃఖం
బును గావించుం దనచే
సినదానిం బడకపోవ • శివునకు వశమే ॥ అను|| ౧-౩౮

## ౧౫. పూర్వజన్మస్మృతి యేలకలుగుటలేదు?

ఈ శరీరమందు నిత్యమును మనము జాగ్రత్స్వప్నసుషుప్తులను బొందుచున్నాము. ఒక జాగ్రదవస్థకును వేరొక జాగ్రదవస్థకును నడుమ సుషుప్తిని బొందుచున్నాము. జాగ్రదవస్థయందు బొందిన యనుభవములు సుషుప్తియందు స్మరణమాత్రముగానైన నుండుటలేదు. తిరిగి జాగ్రతను బొందినతోడనే గత జాగ్రదనుభవములు స్మరణకు వచ్చుచున్నవి. కాని యన్నియును స్మరణకు వచ్చుననుట సందేహాస్పదము. కొన్ని మరపును బొందుచున్నవి. ఇట్టు లొకశరీర మందొక కాలమందు బొందిన యనుభవములు వేరొక కాలమందు కొన్ని స్మృతిరూపముగా నుండుటయు కొన్ని మరపుగలుగుటయు ప్రతివానికి ననుభవము. సుషుప్తియొక్క యడ్డులేని యొక జాగ్రత కాలమందుననే యొకక్షణమం దొకప్రదేశమందుంచిన వస్తువు నుత్తరక్షణమందు మఱపునకు వచ్చుచున్నది. నిద్రామోహామునుబొందిన మనుజుడు జాగ్రద్వ్యవహారమును మఱచి తదనురూపమైన వేరొక వ్యవహార

మును స్వప్నమునందు గాంచుచున్నాడు. అటులనే మరణ మను మహా మోహమును పొందినజీవుడు గతజన్మవ్యవహారమును మరచుటలో నాశ్చర్యములేదు. అట్లుమరచినను దానికనురూపమైన (అనగా తత్సంస్కారజన్యమైన) వ్యవహారమందే ప్రవర్తించుచున్నాడు. ప్రతిక్షణమందును ప్రమాదపడుట జీవునికి స్వభావము. ఇట్టి స్వభావముగల జీవుడు మరణమను మహాసుషుప్తినిదాటి పుణ్యపాప లోకానుభవములను పుణ్యపాపక్షయమైన పిమ్మట చంద్రలోకమును తదనంతరము వర్షరూపముగా భూలోకమునుబొంది యోషధీరూపముగా కొంతకాలముండి వారివారి పుణ్యపాపశేష తారతమ్యములనుబట్టి పురుషులచే ననుభవింపబడి వీర్యరూపముగా మారి స్త్రీయొక్క కుక్షియందుంచబడి శిశువుగా జన్మించి క్రమముగా మనోవికారమును బొందుచున్నాడు ఇట్లు జీవుడొక శరీరమునువిడిచి వేరొకశరీరమును బొందుటకు సుమారు 1500 సంవత్సరములైనను బట్టునని పెద్దలవలన వచింపబడుచున్నది. ఒక జీవితమునం దొకదినమం దొకక్షణమందు జేసినకార్యమును తదుత్తరక్షణమందు మఱచునట్టి జీవుడు అనేక వందల సంవత్సరములు గడచినపిమ్మట యొకదానివెనుక నొకటిగా ననేకావస్థలను బొందుచు వేరుశరీరమును బొందియుండి పూర్వశరీరమునైనను నప్పటి కర్మలనైనను యెట్లు జ్ఞప్తియందుంచుకొనగలడు? ప్రమాదమే స్వభావముగాగల జీవుడు పూర్వజన్మమును మఱచుటయందేమియు నాశ్చర్యములేదు. అయినను పూర్వానుభవములన్నియు సంస్కార రూపముగా జీవునియందుండకపోలేదు. భిన్నవ్యవహారములను వ్యవహరించు పురుషుడు తాత్కాలికమం దొక వ్యవహారమును వ్యవహరించుచున్నను ఇతర వ్యవహారము లతనియందు సంస్కారరూపముగా నుండియున్నవి. కాని ప్రకాశించుటలేదు. తాను వ్యవహరించుదానిని నిల్పినతోడనే వేరొక వ్యవహారము స్మరణకు వచ్చుచున్నది. తాత్కాలిక వ్యవహారమాగిననేగాని వేరొకటి స్మరణకు వచ్చుటకు వీలులేదు. అటులనే జీవుడు ప్రస్తుతము తాను జన్మించిన స్థితిగతులనుబట్టి యనేకానుభవములను బొందుచున్నాడు. పూర్వశరీరమునందు తానుబొందిన యనుభవము

లను స్మరించుటకుముందు ప్రస్తుత వ్యవహారమంతయు నాగవలయును. రెండుభాషలను మాటలాడు సామర్థ్యముగలయొకడు తాత్కాలికము నందు తాను మాట్లాడు భాషను నిలిపినగాని రెండవభాషను స్మరించుట కవకాశములేదు. కనుక గడచిన జన్మమును స్మరించుటకు పూర్వము ప్రస్తుతము మనస్సును కలతనొందించుచుండిన సంకల్పములన్నియు నుపశమింపవలయును. ప్రస్తుత సంకల్పములు శమించుటకును పూర్వజన్మ జ్ఞప్తిగలుగుటకును తగు సాధనములను సనాతన ధర్మమందు పెద్ద లనుగ్రహించియున్నారు. కనుక వలయువారు పెద్దల నాశ్రయించి వానిని గ్రహింపవచ్చును. పూర్వజన్మమును తాను మఱచినను ప్రస్తుతము తానాచరించు కర్మములన్నియు వెనుకటి సంస్కారఫలితము లేగాని వేరుగాదు.

మూ॥ ప్రాక్తనీ సాస్మృతిర్లుప్తా యువయోరుదితాఽన్యథా।
స్వప్నే జాగ్రత్స్మృతిర్యద్వదే తన్మరణమంగనే॥ ౮౬॥

జ్ఞానవాశిష్ఠము-లీలోపాఖ్యానం.

తా॥ (పూర్వజన్మస్మృతి మాకేల లేదంటివేని) స్వప్నమునందు జాగ్రత్సంబంధమగు స్మృతినశించి వేరువిధమగు స్మృతికలిగినట్లు మీకు ఈ జన్మమునందు పూర్వపుస్మృతి నశించి వేరువిధమగు స్మృతి కలిగినది. ఇట్లు కలుగుటకు మరణము కారణమగును. (మరణము జన్మాంతరస్మృతిని నశింపజేయునని భావము)

మూ॥ యథావత్ప్రతిభాసస్య వత్సే క్రమమిమం శృణు।
అనుభూయక్షణం జీవో మిథ్యామరణమూర్ఛనాం॥ ౯౦॥

లీలోపాఖ్యానం.

విస్మృత్య ప్రాక్తనం భావ మన్యం పశ్యతి సువ్రతే।

తా॥ అబలా ప్రతిభాసముయొక్క క్రమమును చెప్పుచున్నాను వినుము. జీవుడు క్షణముసేపు మిథ్యామాత్రమగు మరణమోహమును అనుభవించి తొల్లింటి విధమునుమరచి వేరొక విధమును చూచును.

మూ॥ అథేయోహ మిహాధారే స్థితోహ మితిసుందరీ ॥౯౨॥

మూ॥ హస్తపాదాది మాన్దేహో మమాఽయమితిపశ్యతి ।
ఏతస్యాఽహంపితుఃపుత్రో వర్షాణ్యేతానిసంతిమే ॥౯౩॥
ఇమేమేబాంధవారమ్యా మమేదం రమ్యమాస్పదం ।
ఇతిభ్రాంతిర్జగత్యత్ర మృతీమోహాదనంతరం ॥౯౪॥

లీలోపాఖ్యానం.

తా॥ ఈ జగమునందు జీవుడు మృతిమోహము నొందినపిదప నేను ఈ యాధారమునందు ఉన్నాడను అనియు, చేతులు కాళ్ళు మొదలగు అవయవములుగల యీ దేహము నాది యనియు, ఇతడు నాతండ్రి, ఈయనకు నేను పుత్రుడను. నాకు ఇన్ని సంవత్సరములు గలవు. నాకు వీరు మంచిబాంధవులు. ఇది రమణీయమగు నాదు గృహము అని మొదలుగా జూచుచున్నాడు. ఇదియంతయు భ్రాంతి మాత్రమే యగును.

## ౧౬. గత జన్మసంస్కారమె ప్రకృతవ్యవహారమునకు కారణము.

"విచారణలేకయే కర్మమునందు ప్రవృత్తిగలుగుట సంస్కారమనబడును." ఒకప్పుడు విచారణద్వారా నిశ్చయింపబడిననేగాని విచారణలేని ప్రవృత్తిగలుగదు. కనుక సంస్కారము గలుగుటకు ముందు నిశ్చయముండవలయును. నిశ్చయించుటకు విచారణ యవసరము. విచారణకు విషయమవసరము. విషయములేక విచారణ యుండదు. విషయస్వరూపమే లోకము.

లోకమందు జన్మించిన యొకబిడ్డనుచూడుము. ఆబిడ్డ కొన్ని విషయములయందు దిష్టమును, కొన్నిటియందు యిష్టమును గనబరచుచున్నది. ఒకబిడ్డయిష్టమును గనబరచిన విషయమునందయిష్టమును, అయిష్టమును గనబరచిన విషయమునందిష్టమును వేరొకబిడ్డ గనబరచుచున్నది. ఇట్లు బాల్యమునుండియు నిద్దరుబిడ్డలును భిన్నవిషయములందభిరుచిని గనబరచుచున్నారు. ఇందునకు గారణమేమి?

ఇప్పుడు విచారించి ఇష్టానిష్టములను జూపిరందుమా? విచారణజ్ఞానమింకను వికసించియుండలేదు. ఇతరులవలన బోధింపబడి రందుమా? గ్రహణశక్తిలేదు. విషయములందిట్టి విచారణలేని ప్రవృత్తి అనగా "సంస్కార" మీ బిడ్డలకెట్లుకలిగినది? పైన జెప్పబడినటుల ఈ బిడ్డలకిదివరకే లోకానుభవము కలిగియున్నది. "లోకము విషయస్వరూపము." కనుక విషయమువలన విచారణయు, విచారణవలన నిశ్చయమును. నిశ్చయమువలన విచారణలేని ప్రవృత్తియు (అనగా సంస్కారమును) గలుగుచున్నది. పూర్వజన్మమునం దేమేమియొనర్చినదియు ప్రస్తుతము జ్ఞాపకమునందు లేనటుల దోచుచుండినను నిప్పటి ప్రవృత్తికి గతజన్మ అనుభవముల యొక్క సంస్కారమే కారణమగుచున్నది. కనుక ఈ జీవయాత్రను నడపునది గతజన్మ సంస్కారమేయైయున్నది. ఇట్లు తన జీవితమునందు తాను జేయుకర్మములకు గతజన్మసంస్కారము కారణమైయుండగా పూర్వజన్మస్మృతి లేదను వాడు తాను మూగవాడనని చెప్పువానిరీతి హాస్యాస్పదుడగును. తాను మూగవాడనని చెప్పు వాడెటుల మూగవాడు కానేరడో యటులనే గతజన్మస్మృతి తనకులేదని వ్యవహరించువాడును సంస్కారరహితుడు కానేరడు. కనుక జన్మాంతరములున్నవనియే రుజువగుచున్నది.

శ్రుతి॥ అనుపశ్య యథాపూర్వే ప్రతిపశ్యతథాపరే ।
సస్యమివమర్త్యః పచ్యతే సస్యమివాజాయతే పునః॥ కఠోపనిషత్ ॥

తా॥ పూర్వులు ఏప్రకారముగానో, ఆప్రకారము ఆలోచించుమా. ఇతరులు ఏప్రకారముగానో ఆప్రకారముగా ఆలోచించుమా. మనుష్యుడు పైరువలెనే జీర్ణమై మరణమగుచున్నాడు. మనుష్యుడు పైరువలెనే తిరిగి పుట్టుచున్నాడు.

శ్లో॥ తత్రతంబుద్ధిసంయోగం లభతే పౌర్వదైహికం,
యతతేచతతోభూయ స్సంసిద్ధౌకురునందన ॥౪౩॥
భగవద్గీత. ౬ అధ్యా.

తా॥ అర్జునా! పైన చెప్పినప్రకారము యోగికులమునందుబుట్టి పూర్వజన్మమునందు సంపాదించిన యాత్మానాత్మ వివేకజ్ఞానమును బొందుచున్నాడు. పూర్వసంస్కారమువలన జ్ఞానసిద్ధినిమిత్తమై మరల ప్రయత్నము చేయుచున్నాడు.

శ్లో॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ౪౪॥
—భగవద్గీత, ౬ అధ్యా.

తా॥ పైనజెప్పిన యోగభ్రష్టుడు స్వాధీనమనస్సులేనివాడై నను తన పూర్వజన్మాభ్యాసముచేత నింద్రియవిషయములలో నుండి నివృత్తుడగుచున్నాడు. యోగస్వరూపమును దెలియగోరువాడును వేదోక్తకర్మానుష్ఠానఫలములకు నతిక్రమించినవాడని యెఱుగుము.

శ్లో॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥౪౫॥
—భగవద్గీత, ౬ అధ్యా.

తా॥ జ్ఞాననిష్ఠుడు పరబ్రహ్మైక్యమునకు బ్రయత్నములు చేయుచున్నవాడై, పాపవిముక్తుడై యనేకజన్మసంస్కారములవలన బరిశుద్ధుడై తర్వాత, సర్వోత్కృష్టమైన మోక్షమును బొందుచున్నాడు.

శ్రీరాము ఉవాచ:—

మూ॥ ప్రాక్తనం వాసనాజాలం నియోజయతి మాంయథా ।
తథైవ తిష్ఠామి మునే కృపణః కింకరోమ్యహం। ౧ ॥
—జ్ఞానవాశిష్ఠము, ముముక్షువ్యవహారప్రకరణం.

తా॥ శ్రీరాముడుపలికెను. మునీంద్రా పూర్వజన్మసంబంధమగు వాసనాసముదాయము నన్ను యెట్లు నియోగించునో, అటులనే యుందుదును. కుత్సితుడ నేనేమిచేయుదును.

వశిష్ఠఉవాచ:—

మూ॥ ద్వివిధోవాసనా వ్యూహః శ్శుభశ్చై వాఽశుభశ్చతే।
ప్రాక్తనో విద్యతే రామ ద్వయోరేకతరోఽథవా ॥ ౬ ॥

తా॥ వశిష్ఠమహాముని చెప్పెను. రామచంద్రా! నీకు శుభకరంబును, అశుభకరంబును అని రెండు భేదములుగల పూర్వజన్మసంబంధమగు వాసనాసముదాయము (అనగా సంస్కారము) ఉండును. లేక రెండిటిలో ఒక్కటియైన నుండును.

మూ॥ శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహంతి వాసనాసరిత్ ।
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభేపథి ॥ ౯ ॥

తా॥ మంచిచెడుగులను రెండుమార్గములచే ప్రవహించునట్టి వాసనయనునదిని పురుషప్రయత్నముచేత మంచిమార్గమునందు నడిపింపవలయును.—

వ॥ నరేంద్రా స్వప్నావస్థయందు లింగశరీరాధిష్ఠాతయైన జీవుండు జాగ్రద్దేహాభిమానంబు విడిచి తాదృశంబకాని యతాదృశంబకాని యైన శరీరాంతరంబునొంది మనంబునందు సంస్కారరూపంబున నాహితంబైన కర్మంబు నాచరించు నాలింగశరీరంబున లోకాంతరంబున దేహావిభేదంబు నొందక తత్ఫలం బనుభవించు నదియునుంగాక దానప్రతిగ్రహాదులయందు స్థూలదేహంబునకుం గర్తృత్వంబు గలదంటివేని నహంకార మమకార యుక్తుండయిన పురుషుండు మనంబు నంజేసి యేయే దేహంబు పరిగ్రహించు నాయాదేహంబున సిద్ధంబైన కర్మంబాజీవుం డనుభవించు నట్లుగాకున్న గర్మంబు పునర్భవకారణంబగుట యుపపన్నంబుగాకుండుం గావున మనఃప్రధానంబైన లింగశరీరంబునకే కర్తృత్వం బుపపన్నంబగునని యెఱిఁగియు సిట్లనియె:—శ్రీమద్భాగవతము. (చతుర్థస్కంధము ౮౮౫.)

క॥ క్షితినుభయేంద్రియకర్మ
స్థితులను భవమందఁబడిన ♦ చిత్తము పగిదిన్ ।
ధృతిఁజిత్తవృత్తులను ల
క్షితమగు దత్పూర్వదేహ ♦ కృతకర్మంబుల్ ॥౮౮౬ ॥

వ॥ అదియెట్లనిన నీదేహంబునం జేసి యేరూపంబు నేప్రకారంబున నెప్పుడెచ్చట నగునది యనుభూతంబును నదృష్టంబును నశ్రుతంబును నైయుండు నట్టిది యొకానొక కాలంబున వాసనాశ్రయుండయిన పురుషునకుఁ దదనుభవాదియుక్తంబగు పూర్వదేహంబున ననుభూతంబును దృష్టంబును శ్రుతంబును నని విశ్వసింపు మీమనంబున ననుభూతార్థంబు గోచరింపజాల దీ మనంబె పురుషులకు శుభాశుభనిమిత్తంబులైన పూర్వాపరదేహంబులం బ్రకాశింపజేయుచుండు నీమనంబునందు నదృష్టంబును శ్రుతంబునైన యర్థంబు స్వప్నాదికమందుం దోఁచు నంటివేని నది దేశకాలక్రియాశ్రయంబని తలంపందగు నీసమస్త విషయంబులు గ్రామానురోధంబున మనంబునం జేసి భోగ్యంబులగునని మఱియు నిట్లనియె...౮౮౭.

చ॥ సుమహిత శుద్ధసత్వగుణ ♦ శోభితమున్ సరసీరుహోదరో|
త్తమగుణచింతనాపరము ♦ ధన్యమునైన మనంబునందు భూ|
రమణసుధాంశునందు నుప ♦ రాగమునన్ దవిఁదోఁచు రాహుచం|
దమునను గోచరంబగు నుదారత నీయఖిల ప్రపంచమున్ ॥౮౮౮॥

వ॥ అని వెండియు నిట్లనియె. లింగదేహమునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులు స్థూలదేహద్వారకంబులగుటన్ జేసి స్థూలదేహవినాశంబు గలుగన్ జీవునకుఁ గర్తృత్వభోక్తృత్వంబులు లేకుండుటం జేసి ముక్తిగలుగునంటివేని నీస్థూలదేహ సంబంధంబు జీవునియందు బుద్ధిమనోమోహార్థ గుణావ్యాహారూపాది లింగశరీరభంగపర్యంతంబు గలుగుచుండును. సుషుప్తిమూర్ఛాదులయందు (నిష్టవియోగాదిదుఃఖమందు) నహంకారంబు గలిగియుండునది యింద్రియోపహతిం జేసి యమావాస్యయందలి చంద్రుండునుంబోలెఁ దరుణపురుషునకు గర్భబాల్యావస్థలయందు నింద్రియపౌష్కల్యంబు లేకుండుటం జేసి యేకాదశేంద్రియస్ఫురణ సమర్థంబైన యహంకారంబు (గర్భాదులకుఁ) బ్రకాశింపని చందంబునం దోఁపకుండుఁ గావున స్థూలదేహవిచ్ఛేదకంబు లేకుండుటం జేసి వస్తుభూతార్థంబు లేకున్న నీసంసారంబు (విషయంబులయందు దాసక్తుండగు జీవునకు) స్వాప్నికార్థాగమనంబునుంబోలె

వివర్తింపను. ఈతీరునఁ బంచతన్మాత్రాత్మకంబును, త్రిగుణాత్మకంబును షోడశవికారయుక్తంబును, నయిన లింగశరీరంబు నధిష్ఠించి చేతనాయుక్తుండైన జీవుండని చెప్పంబడు. మఱియును ॥ ౮౮౯ ॥

సీ॥ తివిరి యప్పూరుషుండు ♦ దేహంబునను జేసి
యనయంబుఁ బెక్కు దే ♦ హాంతరముల
నంగీకరించుచు ♦ నవి విసర్జించుచు
సుఖదుఃఖ భయమోహ ♦ శోకములను
బొలుపొందు తద్దేహ ♦ ములన పొరిదుచునుండు
నది యెట్టులన్నను ♦ నగ్రభాగ
తృణమూఁది మఱిపూర్వ ♦ తృణపరిత్యాగంబు
గావించు తృణజలూ ♦ కయునుబోలె

ఆ॥ జీవుఁ డవనిఁ గొంత ♦ జీవించి మ్రియమాణుఁ
డగుచు నొండు దేహ ♦ మర్థిఁ జెంది
కాని పూర్వమైన ♦ కాయంబు విడువఁడు
గాన మనమె జన్మ ♦ కారణంబు ॥౮౯౦॥

తరలము॥ నరవరోత్తమ యట్లుగాన మ ♦ నంబె జీవులకెల్ల సం।
సరణకారణమట్టి కర్మవ ♦ శంబునన్ సకలేంద్రియా।
చరణుఁడౌట నవిద్యగల్గును ♦ సంతతంబు నవిద్యచేఁ
బరఁగుటన్ బహుదేహకర్మని♦బంధముల్ గలుగుంజుమీ ॥౮౯౧.

వ॥ ......అవిద్యోపాధిజీవుండు తమోగుణయుక్తుండై ప్రాచీన కర్మంబులచేత నేర్పడిన వర్తమానదేహంబు నేనని తలంచుచుండి పూర్వజన్మస్మృతిగలవాఁడై పూర్వాపరంబు లెఱుఁగంజాలకుండు.........
.........వర్తమాన వసంతాదికాలంబు భూతభావి వసంతాదికాల యోగ్యంబైన పుష్పఫలాదులు తత్కాలజ్ఞాపకంబు లెట్లు సేయునట్లు భూతభావి జన్మంబులకు ధర్మాధర్మంబులు నిదర్శనంబులు సేయుచుండు నొక్కనరుండు నొకక్షణంబును గర్మంబు సేయకుండువాఁడు లేఁడు. పూర్వసంస్కారంబులంగల గుణంబులచేతఁ బురుషుండవశుండుగావున

బలిమిఁ గర్మంబు సేయింపఁబడుచుండు. ॥ భాగవ. ౪౬-౧౧॥

ఇటుల శరీరాంతరములను బొందుచుండు నీజీవుని వ్యష్టియందురు. ఇట్టి జీవుల తోఁగూడిన బ్రహ్మాండమును సమష్టియందురు. ఈసమష్టిరూపమునకు విరాట్టనియు పేరు.

## ౧౭. ప్ర ణ వ ము.

భూతములు వానివాని గుణములతోడను, బీజములతోడను, ఆకాశమందును, నాయాకాశము శబ్దబీజమందును, యణఁగియుండుటను మనమిదివరకే తెలిసికొనియున్నాము. ఈశబ్దబీజమేదియో తెలిసికొనవలసియున్నది. ఈబీజమునుండియే సమస్తశబ్దములు నుత్పత్తిని బొందుచున్నవి. దీనియందే సర్వశబ్దములును లయించుచున్నవి. అనంతశబ్దముల యుత్పత్తిలయస్థాన మీబీజమే యై యున్నది. నిశ్శబ్దముగానుండెడి (బాహ్యశబ్దములేని) యొకస్థలమందుండి అన్యచింతలు లేని యేకచిత్తంబున నాలకింపుము. నిశ్శబ్దమగు నాస్థలమందు నీకు "ఓ" అని వినవచ్చును. వివిధశబ్దములతో నిరంతరము మ్రోగుచుండెడి సంతకు కొలది దూరముననుండి యాలకింపుము. అప్పుడును సర్వశబ్దములనుగూడి "ఓ" అనియే నీకు వినబడును. కొండొకపిడి శ్రోత్రములనుమూసి యాలకింపుము. అపుడును నీకు నదియే వినబడును. నిశ్శబ్దస్థానమందు (అనగా బాహ్యశబ్దములేని స్థలమందు) నీకేది వినబడుచున్నదో బహుశబ్ద సమన్వితస్థానమందును నీకదియే వినబడుచున్నది బాహ్యమున దేనిని నీవు వినుచుంటివో యాంతరమందును దానినే నీవు వినుచుంటివి. ఇటు లొకభాషవలననేగాక విశ్వముననుండు సమస్తభాషలనుండియు నీవు దానినే గ్రహింతువు. కనుక సమస్తశబ్దములకు నుత్పత్తిలయస్థాన మీ "ఓం" యను బీజమేయై యున్నది. దీనిని ప్రణవమందురు. దీనినుండియే విశ్వకారణములగు భూతము లుత్పత్తినొందుచు తిరిగి దీనియందుననే లయమొందుచున్నవి. ఈప్రణవమే సకలమగు శ్రుతులకాధారము. సృష్టిస్థితిలయముల కాధార మీప్రణవమేయై యున్నది. దీనితోఁగూడియుండెడి ఆత్మ శబ్దబ్రహ్మమనియు, సగుణబ్రహ్మమనియు చెప్పబడుచున్నది.

శ్రుతి॥ సోఽయ మాత్మాధ్యక్షరమోఙ్కారోఽధిమాత్రం పాదామా
త్రామాత్రాశ్చపాదా. అకారఉకారోమకారఇతి॥
మాణ్డూక్యోపనిషత్తు-తృతీయఖండః ౧.

తా॥ ఆపరమాత్మ ఓంకారమను అక్షరమును పొందియు
న్నది. ఆఓంకారమను అక్షరము, అకారఉకారమకారములనెడి
మాత్రలను పొందియున్నది. కనుక ఆపరమాత్మయొక్క నాలుగు
పాదములును నాలుగుభాగములుగా విభజింపబడిన ఓంకారము
యొక్క అకారాదిమాత్రలుగాను, ఈఅకారాదిమాత్రలు ఆత్మపాద
ములుగాను, ఉన్నవి.

శ్రుతి॥ అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచోపశమశ్శివోఽద్వైత
ఏవమోఙ్కార ఆత్మైవసంవిశత్యాత్మనాత్మానం యఏవంవేద
యఏవంవేద॥ మాండూక్య ౪. ౧.

తా॥ అకారఉకారమకారములనెడి మాత్రలులేని ఓంకార
ము వాక్కుచే వ్యవహరించుటకు నలవిగానిదియును, జాగ్రదాది ప్రపం
చనాశనముగలదియును, పరిశుద్ధమైనదియును, అద్వయ స్వరూపమై
నదియునైన పూర్వము చెప్పియుండెడి ఆత్మయొక్క చతుర్థపాదాత్మక
మగు నాత్మగానే యున్నయది. ఇట్లు ఆత్మస్వరూపమగు అకారాది
మాత్రారహితమైన ఓంకారము తన స్వరూపముతో పారమార్థిక
ఆత్మస్వరూపమును పొందుచున్నది. ఇట్లు ఓంకారమును తెలిసికొని
పొందబడిన ఓంకారసాధనముగలిగి సన్మార్గమును పొందినవారైఓం
కారముయొక్క అకారాదిమాత్రలకును, ఆత్మయొక్క విశ్వాదిపాద
ములకును, ఏర్పడిన సమానతను తెలిసికొనిన, మందమధ్యమబుద్ధులు
గలవారలకు ఇట్లుపాసింపబడిన ఓంకారము బ్రహ్మమును బొందు
టకు అలంబనమగుచున్నది. ఇట్లు ఓంకారమును తెలిసికొని యుపా
సించువాడు తిరిగిపుట్టడు.

శ్రుతి॥ "ఓమిత్యేకాక్షరంబ్రహ్మ" (బ్రహ్మ విద్యోపనిషత్తు)
తా॥ "ఓం" అను ఏకాక్షరమే, పరబ్రహ్మము.

శ్రుతి॥ అకార-ఉకార-మకారశ్చేతి । త్రయోవర్ణాః- త్రయోవేదాః- త్రయోలోకాః- త్రయోగుణాః- త్రయోఽక్షరాణి- త్రయస్స్వరాఏవ- ప్రణవః- ప్రకాశతే॥

తా॥ ప్రణవము (అనగా ఓంకారము) అకార, ఉకార, మకారములనుమూడుఅక్షరములుగాను, ఋగ్యజుస్సామములనుమూడు వేదములుగాను, స్వర్గమర్త్యపాతాళము లను మూడు లోకములుగాను, సత్వరజస్తమము లను మూడు గుణములుగాను, ఎరుపు, తెలుపు, నలుపు లను మూడువర్ణములుగాను, మూడుస్వరములుగాను ప్రకాశించుచున్నది.

శ్రుతి॥ ఓంకారప్రభవావేదా । ఓంకారప్రభవాస్స్వరాః । ఓంకారః ప్రభవంసర్వం। త్రైలోక్యం సచరాచరం॥హ్రస్వోదహతిపాపాని। దీర్ఘం సంపత్ప్రదోఽవ్యయః । అర్ధమాత్రా సమాయుక్తః । ప్రణవో మోక్షదాయకః॥ —ధ్యానబిందూపనిషత్ ॥

తా॥ ఈ చరాచర జగత్తు సర్వమును ఓంకారమునుండియే పుట్టినది. ఓంకారమును ధ్యానించువారికి దానియందలి హ్రస్వము సర్వపాపములను దహింపజేయును. దీర్ఘము శాశ్వతమైన సంపద నిచ్చును. అర్ధమాత్రతో గూడిన ప్రణవము మోక్షదాయకమై యున్నది.

శ్రుతి॥ వహ్నేర్యథా యోనిగతస్య మూర్తిర్నదృశ్యతే నైవచలిఙ్గనాశః। స భూయఏవేన్ధనయోనిగృహ్య స్తద్వోభయం వై ప్రణవేన దేహే॥ శ్వేతాశ్వతరోపనిషత్, ౧-౧౩.

తా॥ అగ్నికారణమగునరణికట్టెను పొందియున్న యగ్నియొక్క స్వరూపము మథించుటకు పూర్వము కనబడక సూక్ష్మశరీరనాశమును లేక అగ్నియే అరణికట్టెను తిరిగితిరిగి మథించుటవలన గ్రహించదగినది యైనట్లు ఆత్మస్వరూపము శరీరమునందు ఓంకారముచేతను గ్రహించతగియున్నది.

శ్లో॥ ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహర న్మామనుస్మరన్।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్ ॥
—భగవద్గీత ౮—౧౩

తా॥ పరబ్రహ్మవాచకమైన "ఓం" అనెడి యేకాక్షరము నుచ్చరించుచు ఓంకారస్వరూపుడైన నన్ను జింతించుచు నెవడు దేహమును వదలుచున్నాడో యట్టివాడు పరమోత్కృష్టమైన మోక్షపదమును బొందుచున్నాడు.

శ్లో॥ ఓంతత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధస్మృతః ।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥
—భగవద్గీత. ౧౭-౨౩.

తా॥ పరబ్రహ్మనామము ఓం, తత్, సత్ అను మూడువిధములుగా నుచ్చరింపబడును. అట్టి పరబ్రహ్మముచే బూర్వకాలమందు బ్రాహ్మణులు, వేదములు, యజ్ఞములు నిర్మింపబడినవి.

ఆత్మయందుండెడి నిశ్శబ్దబీజమునకు మూలప్రకృతియని పేరు. ఈప్రకృతి "ఆత్మ"యొక్క యొకపాదమందుననే యున్నది. మిగత మూడుపాదములును అమృతస్వరూపమని శ్రుతి నిర్దేశించుచున్నది.

శ్రు॥ "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యాఽమృతందివి"

తా॥ ఈ ఆత్మయొక్క యొకపాదము సమస్తభూతములును, దీనియొక్క మూడుపాదములును నాశనరహితమైన (అమృతస్వరూపము) పరమును అయియున్నవి.

౧౪. ఆత్మకు ప్రాకృతగుణసంబంధము.

ఈ మూలప్రకృతి సత్త్వము, రజస్సు, తమస్సులను మూడు గుణములతో గూడియున్నది. ప్రణవము అకార, ఉకార, మకారములను మూడుబీజములతో గూడియున్నది. ఈ మూడుబీజములే మూడు గుణములు. ఈ మూడుగుణములు నాత్మ నావరించుకొని యున్నవి.

సమష్టియం దాత్మయొక్క సాత్త్వికావరణము స్థితిభూతుడగు విష్ణువనియుఁ రాజసావరణము సృష్టికారణుడగు బ్రహ్మయనియు, తామసావరణము లయభూతుడగు రుద్రుడనియు నామములు. వ్యష్టియందు ఆత్మయొక్క సాత్త్వికావరణము స్వప్నభూతుడగు తైజసుడనియు, రాజసావరణము స్థూలశరీరాభిమానియగు విశ్వుడనియు, తామసావరణము సుషుప్త్యభిమానియగు ప్రాజ్ఞుడనియు నామములు. ఈత్రిగుణములచేత నావరింపబడి ఆత్మవ్యష్టియందు స్వప్నజాగ్రత్సుషుప్తులను సమష్టియందు సృష్టిస్థితిలయములను జేయుచున్నాడు. ఇట్లు గుణములను మూటిని వేరుగాజెప్పుటవలన నొకదానికొకటి సంబంధములేదని యెంచగూడదు. ఇవిగూడ లోగడవివరించిన భూతములవలెనే యొకదానియందొకటి బీజరూపముగానుండి పరిణామావస్థయందు వ్యత్యాసపడియుండుటనుబట్టి దేనిపరిణామమందు దానిపేరు వ్యవహారమేగాని యందు మిగతరెండును లేకుండనుండవు. ఇట్లు దృశ్యమంతయు నింద్రియములతోసహా పంచభూతమయము భూతములు తమోగుణసంభూతములుగనుక విశ్వమంతయు త్రిగుణస్వరూపము. ఈగుణములు మూడును ప్రణవముయొక్క మూడుపాదములు. ప్రణవము ఆత్మయొక్క ఏకపాదమునం దున్నది. కనుక ఆత్మ ప్రకృతిగుణములను తనయందారోపించుకొని సమష్టివ్యష్టిభావములచే సృష్టిస్థితిలయములను బొందించుచున్నట్టును, బొందుచున్నట్టునున్నాడు. (వాస్తవముచేత చేయుటలేదనుట) ఇంతవరకు జెప్పినదంతయు అధ్యారోపము. మధ్యమాధికారులకు ఆత్మస్వరూపమును సులభముగా బోధించుటకై కల్పింపబడినది.

శ్రుతి॥ ప్రకృతిరితిచ "బ్రహ్మణస్సకాశా న్నానావిచిత్ర జగన్నిర్మాణ సామర్థ్యక బుద్ధిరూప బ్రహ్మశక్తిరేవ ప్రకృతిః॥

—నిరాలంబోపనిషత్తు॥

తా॥ బ్రహ్మముయొక్క సాన్నిధ్యముచేత నానాచిత్రవిచిత్రములుగా జగమును నిర్మించు సమర్థత గలిగినటువంటి బుద్ధిరూపముగాగల పరమాత్మశక్తియే ప్రకృతి.

శ్రుతి॥ ఏకమేవాద్వితీయంబ్రహ్మ తస్మిన్ మరుశుక్తికా స్థాణుస్ఫటికాదౌ జల- రౌప్య- పురుష- రేఖాదివ- ల్లోహిత- శుక్ల- కృష్ణ- గుణమయీ గుణసామ్యా నిర్వాచ్యా- మూలప్రకృతి రాసీత్॥ పైంగలోపనిషత్॥

తా॥ ఎండమావులందు తోచిన జలమురీతిగాను, శుక్తియందు తోచిన రజతమురీతిగాను, స్థాణువునందు తోచినపురుషునిరీతిగాను, స్ఫటికమునందు తోచిన రేఖలరీతిగాను, అఖండ సచ్చిదానందబ్రహ్మమునందు తనకు తానే తోచినట్టి రజస్సు, సత్త్వము, తమస్సులను మూడుగుణములు కలిగిన అనిర్వాచ్యమైన మూలప్రకృతి కలదు.

శ్లో॥ సత్త్వం రజస్తమఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయం॥

భగవద్గీత. ౧౪-౫,

తా॥ అర్జునా! ప్రకృతివల్లనే సత్త్వరజస్తమములనెడి గుణములు పుట్టినవి. ఆగుణములు ప్రకృతిసంబంధమైన దేహమందు చేరనివాడుగాను నశించనివాడుగాను నుండెడి దేహిని బద్ధునిజేయువానివలె నున్నవి.

తరలము॥ పరమపూరుషు డొక్కడాఢ్యుడు ♦ పాలనోద్భవనాశముల్
సొరది జేయు ముకుందపద్మజ ♦ శూలిసంజ్ఞల బ్రాకృత
స్ఫురిత సత్త్వరజస్తమంబుల ♦ బొందునందు శుభస్థితుల్
హరిచరాచరకోటికిచ్చు న ♦ నంత సత్త్వనిరూఢుడై॥

భాగవతము ౧-౬౦

వ॥ ................నిర్గుణుండైన పరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁ ద్రిగుణంబులతోడంగూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతుని చందంబున నిజమాయావిలసితంబులయిన గుణంబులలో బ్రవేశించి విజ్ఞాన విజృంభితుండై వెలుంగు. ......... ......భాగ ౧.౬౧.

సీ॥ ఆద్యంతశూన్యంబు ♦ నవ్యయంబైతగు
తత్త్వమింతకు నుపా ♦ దానమగుట
గుణవిషయ[illegible]లు గై ♦ కొని కాలమును మహ
[illegible]దాదిభూతములు ద ♦ న్నాశ్రయింపఁ
గాలానురూపం[illegible] ♦ గైకొని యీశుండు
దనలీలకై తనుఁ ♦ దాసృజించెఁ
గర మొప్ప నఖిలలో ♦ కములందుఁ దానుండుఁ
దనలోన నఖిలంబుఁ ♦ దనరుచుండుఁ
తే॥ గాన విశ్వమ్మునకుఁ గార్య ♦ కారణములు
దాన యమ్మహాపురుషుని ♦ తనువువలనఁ
బాసి విశ్వంబు వెలియై ప్ర ♦ భాసమొందె
మానితాచార యీ ♦ వర్తమానసృష్టి॥ భాగ. 3-3౨3.

కం॥ తెఱఁగొప్ప నఖిలవిశ్వముఁ
బురుషోత్తము మాయచేతఁ ♦ బుట్టించెఁ గడున్
విరతిం బొందుచునుండుం,
గరమర్థిన్ భూతభావి ♦ కాలములందున్॥ 3౨౪.

మూ॥ సముదేతి స్వతస్తస్మాత్కాలాకలనరూపిణీ
సూక్ష్మా మధ్యా తథా స్థూలా చేతి సాకల్ప్యతే త్రిధా॥ ౧౯॥
జ్ఞానవాశిష్టము, నిర్వాణప్రకరణం.

మూ॥ సత్త్వం రజస్తమ ఇతి త్వైషైవ ప్రకృతిః స్మృతా।
ఏషైవ సంసృతిర్జంతో రస్యాః పారం పరంపదం॥ ౨౦॥

తా॥ ఆ పరబ్రహ్మమువల్లనుండి బంధించు స్వభావముగల అవిద్య దానియంతట కలుగుచున్నది. అయ్యది స్థూలము, సూక్ష్మము, మధ్యము, అని మూఁడుభేదములు గలదియగుచున్నది. ఈ యవిద్యయే సత్త్వము, రజస్సు, తమము, అను మూఁడుగుణములు గలదై ప్రకృతియని చెప్పబడుచున్నది. ఇదియే జీవునకు బంధము గలిగించుచున్నది. దీనిని తొలగించుటయే కైవల్యమగు.

## ౧౯ ప్రకృతి ఎవరిది?

ఇది గుణస్వరూపిణి గనుక నేదియో యొకవస్తువు నాశ్రయించి యుండక తప్పదు. గుణస్వరూపిణియగు ప్రకృతివలన భూతములును, వానివలన నింద్రియములు, విషయములును కలిగినవి. కాన నివి యన్నియు నాప్రకృతియొక్క వికారములు. విశ్వమంతయు ప్రాకృతము. కనుక విశ్వమందు గోచరించు రూపములన్నియు గుణసమూహములే గాని వేరుగాదు- ఎట్లన.

ఒకరూపమును జూతుము. అందేమి గోచరించుచున్నది. దాని పొడుగు, వెడల్పు, స్థూలత్వము, రంగు, వాసన మొదలగు గుణములు తప్ప నందు వస్తువేమియు గానరాదు. ఇట్టిగుణములయొక్క చేరికయే రూపము. దానినే మనము వస్తువుగా వ్యవహరించుచున్నాము. కాని సత్యముగా నందు గుణములుతక్క వస్తువు గానరాదు. కొన్ని గుణములయొక్క చేరికకు వస్తువనుటయొప్పదు. పదిసున్నలు వరుస నుంచినను యెటుల విలువయుండదో యటులనే గుణసముదాయ మెంతచేరినను విలువయుండదు. కాని సున్నలకు ముందొకటిని జేర్చిన యెడల నన్నిటికి నెటుల విలువయేర్పడునో యటులనే అనంతముగా గోచరించు గుణసముదాయమగు విశ్వమంతయు నేదియో యొక వస్తువు నాశ్రయించియే యుండవలయును. కనుక నీప్రకృతి ఎవరిది యను ప్రశ్నకు జవాబువచ్చియే తీరవలయును. ఇంతవరకు విచారించిన దంతయు మనసునబట్టినయెడల నిందుకు సమాధానము జెప్పుట సులభమే. సత్యజ్ఞానానందమైన ఆత్మవలననే విశ్వమంతయు బ్రకాశించుచున్నదని మనము లోగడ తెలిసికొనియున్నాము. ప్రకృతియంతయు ఆత్మవలననే బ్రకాశింపుచున్నది. కనుక నిది ఆత్మప్రకృతియే. "ఆత్మ యన తాను" యని యర్థము. ఇదెవరిదని యెవరడుగుచున్నారో వారికి వచ్చుజవాబేమి? తనప్రకృతియని జవాబు వచ్చుచున్నది. జీవేశ్వర జగదాకారరూపమైన ద్వైతభావమును బొందుచున్నట్టును ఆత్మజ్ఞానమువలన ద్వైతమునుండి విముక్తిని బొందుచున్నట్టును జూచుచుండుట తనప్రకృతి అనగా మాయయైయున్నది. కాని ఆత్మ (అనగా

తాను) ఎప్పుడును ద్వైతమును (అనగా బంధమును) గాని ముక్తినిగాని వాస్తవముగా బొందుటలేదు.

శ్రుతి ॥ అనాదిమాయయా సుప్తో యదాజీవః ప్రబుధ్యతే ।
అజమనిద్రమస్వప్న మద్వైతం బుధ్యతే తదా ॥
మాండూక్యం. ౨-౨౧

తా॥ అనాదిమాయచేత నిద్రించువాడగు జీవుడు ఎప్పుడు మేలుకొనుచున్నాడో, అప్పుడు పుట్టుకలేనిదియును, నిద్రలేనిదియును, స్వప్నములేనిదియునగు అద్వయస్వరూపమగు తుర్యమును తెలిసికొనుచున్నాడు.

శ్రుతి॥ ప్రపంచో యది విద్యేత నివర్తేత నసంశయః। మాయామాత్ర మిదం ద్వైతమద్వైతం పరమార్థతః ॥మాండూక్యం. ౨-౨౨॥

తా॥ ప్రపంచమనుపేరుగల ఈద్వైతముండెనేని (రజ్జుసర్పభ్రమవలెనే) పోవును. (నశించును) ఈద్వైతము (రజ్జు సర్పమువలెను, ఇంద్రజాలికుని మాయవలెను) కేవలము మాయాస్వరూపమైనది. యథార్థముగానిది యంతయు అద్వయస్వరూపమగు పరమాత్మగానే యున్నయది.

శ్రుతి॥ వికల్పో వినివర్తేత కల్పితో యది కేనచిత్। ఉపదేశాదయం వాదో జ్ఞాతే ద్వైతం నవిద్యతే॥ మాండూక్యం॥ ౨-౨౩.

తా॥ ఎవనిచేతనైనను ప్రపంచాది భ్రాంతిరూపమగు ద్వైతము కల్పితమైనదాయెనేని (రజ్జువునందలి సర్పభ్రమవలెనే) యథార్థజ్ఞానముచేత నివర్తించిపోవును. గురూపదేశనిమిత్తకమైన గురుశిష్యాదిభేదము జ్ఞానముకంటె పూర్వము (రజ్జు సర్పమువలెనే) కలిగి గురూపదేశకార్యమైన జ్ఞానము తెలియబడెనేని తిరిగి లేనిదై పోవుచున్నది.

మూ॥ మనో ముధైవాఽభ్యుదిత మసదేవాఽనవేక్షణాత్ ।
స్వప్నే స్వమరణాకారం ప్రేక్షమాణం నవిద్యతే ॥
నిర్వాణప్రకరణం- బేతాళోపాఖ్యానం॥ ౧౮.

తా॥ మనస్సు వాస్తవముచేత లేనిదే. అవిచారమువలన స్వప్నమున తిన మరణజ్ఞానమువలె గలిగినది. అందువలన విచారించునెడ నామనస్సు లేకపోవుచున్నది.

మూ॥ అనంతే చిద్ఘనానందే నిర్వికల్పైకరూపిణి ।
స్థితే ద్వితీయస్యాభావా త్కో బద్ధః కశ్చముచ్యతే ॥

౩. లవణోపాఖ్యానం.

తా॥ జ్ఞానము, ఆనందము, నిర్వికల్పము మాత్రమే రూపముగాగల ఆత్మతత్త్వముకంటె రెండవ వస్తువు లేకుండగా ఎవడు బంధింపబడినవాడు ఎవడు ముక్తినొందినవాడును అగును. (బంధము మోక్షంబును కల్పితంబులేగాని వాస్తవంబులు గావనుట.)

మూ॥ గోష్పదం యోజనవ్యూహాః స్వాసులీలా సు చేతసః
కల్పం క్షణీకరోత్యంతః క్షణం నయతికల్పతాం ॥౨ ॥

లవణోపాఖ్యానం.

తా॥ నిజముచే లేనట్టి బంధంబును మనస్సు యెట్లు కల్పించునంటివేని మనస్సుయొక్క మహిమను చెప్పుచున్నాను వినుము. మనస్సుయొక్క సంకల్పముచే ఆవు అడుగుమేర అనేకయోజనములు దూరమగును. అనేక యోజనముల ప్రదేశంబును ఆవుఅడుగు మాత్రము మేరయగును. మరియు బ్రహ్మకల్పంబును క్షణమాత్రమగును. క్షణకాలంబును బ్రహ్మకల్పంబగును. స్వప్నాదులయందు ఇట్లు అనుభవసిద్ధమేకదా.

మూ॥ ఆత్మన్యేవాత్మనావ్యోమ్ని యథా సరతి మారుతః।
తథాత్మా స్వాత్మశక్త్యైవ స్వాత్మన్యేవైతి లోలతాం॥

స్థితిదాశూరోపాఖ్యానం ॥౧౨॥

మూ॥ స్వాత్మని స్వపరిస్పందైః స్ఫురత్యచ్ఛశ్చిదర్ణవః।
ఏకాత్మక మఖండం త దిత్యంతర్భావ్యతాం దృఢం॥ ౧౬॥

తా॥ వాయువు తానయగు నాకాశమునందు తానే కలిగి చలించునట్లు ఆత్మయు చిచ్ఛక్తిచేత తనయందే కలిగి చాంచల్యము

నొందుచున్నాడు. (అనగా నాత్మయే జగంబునకు నధిష్ఠానంబును, ఉపాదానకారణంబును, నిమిత్తకారణంబును నగుచున్నాడని భావము) నిర్మలమగు చిత్తను సముద్రము తనయందు తనయొక్క చలనంబులను జగంబులచే ప్రకాశించుచున్నది. కావున నాచిత్తు ఏకరూపంబనియు, నఖండంబనియు, హృదయములోన దృఢముగా భావింపబడుగాక.

మూ॥ స్వస్వభావం విదిత్వోచ్చైరప్యనంతపదేస్థితా।
రూపం పరిమితేనాఽసౌ భావయ త్యవిభావితా ॥౪౯॥

తా॥ ఈచిచ్ఛక్తి స్వస్వరూపము నెఱింగి యున్నతంబును, ననంతంబునునగు కైవల్యపదంబున నున్నదియైనను, అవిచారంబున తనదు రూపంబును పరిమితమైనదానిగా భావించుచున్నది.

మూ॥ వికల్పకల్పితాకారం దేశకాలక్రియాస్పదం।
చితోరూపం మహాబాహో క్షేత్రజ్ఞ ఇతికథ్యతే ॥౫౦॥

మూ॥ వాసనాః కలయన్సోఽపి యాత్యహంకారతాం పునః।
అహంకారో వినిర్ణేతా కళంకీ బుద్ధిరుచ్యతే॥ ౫౨॥
బుద్ధిస్సంకల్పకలితా ప్రయాతీ మననాస్పదం।
మనో ఘనవికల్పంతు గచ్ఛంతేంద్రియతాం శనైః।
పాణిపాదాది మద్దేహమింద్రియాణి విదుర్బుధాః ॥౫౩॥

మూ॥ ఇతిశక్తిమయం చేతో ఘనాహంకారతాం గతం।
కోశకార క్రిమిరివ స్వేచ్ఛయా యాతి బంధనం॥౫౪॥

తా॥ శ్రీరామచంద్రా! సంకల్ప వికల్పాదులతో గూడినట్టియు దేశకాలవస్తువులచే పరిచ్ఛిన్నమైనట్టి చిత్తుయొక్కరూపమే క్షేత్రజ్ఞుడు (అనగా జీవుడు) అని చెప్పబడుచున్నాడు. ఆ క్షేత్రజ్ఞుడు పూర్వవాసనలను భావించుచు నహంకారరూపమును పొందెను. ఆ యహంకారంబును వాసనలచే కళంకంబునొంది నిశ్చయాత్మకమగు బుద్ధియాయెను. ఆబుద్ధియు సంకల్పాదులతోగూడి సంశయాత్మకంబగు మనస్సు ఆయెను. ఆమనంబును అధికంబులైన సంకల్పవికల్పం

బులతో గూడి ఇంద్రియరూపము నొందెను. ఆ యింద్రియములే హస్తపాదాదియుతంబగు దేహంబగుచున్నది. ఈ విధంబున సంకల్ప శక్తిరూపంబును విచిత్రశక్తియుతంబును నగు చిత్తము అహంకారంబుతోగూడి పట్టుపురువుచందంబున స్వేచ్ఛచే బంధమును పొందుచున్నది.

మూ॥ క్వచిన్మనః క్వచిద్బుద్ధిః క్వచిజ్జ్ఞానం క్వచిత్క్రియా।
క్వచిదేవేత్యహంకారః క్వచిత్పుర్యష్టకం స్మృతం॥౫౭.

మూ॥ క్వచిత్ప్రకృతి రిత్యుక్తం క్వచిన్మాయేతి కల్పితం ।
క్వచిన్మలమితి ప్రోక్తం క్వచిత్కర్మేతి సంస్థితం॥౫౮.

మూ॥ క్వచిద్బంధఇతి ప్రోక్తం క్వచిచ్చిత్త మితిస్ఫుటం ।
ప్రోక్తం క్వచిదవిద్యేతి క్వచిదిచ్ఛేతి సమ్మతం॥౫౯.

తా॥ ఇట్లు నానాశక్తియుక్తంబగు చైతన్యంబె ఒక్కచో మనస్సనియు, ఒక్కచో బుద్ధియనియు, ఒక్కచో జ్ఞానమనియు, ఒక్కచో క్రియయనియు, ఒక్కచో నహంకారమనియు, ఒక్కచో పుర్యష్టకంబనియు, ఒక్కచో ప్రకృతియనియు ఒక్కచో మాయయనియు, ఒక్కచో మలమనియు, ఒక్కచో కర్మమనియు, ఒక్కచో బంధమనియు, ఒక్కచో చిత్తమనియు, ఒక్కచో అవిద్యయనియు, ఒక్కచో ఇచ్ఛయనియు చెప్పబడుచున్నది.

మూ ॥ భావయంతీచితి శ్చేత్యం వ్యతిరిక్తమివాత్మనః ।
సంకల్పతా మివాయాతి బీజమంకురతామివ ॥ ౬౦౫ ॥

తా॥ ఆత్మచైతన్యము దృశ్యమును తనకంటె నితరమైన దానిగా భావించుచు బీజము అంకురరూపము పొందినట్లు సంకల్పరూపమును పొందుచున్నదో అనునటుల నున్నది. (ఇందుచే భ్రాంతిమాత్రముచే సంకల్పరూపమును పొందుచున్నటుల నున్నదిగాని వాస్తవము చేత పొందుటలేదని భావము.)

## ౨౦. ద్వంద్వసహిష్ణుత.

ఈప్రకృతి విద్యాఽవిద్యారూపములచే ప్రకాశింపుచున్నందున తాను విద్యతోఁగూడి ఈశ్వరుఁడును, అవిద్యతోఁగూడి జీవుఁడును నగుచున్నాడు. ఎంతవరకు నవిద్యచేత జీవుఁడుగానుండి ఈశ్వరజగములు లేరని యెంచుచున్నాడో, అంతవరకును ద్వైతభావన గలవాఁడై యహంకారమమకారజన్యములగు కామలోభాదులకు వశమై, జననమరణ ప్రవాహమునకు లోనగుచున్నాడు. ఎప్పుడు విద్యావంతుఁడై తా నాత్మస్వరూపుఁడనని తెలియుచున్నాడో, అప్పుడు జగమంతయు తనస్వరూపముగా దోఁచి తనకంటె విశ్వమునం దన్యములేదను నిశ్చయముతోఁగూడియుండి శరీరపాతమువరకును గలిగెడి సుఖదుఃఖములయందు సమదృష్టిని బొంది హర్షవిషాదములను బొందక విద్యచే సదా జాగరూకుఁడై యాత్మదృష్టిని గలిగియుండును. ఇట్టి సమదృష్టియందు భేదప్రపంచము గోచరించుచుండినప్పటికి నవిద్యాంశములగు కామలోభాదులకు వశముగాక చిత్తము విద్యాంశములగు అహింస, సత్యము, ధర్మము, దయ మొదలగు సద్గుణసంపత్తితో ప్రసన్నమగును. ఎట్టులన అవిద్యాంశమువలన పాముగాఁదోఁచిన త్రాఁడునందు క్రోధాదులుగలిగి దానిని జంపు ప్రయత్నములు జరిగి తుదకు పాముగాదనియు త్రాఁడనియు గ్రహించుటతోడనే క్రోధాదులును చంపు ప్రయత్నమును బోయి తనకావశ్యములగు కార్యములకు త్రాఁడుపయోగపడి తనకును ఇతరులకును సుఖమును గలిగించును. అటులనె అవిద్యాకాలమందు నాత్మ కన్యముగాఁదోఁచు జగము కామలోభాదులకు స్థానమై తనకును నితరులకును దుఃఖరూపముగా మారుచున్నది. అదియే విద్యాకాలమందు ఆత్మస్వరూపముగా సాక్షాత్కరించి సుఖస్వరూపమును బొందించుచున్నది.

ఎప్పుడు విద్యతోఁగూడిన చిత్త ముపరతిని బొందునో అప్పుడు తా నానందమాత్రుఁడుగానుండి సుఖదుఃఖాది ద్వంద్వముల కతీతుఁడగును. దీనినే తురీయావస్థయనియు, నిత్యసమాధియనియు జెప్పుదురు. ఈయవస్థను బొందినవాఁడు జీవన్ముక్తుఁడు.

శ్రుతి॥ పురుషస్య- కర్తృత్వ- భోక్తృత్వ- సుఖదుఃఖాది లక్షణః- చిత్తధర్మః- క్లేశరూపత్వా- ద్బంధో- భవతి తన్నిరోధనం- జీవన్ముక్తిః ॥ముక్తికోపనిషత్॥

తా॥ కర్తృత్వ భోక్తృత్వ సుఖదుఃఖములే స్వరూపము గాగల చిత్తధర్మము పురుషునికి దుఃఖరూపమగుటవలన బంధము. అట్టి చిత్తధర్మమును ద్వంద్వములయందు అభిమానించకుండా నిగ్రహించుటే జీవన్ముక్తియనబడును.

ఇంతవరకు వివరింపబడిన జాగ్రత్స్వప్నసుషుప్తులు మూడు నవిద్యాంశములనియు నాలవదియగు తురీయము విద్యాంశమనియు నెఱుగవలయును.

4. <u>తురీయము.</u> విద్యయే దీనియుపాధి. ఆత్మవిద్యతోగూడియుండెడి యీస్థితినే నిత్యసమాధియని చెప్పుదురు.

శ్రు॥ "కేవల జీవయుక్తమేవ తురీయమితి"॥ శారీరకోపనిషత్॥

తా॥ జీవుడు కేవల జ్ఞానస్వరూపముగా నుండుటే తురీయావస్థ యనబడును.

శ్రు॥ నాత్మానం నాపరాంశ్చైవ నసత్యం నాపి చానృతం
ప్రాజ్ఞఃకించ నసంవేత్తి తుర్యం తత్సర్వదృక్సదా॥ ౧౨॥
మాండూక్యం ద్వితీయఃఖండః॥

తా॥ ప్రాజ్ఞుడు తన్ను తెలిసికొనుటలేదు. తనకన్యమైన వానిని తెలిసికొనుటలేదు. ఘటాదికమును తెలిసికొనుటలేదు. అసత్యమును (శుక్తిరజతాదికమును) తెలిసికొనుటలేదు. దేనిని తెలిసికొనుటలేదు. ఆ తుర్యము (నాలుగవ పాదమైన ఆత్మ) ఎల్లప్పుడు సమస్తమును తెలిసికొనుచున్న దృక్స్వరూపము.

శ్రు॥ ద్వైతస్యాగ్రహణం తుల్య ముభయోః ప్రాజ్ఞతుర్యయోః।
బీజనిద్రాయుతః ప్రాజ్ఞః సాచ తుర్యేన విద్యతే॥
మాండూక్యం ౩-౧౩.

తా॥ ప్రాజ్ఞతుర్యాత్మలిద్దరికిన్ని జాగ్రత్స్వప్నములయందలి ద్వైతప్రపంచమును గ్రహింపకపోవుట సమానముగానున్నది. ఆరెంటిలో ప్రాజ్ఞాత్మ ద్వైతరూపమైన జాగ్రత్స్వప్నప్రపంచములను పుట్టించుటకు బీజభూతమైన నిద్రతోఁగూడియున్నది. తుర్యాత్మ అట్టి నిద్ర లేనిదై యెల్లప్పుడు అద్వయమై స్వయంప్రకాశముగా నున్నది.

శ్రుతి॥ దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనం। సంపన్నంచేత్ తదుత్పన్నా పరానిర్వాణ నిర్వృతిః ॥ మహోపనిషత్॥

తా॥ దృశ్యములన్నియు అసత్యమని సకలదృశ్యమును మఱచి స్వరూపమాత్రముగా నుండుటయే మోక్షము. ఇట్టి స్థితిని బొందినవాడు జీవన్ముక్తుడు.'

శ్రుతి॥ ఆపతత్సు యథాకాలం సుఖదుఃఖే ష్వనారతః । నహృష్యతి గ్లాయతి యః సజీవన్ముక్త ఉచ్యతే॥ మహోపనిషత్ ॥
హర్షామర్షభయక్రోధ కామకార్పణ్యదృష్టిభిః। నపరామృశ్యతే యోంతః సజీవన్ముక్త ఉచ్యతే॥ ఈప్సితానీప్సితేన స్తోయ స్వాంతర్వృత్తి దృష్టిషు। సుషుప్తవద్ యశ్చరతి సజీవన్ముక్తఉచ్యతే॥ రాగద్వేషౌ సుఖం దుఃఖం ధర్మాధర్మౌ ఫలాఫలే। యః కరోత్యనపేక్ష్యైవ సజీవన్ముక్తఉచ్యతే॥

తా॥ సంపదగలిగినప్పుడు సంతోషమునున్ను ఆపదగలిగినప్పుడు వ్యసనమునున్ను ఎవడు చెందడో, భోగంబులవలన గలుగు సంతోషము, ఓర్వలేమి, భయము, కోపము, కామము, కార్పణ్యము మొదలగునవిలేక ఎవడు అంతరాత్మజ్ఞానము కలిగియుండునో; ఎవడు విషయాదులందును, ప్రియాప్రియములయందును, ఇష్టానిష్టములులేక సకలవ్యవహారములు చేయుచున్నను, నిద్రించువానిరీతిగా ప్రపంచమును మరచి చిన్మయముగా నుండునో, ఎవడు కామక్రోధములను, సుఖదుఃఖములను, ధర్మాధర్మములను, లాభనష్టములను, అపేక్షించక యే ప్రారబ్ధానుసారముగా సకలకార్యములు చేయుచుండునో వాడు జీవన్ముక్తుడు.

మూ॥ యస్య నాహంకృతో భావో యస్యబుద్ధి ర్నలిప్యతే।
కర్తృతోఽకర్తృతోవాపి సజీవన్ముక్త ఉచ్యతే॥

తా॥ కర్మములచేయుచున్నవాడైనను, చేయనివాడైనను, ఎవ్వనికి నేను కర్తనను భావములేదో ఇక నెవ్వని బుద్ధికర్తృత్వాకర్తృత్వములతో సంబంధపడదో వాడు జీవన్ముక్తుడని చెప్పబడును.

## ౨౧. తురీయాతీతము.

దీనిని విదేహముక్తియని చెప్పుదురు. ఎప్పుడు విద్యతోగూడిన ఆత్మజ్ఞాని యవిద్యాకార్యమగు శరీరమును విడచునో అపుడు విద్యావిద్యల కతీతుడై కేవల అఖండానందస్వరూపుడై సర్వమున కాధారభూతుడై సర్వకారణంబులకును కారణంబై బ్రహ్మమనియు, పరమాత్మయనియు, భగవంతుండనియు, స్వభావమనియు, శూన్యమనియు, వివిధమతస్థులచేతను వివిధనామములచే వ్యవహరింపబడుచు నిట్టిదట్టిదని నిర్దేశించి చెప్పరాని సత్తామాత్రస్వరూపుడుగా బ్రకాశించును. ఇట్టి యతీతావస్థను తెలియజేయుటకు మనోవాక్కులయొక్కయుపశమముతక్క వేరొండవకాశము లేదు.

శ్రుతి॥ జీవన్ముక్తపదంత్యక్త్వా స్వదేహేకాలసాత్కృతే।
విశత్యదేహముక్తత్వంపవనోఽస్పందతామివ॥ మహోపనిషత్.

తా॥ జీవన్ముక్తపదవిని వదలి దేహము పడిపోవుచుండగా వాయువు నిశ్చలత్వమును పొందినట్లు విదేహముక్తత్వమును పొందును.

శ్రుతి॥ ఉపాధి- వినిర్ముక్త-ఘటాకాశవత్ ।
ప్రారబ్ధక్షయాత్ విదేహముక్తిః॥ —ముక్తికోపనిషత్.

తా॥ ఘటము నశించినతోడనే ఘటాకాశము, మహాకాశమను భేదము తోచనట్లు ప్రారబ్ధకర్మము నశించినతోడనే జ్ఞానిత్వో కూడా స్థూలసూక్ష్మకారణములను ఉపాధిత్రయము నశించి జీవన్ము

క్తుడగు జ్ఞానియొక్క జీవాత్మ నామరూపములను విడచి పరస్వరూపముగా ప్రకాశించును.

మూ॥ జీవన్ముక్తపదంత్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే।
విశత్యదేహముక్తత్వం పవనోఽస్పందతామివ॥ ౯౮.

ఉత్పత్తిప్రకరణం.

మూ॥ విదేహముక్తో నోదేతి నాస్తమేతి నశామ్యతి।
నసన్నాసన్నదూరస్థో నచాహం నచ వేతరః॥౯౯.

తా॥ జీవన్ముక్తపదవిని విడిచి తనశరీరము కాలవశమును పొందినదగుచుండగా, వాయువు నిశ్చలత్వమును పొందినట్లు విదేహముక్తిని పొందును. విదేహముక్తి నొందినవాడు వృద్ధినొందడు. క్షీణింపడు. శాంతినొందడు. వ్యక్తరూపుడు కాడు. అవ్యక్తరూపుడును కాడు. దూరస్థుడు కాడు. తాను కాడు. ఇతరుడు కాడు. (ఇట్టివాడని నిర్వచించుటకు శక్యముకాడని భావము.)

## ౨౨. జీవు డవిద్యాప్రతిబింబితుడు.

ప్రకృతి త్రిగుణాత్మకయని యిదివరకు జెప్పబడినది. 1 సత్త్వగుణము 2. రజోగుణము. 3. తమోగుణము. ఇందు రజస్తమోగుణములతో గూడిన సత్త్వమునకు అవిద్యయని పేరు. దీనిని మలిన సత్త్వోపాధియని చెప్పుదురు. ఇందు ప్రతిబింబితుడైన ఆత్మకు చిదాభాసుడనియు, క్షేత్రజ్ఞుడనియు, జీవుడనియు పేళ్లు. ఈజీవుడు మలిన సత్త్వోపాధివలన మలినస్వభావమును కించిజ్ఞత్వ హేయత్వములను బొంది యుపాధియందభిమానించుటవలన అహంకారమమకారములను బొంది సంసారప్రవిష్టుడై పారతంత్ర్యమును బొంది జననమరణదుఃఖములకు లోనగుచున్నాడు. ఇట్లు ప్రతిబింబితుడైన ఆత్మకు నిరంతరము సుఖదుఃఖాది ద్వంద్వముల నిచ్చుచుండునదే అవిద్య (అనగా నజ్ఞానము) ఈ అవిద్యవలననే జీవుడు సంసారబంధమును బొందుచున్నాడు.

శ్రుతి ॥ జీవ - ఇతిచ॥ ఈశ్వర - ఏవ - బ్రహ్మ - విష్ణ్వీశానేంద్రాదీనాం । నామరూపద్వారా - స్థూలోహ - మిథ్యాధ్యాస - వశాజ్జీవః । సోஉహ - మేకోపి - దేహారంభక - భేదవశా - ద్బహుజీవః ॥ నిరాలంబోపనిషత్ ॥

తా॥ సర్వాంతర్యామియై పరబ్రహ్మమైన ఆ ఈశ్వరుడే బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, మొదలగు రూపనామముల తోడ నుండుచు, తన స్వరూపమును మఱచినవానివలె భ్రాంతినొంది స్థూలదేహమే తానని భావించు అభ్యాసమువలన, తానే జీవుడనబడు చున్నాడు. ఇట్లు, ఒక్కొక్క స్థూలదేహమును తానని భావించుచు, నేనొకడను, నేనొకడను అని అనుకొనుటవలన, అనేకజీవులుగా తోచెను.

శ్రుతి ॥ స్థూల సూక్ష్మాది దేహానా మాత్మన్యారోపవవచ॥

తా॥ స్థూలసూక్ష్మకారణదేహములయొక్క ఆరోపము వలన పరబ్రహ్మమగు ఆత్మకు జీవరూపము కలిగెను.

శ్రుతి॥ ఈశాజ్ఞయా - విరాజో - వ్యష్టిదేహం - ప్రవిశ్య । బుద్ధిమధిష్ఠాయ - విశ్వత్వమగమత్ ॥ విజ్ఞానాత్మా - చిదాభాసో - విశ్వో - వ్యావహారికో - జాగ్రత్స్థూలదేహాభిమానీ । కర్మభూరితిచ - విశ్వస్య - నామ - భవతి ॥ పైంగలోపనిషత్ ॥

తా॥ పరబ్రహ్మమగు ఆత్మ, వ్యష్టియగు ఒకస్థూలదేహమును నేనని యభిమానించుటవలన తానే విశ్వుడనెడి జీవస్వరూపుడగుచున్నాడు. విశ్వుడే వ్యావహారికుడనియు, చిదాభాసుడనియు చెప్పబడుచున్నాడు. వ్యష్టిస్థూలదేహాభిమానియగు ఆత్మ, స్థూలదేహమే నేనని అభిమానించి అంతఃకరణవృత్తితో కూడుకొని అహమహమనుచు, జాగ్రతావస్థయందు దారాపుత్రాదులయందు అభిమానించుటవలన, విశ్వుడనియు, చిదాభాసుడనియు వ్యావహారికుడనియు చెప్పబడుచున్నాడు.

శ్రుతి ॥ ఈశాజ్ఞయా - సూత్రాత్మా - వ్యష్టి - సూక్ష్మశరీరంప్రవిశ్య। మన - అధిష్ఠాయ - తైజసత్వమగమత్ ॥ తైజసః - ప్రాతి భాసిక - స్వప్నకలిత - ఇతి । తైజసస్యనామభవతి ॥ ఈశా జ్ఞయా - మాయోపాధి - రవ్యక్త - సమన్వితో । వ్యష్టికా రణశరీరం - ప్రవిశ్య - ప్రాజ్ఞత్వ - మగమత్ । ప్రాజ్ఞః - అవచ్ఛిన్నః - పారమార్థిక - సుషుప్త్యభిమానీతి - ప్రాజ్ఞ స్యనామభవతి ॥ పైంగలోపనిషత్ ॥

తా॥ పరబ్రహ్మమగు ఆత్మయే వ్యష్టియగు ఒక సూక్ష్మ శరీరమును నేనని అభిమానించుటవలన తైజసుడను జీవస్వరూపి యగుచున్నాడు. ఆతైజసుడే ప్రాతిభాసికుడనియు, స్వప్నకలితు డనియు చెప్పఁబడుచున్నాడు. ఆత్మయే వ్యష్టియగు ఒకకారణశరీరము నేనని అభిమానించుటచే ప్రాజ్ఞుడనెడి నామమును బొందుచున్నాడు. ఆప్రాజ్ఞుడే అవచ్ఛిన్నుడనియు పారమార్థికుడనియు చెప్పబడు చున్నాడు. ఈ కారణశరీరమునకు మాయయే ఉపాధి. ఈప్రాజ్ఞుడు అజ్ఞానములోఁగూడి మాయోపాధికుడగుచున్నాడు.

శ్లో॥ అవిద్యావశగ స్త్వన్య స్తద్వై చిత్ర్యా దనేకధా
సాకారణ శరీరంస్యాత్ ప్రాజ్ఞ స్తత్రాభిమానవాన్॥ ౧౭

వేదాంతపంచదశి-ప్రత్య క్తత్త్వవివేకము

తా॥ అవిద్యయందు ప్రతిబింబించి అవిద్యావశమును పొం దిన చిదాత్ముడు జీవుడాయెను. ఆ యవిద్యయొక్క అవిశుద్ధిభేదము వల్ల నానావిధములు గలవాడగుచున్నాడు. ఆ యవిద్య కారణశరీర మగును. ఆ కారణశరీరమందు నే ననెడి యభిమానముగల జీవుడు ప్రాజ్ఞుడని చెప్పఁబడును.

సీ॥ భూపాలకోత్తమ ♦ భూతహితుండు సు
జ్ఞానస్వరూపకు ♦ డైనయట్టి

ప్రాణికి దేహసం బంధ మెట్లగు నన్న
మహినొప్ప నీశ్వర మాయ లేక
కలుగదు నిద్రలోఁ గలలోనఁ దోఁచిన
దేహబంధంబుల తెఱఁగు వలెను
హరి యోగమాయా మహత్త్వంబునం బాంచ
భౌతిక దేహసంబంధుఁ డగుచు

తే॥ నట్టి మాయాగుణంబుల నాత్మ యోలి
బాల్య కౌమార యౌవన భావములను
నర సుపర్వాదిమూర్తులఁ బొరసి యేను
నాయ దిది యను సంసార మాయఁ దగిలి॥

భాగవతము ౨-౨౨౫.

వ॥ ...............జీవుం డవిద్యామహిమం జేసి కర్మాను గతంబయిన మిథ్యారూప దేహ సంబంధుండు.........॥ ౨-౨౨౬.

## ౧౩. ఈశ్వరుడు మాయాప్రతిబింబితుడు.

పైన జెప్పబడిన త్రిగుణాత్మికయగు ప్రకృతియం దుండెడి కేవల శుద్ధసత్త్వమునకు మాయయని పేరు. ఇందు ప్రతిబింబించిన యాత్మ కీశ్వరుండని పేరు. ఈశ్వరుడు శుద్ధసత్త్వోపాధివలన పరిశుద్ధ స్వభావమును సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వములను సర్వకల్యాణగుణములను బొందుచున్నాడు. విద్యచే ఈశ్వరుడుపాధియం దభిమానమును బొందక అహంకార మమకారములు లేక స్వతంత్రుడై జీవులను తన వశమునందుంచుకొని వారు వారుచేయుకర్మములకు తగిన ఫలముల నిచ్చుచున్నాడు. ఇట్లు ప్రతిబింబితుడైన ఈశ్వరునకు సర్వజ్ఞత్వ, సర్వేశ్వరత్వ సర్వనియంతృత్వములను గలుగజేయునదియే విద్య. అనగా జ్ఞానము. ఈ జ్ఞానమువలననే ఈశ్వరుడు నిత్యముక్తుడగుచున్నాడు. అవిద్యాప్రతిబింబితుడగు జీవుడు నిత్యబద్ధుడు. మాయాప్రతిబింబితుడగు ఈశ్వరుడు నిత్యముక్తుడు. జీవుడు తనయందుండెడి రజస్తమో

గుణముల నెప్పుడువిడుచునో యప్పుడు కేవల సత్త్వగుణయుక్తుడై విద్యను అనగా జ్ఞానమును బొందుచున్నాడు.

శ్రుతి॥ ఈశ్వర- ॰ ఇతిచ॥ బ్రహ్మైవ- స్వశక్తిం- ప్రకృత్యాభిధేయం-
మాశ్రిత్య- । లోకాన్సృష్ట్వా- ప్రవిశ్యాంతర్యామిత్వేన ।
బ్రహ్మాదీనాం- బుద్ధీంద్రియ- నియంతృత్వా- దీశ్వరః॥
—నిరాలంబోపనిషత్.

తా॥ శుద్ధచైతన్యమగు పరబ్రహ్మమే తనయందుగలిగిన మాయా ప్రకృతియనెడి స్వశక్తితోడ కూడుకొని సకలలోకములను బ్రహ్మాదులనుసృష్టించి, వానియందంతర్యామిగా ప్రవేశించి బుద్ధీంద్రియాదులను నియమించుటవలన ఈశ్వరుడనబడును. ఆత్మసమష్టియగు అనేక స్థూల దేహములను నేనని యభిమానించి జాగ్రతావస్థనుపొంది దేవమానవ పశుపక్ష్యాది నానావిధ శరీరములతో నానావిధరూపములుగా ప్రకాశించుచున్నాడు. కాన విరాట్టని పేరు. ఆవిరాట్టునకు వైశ్వానరుడనియు వైరాజసుడనియు నామములు. 2 ఆత్మసమష్టియగు అనేక సూక్ష్మశరీరములను నేనని యభిమానించుటవలనహిరణ్యగర్భస్వరూపి యగుచున్నాడు. ఆహిరణ్యగర్భుడే సూత్రాత్మయనియు ప్రాణుడనియు చెప్పబడుచున్నాడు. 3. ఆత్మసమష్టియగు అనేకకారణశరీరములను నేనని యభిమానించి నిద్రావస్థయందు సకలజీవులయొక్క అంతఃకరణములను వానిసంబంధములగు వాసనలను తనయందు లయింపజేసికొని మరల యథారీతిగాసృష్టింపజేయుచున్నాడు. కానఈశ్వరుడనియు తత్త్వములను ప్రేరేపించుటవలన అంతర్యామియనియు అవ్యాకృతుడనియు చెప్పబడుచున్నాడు.

శ్లో॥ చిచ్ఛాయా వేశతశ్శక్తి శ్చేతనేవ విభాతిసా ।
తచ్ఛక్త్యుపాధిసంయోగాద్బ్రహ్మైవ జీవేశ్వరతాంవ్రజేత్ ॥ ౪౦.
వేదాంతపంచదశి —పంచకోశవివేకము.

ఆమాయాశక్తియందు పరబ్రహ్మముయొక్క ప్రతిబింబము ప్రవేశించియున్నది. ఆప్రతిబింబము చిదాభాసుడని చెప్పబడును. అట్టి

చిదాభాసునితోడ ఆమాయాశక్తికూడియుండుటవల్ల చేతనభావమును పొందినదానివలె తోచుచున్నది. అట్టి మాయాశక్తియే బ్రహ్మము నకు ఉపాధియగును. మాయాశక్త్యుపాధితోడ సంబంధమువల్ల సత్యజ్ఞానానందస్వరూప పరబ్రహ్మమే సర్వజ్ఞత్వాది ధర్మములుగల ఈశ్వరభావమును పొందుచున్నది.

శ్లో॥ కోశోపాధి వివక్షాయాం యాతి బ్రహ్మైవ జీవతాం।
పితాపితామహశ్చైకః పుత్రపౌత్రౌ యథాప్రతి ॥౮౧॥

తా॥ ఒకదేవదత్తుడు పుత్రపౌత్రులనుగురించి తండ్రియు, తాతయు ఏప్రకారమగుచున్నాడో ఆప్రకారము కోశోపాధియొక్క పర్యాలోచన చేయబడుచుండగా సత్యజ్ఞానానందలక్షణపరబ్రహ్మమే జీవత్వమును పొందుచున్నది.

౨౮. అవిద్యావిముక్తి సాధనములు.

రజస్తమోగుణములను విడుచుటకు సత్సంగము, ఈశ్వరభక్తియు ముఖ్యసాధనములు. సత్సంగము సర్వశ్రేయఃప్రాప్తికి మూలము. సత్సంగమున సాధింపలేని పదార్థమెచటను లేదు. కనుక విద్యను పొందగోరు ప్రతిమానవుడును, మొదలు సత్సంగమును సంపాదింప వలయును. సత్సంగమువలననే ఈశ్వరభక్తియు సిద్ధించును. కనుక ముముక్షువు తనసర్వమును సమర్పించియైనను సత్పురుషులను సంపాదించవలయును. అట్లు సంపాదించుటలో ప్రమాదపడక కొన్ని సద్గుణములను వారియొద్ద కనిపెట్టవలయును. అయితే యిక్కడ బాహ్య లక్షణములను బట్టి లక్ష్యమును గ్రహింపనగునాయని సందేహము కలుగుచున్నది.

౨౯. లక్ష్యజ్ఞానమునకు లక్షణమాధారము.

లక్ష్యమును గ్రహించుటకు లక్షణమే యాధారము. లక్షణము లేక లక్ష్యము గ్రహింపబడదు. ఎట్టులన లక్షణమైన జగమునుజూచి దీనికాధారమగు వస్తువొకటి యుండియే తీరవలయునని తెలిసికొను

చున్నాము. లక్షణమగు జగములేనియెడల లక్ష్యమును తెలిసికొను వాడుగాని, తెలిసికొనుటకు విచారణగాని లేదు. లక్ష్యము నిరాకారము. లక్షణము సాకారము. లక్ష్యము నిర్గుణము. లక్షణము సగుణము. లక్ష్య మవాఙ్మానసగోచరము. లక్షణము వాఙ్మానసములకు గోచరించునది. లక్ష్యము నిర్వికారము. లక్షణము వికారము. లక్ష్యమనంతము. లక్షణమంతము. ఇవిరెండును ద్వంద్వములు. ఇందొకటి లేకున్న రెండునుండవు. ఇవి యన్యోన్యాశ్రయములు. అందు జీవులు మొదట లక్షణమును బొంది పిమ్మట లక్ష్యమును బొందుచున్నారు. ఎట్లన జీవులందరును అజ్ఞానమందు జన్మించుచున్నారు. పిమ్మట జ్ఞానమును బొందుచున్నారు. అటులనే దుఃఖ సుఖమును, బద్ధుడు ముక్తిని, అజ్ఞాని జ్ఞానమును కోరుచున్నారు. కాని సుఖ దుఃఖమును, ముక్తుడు బంధమును, జ్ఞాని యజ్ఞానమును కోరుటలేదు. అనుభవమందు మొదటలక్షణము వెనుకలక్ష్యము తెలిసికొనబడుచున్నది లక్షణమందంతటను లక్ష్యమే ప్రకాశించుచున్నది. ఎప్పుడు సువర్ణమును తెలిసికొనగోరినను కడియము మొదలైన అనంతలక్షణములలో యేదియొ యొకటి యుండియే తీరవలయును. ఏలక్షణము లేనియెడల లక్ష్యమే ప్రకాశింపదు. తత్త్వము లక్ష్యముకాదు; లక్షణమును కాదు. లక్ష్యలక్షణముల కతీతము. అనగా ద్వంద్వాతీతము ద్వంద్వముల కాధారము. ద్వంద్వములయందుండి ప్రకాశించునది తత్త్వమే. ఇదియే ఆత్మస్వరూపము. ద్వంద్వములలో నొకటిలేకున్న నొకటి ప్రకాశింపదు. కనుక లక్షణములనుబట్టియే లక్ష్యము గ్రహింపబడుచున్నది. లక్షణములను బరీక్షించిననేగాని లక్ష్యము దెలియవీలులేదు. కనుక సత్పురుషులను లక్షణములనుబట్టియే గ్రహింపవలయును.

## ౨౬. సత్పురుష లక్షణములు.

శ్లో॥ అక్రోధవైరాగ్య జితేంద్రియత్వం ।
క్షమాదయా సర్వజనప్రియత్వం ।
నిర్లోభ దానం భయశోక వర్జితం ।
దశాని చిహ్నాని జ్ఞానస్యలక్షణం ॥

తా॥ 1. క్రోధములేకుండుట. 2 విషయవిరక్తిని గలిగి యుండుట. 3 ఇంద్రియనిగ్రహము. 4 క్షమ (అపకారమును బొంది యు పరులను క్షమించుగుణము.) 5 సర్వభూతదయ. 6 సర్వజన ప్రియత్వము. 7 లోభము లేకుండుట. 8 దానము చేయుట 9. భయ మును విడచుట. 10 దుఃఖము లేకుండుట యను నీపదియు సుజ్ఞానము గలవాని లక్షణములు.

శ్రుతి॥ ప్రాప్తకర్మపరోనిత్యం శత్రుమిత్రసమానదృక్। ఈహితానీహి
తైర్ముక్తో నశోచతి నకాంక్షతి ॥మహోపనిషత్॥

తా॥ నిత్యమును వర్ణాశ్రమమునకు తగినకర్మములను జేయుచు, రాగద్వేషములు లేనివాడై, శత్రుమిత్రుల‌ను సమముగా జూచుచు, ప్రియాప్రియములు లేనివాడై, లేనివస్తువులను కోరక, నష్టమైనదానికి దుఃఖించక యుండువాడు సత్పురుషుడు.

భాగవతము—"అంగనాసక్తులగు కాముకుల సంగంబు నిరయ రూపంబయిన సంసారంబగు. మహత్సంగంబు మోక్షద్వారంబగు" నట్టి మహాత్ములెవ్వరనిన.

"శత్రుమిత్ర వివేకంబులేక సమచిత్తులును, శాంతులును, క్రోధరహితులును, సకల భూతదయాపరులును, సాధువులును నగువా రలు మహాత్ము లనందగుదురు." అట్టి మహాత్ములు నాయందలి స్నేహముచే ప్రయోజనంబుగా గలిగియుండుటంజేసి విషయ వార్తాప్ర వృత్తులగు కుజనులందు తమ దేహ గృహ మిత్ర దారాత్మజాదులందు బ్రీతిలేక యుందురు.................పంచమ స్కంధము: ప్రథ మాశ్వాసము- ౬౮.

క॥ ధర్మము సత్యము గీర్తియు
నిర్మలదయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసావ్రతమును
నర్మిలి గలవారె పుణ్యులవనీనాథా॥ ద్వాదశస్కంధము. ౧౼

శ్లో॥ వాఞ్ఛా సజ్జనసంగతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతి ర్లోకాపవాదాద్భయం
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలై
రేతే యేషు వసన్తి నిర్మలగుణాస్తేభ్యో నమః కుర్మహే ॥౫౨.
-భర్తృహరి నీతిశతకం.

మ॥ సుకృతిశ్రేష్ఠుల గోష్ఠియుఁ బరగుణస్తోమంబునం బ్రీతి దే
శిక సంసేవయు విద్యయందు రుచి స్వస్త్రీకేళి లోకాపవా
ద కథాభీతియు విష్ణుభక్తి దమనోద్యచ్ఛక్తియుఁ సాధు దూ
షక సాంగత్య విముక్తియుఁ గల మనీషానంతులం గొల్చెదన్॥

తా॥ సత్సహవాసమునం దాసక్తియు, పరులగుణమునందు బ్రీతియు, గురువులయందణకువయు, విద్యయందాసక్తియు, స్వభార్యయందు సంభోగము, జనాపవాదమునకు వెరచుట, ఈశ్వరునియందు భక్తియు, అవమానముకలిగిన సామర్థ్యమును జూపుటయు, దుస్సహవాసమును విడుచుట ఇట్టి నిర్మలగుణములుగలవారికి నమస్కారము.

శ్లో॥ నమ్రత్వేనోన్నమన్తః పరగుణకథనైః స్వాన్గుణాభ్యావయన్తః।
స్వార్థాన్సంపాదయన్తో వితతపృథుతరారమ్భయత్నాః పరార్థే
క్షాన్త్యైవాక్షేపరూక్షాక్షరముఖరముఖాన్ దుర్జనాన్ దుఃఖయన్తః
సన్తః సాశ్చర్యచర్యా జగతిబహుమతాః కస్యనాభ్యర్చనీయాః
॥ ౬౧ ॥

చ॥ నతులగుచున్ మహోన్నతిఁ దనర్చుచు నన్యగుణోక్తిచే గుణో
న్నతి బ్రకటించుచుం బరజనప్రియకార్య సమర్థతన్ సమం
చిత నిజకార్యసంగ్రహముఁ జేయుచు నిష్ఠురవాదులం క్షమా
ధృతి నిరసించుచున్బరగు ధీరులు పూజ్యులుగారె యేరికిన్॥

తా॥ సత్పురుషులు అణకువగలిగియే ఔన్నత్యమును బొందుదురు. పరులగుణముల శ్లాఘించుటచేతనే తమహృదయమును గనంబరతురు. పరుల కార్యసాఫల్యమునకై యెక్కువప్రయత్నించి వారి కార్యములను సానుకూలము జేయుచు తమకార్యముల నొనర్చుచుం

దురు. తమ్మును కఠినముగను, పరుషముగను నిందించు దుర్జనుల యందు ఓర్పును గనంబరచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చ ర్యకరమగు నడవడిగల మహాత్ములెవరికి పూజ్యులుగారు!

మూ॥ న తపాంసి న తీర్థాని న శాస్త్రాణి జపంతిహి ।
సంసారసాగరోత్తారే సజ్జనా సేవనంవినా ॥౧౨॥

మూ॥ లోభ మోహారుషాంయస్య తనుతాఽనుదినంభవేత్ ।
యథాశాస్త్రం విహరతి స్వకర్మసు ననజ్జనః ॥౧౩॥
జ్ఞానవాశిష్ఠము-భీమాద్యుపాఖ్యానం.

తా॥ సంసారసముద్రమును దాటువిషయమై సజ్జనసేవ దక్క తపములుగాని తీర్థములుగాని శాస్త్రములుగాని జపములుగాని ఏవియు నుపయోగపడవు. ఎవనికి లోభము, మోహము, రోషంబును నానాటికి తగ్గిపోవుచుండునో, ఎవ్వడు శాస్త్రవిధిచొప్పున స్వకర్మల నాచరించుచుండునో వాడు సజ్జనుడనంబరగును.

ఇట్టి సత్పురుషులయొక్క నిరంతరసంగముచే జీవుని చిత్తము రజస్తమోగుణములను విడచి కేవల సత్త్వగుణమున ప్రసన్నమగును. అట్టి సత్త్వగుణోదయమువలన ముక్తిహేతువగు విద్యను బొంది యవి ద్యాబంధమునుండి విడువబడుచున్నాడు.

## ౨౭. ఆత్మసత్యస్వరూపము.

"ఆత్మ" యనగా తాను అని యర్థము ప్రతివాడును తన యునికిని యొప్పుకొనుచున్నాడు. తనయునికి అసత్యమనువా డెవ్వడు నుండడు. తాను సత్యముగా నున్నాడు. ప్రతివాడును నిత్యమును జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలను బొందుచున్నాడు. జాగ్ర తలో ప్రపంచమునంతను పంచేంద్రియముల ద్వారా యనుభవము లోనికి తెచ్చుకొనుచున్నాడు. స్వప్నమందును తానుండియే స్వప్నాను భవమును బొందుచున్నాడు. సుషుప్తియందు హాయిగానుంటినను తన యనుభవమును జాగ్రత్తునందు స్మరించుచున్నాడు. ఇటుల స్మరిం

చుట స్మృతియగును. స్మృతి యనుభవములేక కలుగదు. కనుక సుషుప్తియందును తానుండియే యున్నాడు. కాని యీ మూడవస్థలను బొందునది తాను కాదు. ఎట్లన జాగ్రత్త స్వప్నములలోనుండి వ్యవహరించు బుద్ధి సుషుప్తియందు దేనిని తెలియకుండగా తాను వట్టుకు నీ మూడవస్థ లనుభవించువానికి వేరుగా సదా జాగరూకుడై యుండి యీ మూడవస్థలందు నునికిలేములను బొందువానిని ప్రకాశింపజేయుచున్నాడు. జాగ్రత్స్వప్నములందు విషయము లింద్రియములచేతను ఇంద్రియములు మనస్సుచేతను, మనస్సు బుద్ధిచేతను, తెలిసికొనబడుచున్నది. ఈబుద్ధి ఆత్మసాన్నిధ్యమందుండి ఆత్మ ప్రకాశముచే మానసేంద్రియములను జూచుచున్నది. ఇట్టి మానసేంద్రియ విషయములను తనయందుపసంహరించుకొని సుషుప్తియందు లీనమై అజ్ఞానానుభవమును బొందుచున్నది. ఈమూడవస్థలందును తానుండి ప్రకాశింపుచు బుద్ధిని ప్రకాశింపజేయుచున్నాడు. కనుక మూడవస్థల యొక్క పూర్వాపరములయందును మూడవస్థలలోను తానుండి యున్నాడు. "త్రికాలములయందును యేది బాధింపబడకుండునో యదియే సత్యము" సత్యమనగా "ఉండునది" యని యర్థము. సర్వకాల సర్వావస్థలయందును తానుండియే వ్యవహరించుచున్నాడు. తానులేనిది యేవ్యవహారము నుండబోదు. కనుక తాను సత్యము. "తాను" అను శబ్దమునకు సంస్కృతమున "ఆత్మ" యని వ్యవహారము. కనుక ఆత్మ సత్యము. జాగ్రత్స్వప్నములయందు జగము గోచరించుచుండగా తానుండుచున్నాడు. సుషుప్తియందు జగములేకుండగాను తానుండుచున్నాడు. కనుక "ఆత్మ సత్యము"

శ్రుతి॥ కింతత్ - సత్యమితి॥ సదితి- శ్రోతప్రతీతి- లక్ష్యం- సత్యం- అసదిత్యావాచ్యం- సత్యం- త్రికాలాబాధ్యం- సత్యం సర్వకల్పనాధిష్ఠానంవా సత్యం॥     సర్వసారోపనిషత్॥

తా॥ సత్యమనగా నేమి? వేదములందు ఏది సత్తుగా చెప్పబడుచున్నదో అసత్తే సత్యము. అదే పరబ్రహ్మము. అసత్తు అని చెప్పబడనిదే సత్యము. అదే పరబ్రహ్మము. కాలత్రయమునందును

దురు. తమ్మును కఠినముగను, పరుషముగను నిందించు దుర్జనుల యందు ఓర్పును గనంబరచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చర్యకరమగు నడవడిగల మహాత్ములెవరికి పూజ్యులుగారు!

మూ॥ న తపాంసి న తీర్థాని న శాస్త్రాణి జపంతిహి ।
సంసారసాగరోత్తారే సజ్జనా సేవనంవినా ॥౧౨॥

మూ॥ లోభమోహారుషాంయస్య తనుతాఽనుదినంభవేత్ ।
యథాశాస్త్రం విహరతి స్వకర్మసు ససజ్జనః ॥౧౩॥
జ్ఞానవాశిష్ఠము-భీమాద్యుపాఖ్యానం.

తా॥ సంసారసముద్రమును దాటువిషయమై సజ్జనసేవ దక్క తపములుగాని తీర్థములుగాని శాస్త్రములుగాని జపములుగాని ఏవియు నుపయోగపడవు. ఎవనికి లోభము, మోహము, రోషంబును నానాటికి తగ్గిపోవుచుండునో, ఎవ్వడు శాస్త్రవిధిచొప్పున స్వకర్మల నాచరించుచుండునో వాడు సజ్జనుడనంబరగును.

ఇట్టి సత్పురుషులయొక్క నిరంతరసంగముచే జీవుని చిత్తము రజస్తమోగుణములను విడచి కేవల సత్త్వగుణమున ప్రసన్నమగును. అట్టి సత్త్వగుణోదయమువలన ముక్తిహేతువగు విద్యను బొంది యవిద్యాబంధమునుండి విడువబడుచున్నాడు.

౨౭. ఆత్మసత్యస్వరూపము.

"ఆత్మ" యనగా తాను అని యర్థము ప్రతివాడును తన యునికిని యొప్పుకొనుచున్నాడు. తనయునికి అసత్యమనువా డెవ్వడు నుండడు. తాను సత్యముగా నున్నాడు. ప్రతివాడును నిత్యమును జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలను బొందుచున్నాడు. జాగ్రతలో ప్రపంచమునంతను పంచేంద్రియముల ద్వారా యనుభవము లోనికి తెచ్చుకొనుచున్నాడు. స్వప్నమందును తానుండియే స్వప్నానుభవమును బొందుచున్నాడు. సుషుప్తియందు హాయిగానుంటినను తన యనుభవమును జాగ్రత్తునందు స్మరించుచున్నాడు. ఇటుల స్మరిం

చుట స్మృతియగును. స్మృతి యనుభవములేక కలుగదు. కనుక సుషుప్తియందును తానుండియే యున్నాడు. కాని యీ మూడవస్థలను బొందునది తాను కాదు. ఎట్లన జాగ్రత్త స్వప్నములలోనుండి వ్యవహరించు బుద్ధి సుషుప్తియందు దేనిని తెలియకుండగా తాను పట్టుకు నీ మూడవస్థ లనుభవించువానికి వేరుగా సదా జాగరూకుడై యుండి యీ మూడవస్థలందు నునికిలేములను బొందువానిని ప్రకాశింపజేయుచున్నాడు. జాగ్రత్స్వప్నములందు విషయము లింద్రియములచేతను ఇంద్రియములు మనస్సుచేతను, మనస్సు బుద్ధిచేతను, తెలిసికొనబడుచున్నది. ఈబుద్ధి ఆత్మసాన్నిధ్యమందుండి ఆత్మ ప్రకాశముచే మానసేంద్రియములను జూచుచున్నది. ఇట్టి మానసేంద్రియ విషయములను తనయం దుపసంహరించుకొని సుషుప్తియందు లీనమై అజ్ఞానానుభవమును బొందుచున్నది. ఈమూడవస్థలందును తానుండి ప్రకాశింపుచు బుద్ధిని ప్రకాశింపజేయుచున్నాడు. కనుక మూడవస్థల యొక్క పూర్వాపరములయందును మూడవస్థలలోను తానుండి యున్నాడు. "త్రికాలములయందును యేది బాధింపబడకుండునో యదియే సత్యము" సత్యమనగా "ఉండునది" యని యర్థము. సర్వ కాల సర్వావస్థలయందును తానుండియే వ్యవహరించుచున్నాడు. తానులేనిది యేవ్యవహారము నుండబోదు. కనుక తాను సత్యము. "తాను" అను శబ్దమునకు సంస్కృతమున "ఆత్మ" యని వ్యవహారము. కనుక ఆత్మ సత్యము. జాగ్రత్స్వప్నములయందు జగము గోచరించుచుండగా తానుండుచున్నాడు. సుషుప్తియందు జగములేకుండగాను తానుండుచున్నాడు. కనుక "ఆత్మ సత్యము"

శ్రుతి॥ కింతత్ - సత్యమితి॥ సదితి- శ్రోతప్రతీతి- లక్ష్యం- సత్యం- అసదిత్యవాచ్యం- సత్యం- త్రికాలాబాధ్యం- సత్యం।సర్వకల్పనాధిష్ఠానంవా సత్యం॥ సర్వసారోపనిషత్॥

తా॥ సత్యమనగా నేమి? వేదములందు ఏది సత్తుగా చెప్పబడుచున్నదో ఆసత్తే సత్యము. అదే పరబ్రహ్మము. అసత్తు అని చెప్పబడనిదే సత్యము. అదే పరబ్రహ్మము. కాలత్రయమునందును

వ్యాపించియుండినదే సత్యము. ఏది సదానాశరహితముగా నున్నదని చెప్పబడుచున్నదో అదే సత్యము. సర్వకల్పనలకు అధిష్ఠానముగా నుండునదే సత్యము.

శ్లో॥ పంచకోశపరిత్యాగే సాక్షిబోధావశేషతః ।
స్వస్వరూపం సఏవస్యాత్ శూన్యత్వం తస్యదుర్ఘటం॥ ౨౨.
వేదాంతపంచదశి —పంచకోశవివేకము.

తా॥ పంచకోశములకు అనాత్మ భావనిశ్చయము చేయబడు చుండగా ఆ పంచకోశసాక్షిరూపమగు బోధ మిగులుటవలన ఆబోధ యే తనయొక్క నిజరూపమగు బ్రహ్మమగును. ఆ సాక్షిబోధకు శూన్యభావము సంపాదింపదగినది కాదు.

శ్లో॥ అస్తితావత్స్వయంనామ వివాదావిషయత్వతః।
స్వస్మిన్నపి వివాదశ్చే త్ప్రతివాద్యత్రకోభవేత్॥ ౨౩॥

తా॥ తనస్వరూపము వివాదమునకు విషయముగామిచేత లౌకికవైదికుల మతమందు తా ననెడి శబ్దముచే జెప్పదగిన స్వస్వరూపము ఉన్నదేయగును. అనగా ఇప్పుడు నేనుంటిననెడి నిశ్చయమే ప్రతివానికి గలిగియున్నదేగాని ఇప్పుడు నేను లేననెడి తలంపు ఎంత మూఢునకైనను గలిగియుండదని యభిప్రాయము. మరియు తనస్వరూపమందును వివాదముగలిగి, యిప్పుడు నేనుంటినో లేనో యనెడి సంశయముచేత వాదించెడివా డెవ్వడును లేడు.

శ్లో॥ స్వాసత్త్వంతు నకస్మైచిద్రోచతే విభ్రమంవినా।
అతఏవ శ్రుతిర్బాధం బ్రూతే చాసత్త్వవాదినః॥ ౨౪॥

తా॥ ఒకభ్రాంతిదశయందుతప్ప, ఇతరదశయందు తనయొక్క అభావము, ఎవ్వనిచేతను అంగీకరింపబడదు. ప్రతివాడును తానుండియే వ్యవహరించుచున్నాడుగాని తానులేకనే వ్యవహరించువాడులేడు. కనుక తనయొక్క అభావమును ఎవ్వడును అంగీకరింపడు. అందుచేత బ్రహ్మము లేదనిచెప్పెడి శూన్యవాదికి బాధకలదని శ్రుతి యుం జెప్పుచున్నది.

శ్లో॥ అసద్బ్రహ్మేతి చేద్వేద స్వయమేవ భవేదసత్ ।
అతోఽస్య మాభూద్వేద్యత్వం స్వసత్త్వం త్వభ్యుపేయతాం ॥
॥౨౭॥

తా॥ బ్రహ్మము లేదని ఎఱిగినయెడల తానే శూన్యము అగును. (అనగా లేకపోవును.) ఆకారణమువల్ల ఈబోధస్వరూపుడగు ఆత్మకు అనుభవింపబడెడి స్వభావము లేకపోవుగాక. తనయొక్క యునికి సిద్ధమగుగాక. (బోధస్వరూపుడగు ఆత్మ పురుషునియొక్క స్వరూపమగుటవల్ల అట్టి ఆత్మయొక్క స్థితిని అవశ్యముగా అంగీకరింపవలెను.)

శ్లో॥ సత్యత్వం బాధరాహిత్యం జగద్బాధైకసాక్షిణః ।
బాధః కింసాక్షికో బ్రూహి నత్వసాక్షిక ఇష్యతే ॥౨౮॥

తా॥ బాధశూన్యత్వము సత్యత్వముయొక్క లక్షణమగును. బాధింపబడనిది సత్యమనియు, బాధింపబడునది మిథ్యయనియు ("సత్యమబాధ్యం బాధ్యం మిథ్యేతి తద్వివేకః") సత్యత్వలక్షణము పూర్వాచార్యులచేత చెప్పబడినది. (బాధయనగా లేమియని అర్థము.) స్థూలసూక్ష్మశరీరాది లక్షణముగల జగత్తునకు సుషుప్తి మూర్ఛాసమాధ్యవస్థలయందు యేబాధగలదో అట్టి జగద్బాధకు సాక్షిత్వముచేత ఆత్మ వర్తించుచున్నాడు. అట్టి ఆత్మయొక్క బాధకు సాక్షి లేదు. కనుక ఆత్మకు బాధలేదు. సాక్షి లేని బాధ అంగీకరింపబడదు.

శ్లో॥ అపనీతేషు మూర్తేషు హ్యమూర్తం శిష్యతేహి యత్ ।
శక్యేషు బాధితేష్వంతే శిష్యతే యత్తదేవతత్ ॥౩౦॥

తా॥ గృహాదులయందుండెడి ఘటాదిపదార్థములు ఆగృహాదులనుంచి తివిచి పారవైవబడుచుండగా తుదకు తివిచిపారవైచుటకు శక్యముగాని ఆకాశమే ఆగృహాదులయందు పరిపూర్ణముగా మిగులుచున్నది. ఈప్రకారమే బోధస్వరూపుడైన తనకంటె అన్యములైన దేహేంద్రియాదులు శ్రు॥ "నేతి నేతి"॥ ఇది యాత్మగాదిది యాత్మగాదని జెప్పెడి శ్రుతిప్రకారము, బుద్ధిచేత నిరాకరింపబడుచుండగా

అంత్యమందు సర్వమును నిరాకరించుటకు సాక్షిభావముచేత ఏబోధ మిగులుచున్నదో ఆబోధయే బాధలేని యాత్మయని తెలియవలెను.

శ్లో॥ యదస్త్యాదౌ యదస్త్యన్తే । యన్మధ్యే భాతి తత్స్వయం।
బ్రహ్మైవైక మిదంసత్య మితివేదాన్తడిండిమః ॥ ౩౮॥

—వేదాంతడిండిమము.

తా॥ ఏది ఆదియందునున్నదో ఏది అంతమందు నున్నదో ఏది మధ్యమందు కనబడుచున్నదో అది తాను ఏకమగు బ్రహ్మమే యగును. ఇది సత్యమని వేదాంతడిండిమము.

౨౮. జగన్మిథ్యాత్వము.

ఒకవస్తువుయొక్క యునికిలేములయందు తానుండుటయు తానుండగా నొకప్పుడుండి మరియొకప్పుడు లేకుండునది మిథ్యాపదార్థమగును. జాగ్రత్స్వప్నములయందు తానుండగా యుండి సుషుప్తి తురీయములయందు తానుండగా లేకపోవుచున్నది. కనుక జగము మిథ్యయగును. జాగ్రదవస్థయందుండిన జగము స్వప్నమునం దభావమును బొందుచున్నది. కనుక జాగ్రత్ప్రపంచము మిథ్యయగును. స్వప్నప్రపంచము సుషుప్తియందభావమును బొందుచున్నది. కనుక స్వప్న ప్రపంచము మిథ్యయగును. సుషుప్తియందుండెడి యజ్ఞానము తురీయావస్థయందు లేకపోవుచున్నది. కనుక అజ్ఞానము మిథ్యాపదార్థమగును. ఈవిధముగా జగమును దానికి గారణమగు అజ్ఞానమును మిథ్యాపదార్థములని ఋజువగుచున్నది. త్రికాలములయందును జగము యొక్క మిథ్యాత్వమును దెలియుచుండెడితాను త్రికాలములయందును బాధింపబడక యుండువాడే గనుక తాను (ఆత్మ) సత్యము. ఒక ప్రవాహముయొక్క యొక ప్రదేశమం దేకాగ్రచిత్తముతో జూడుము. అక్కడ నీవేమి జూచుచుంటివి? నీవు జూచెడి స్థలమందుండెడి నీరు ప్రతిక్షణమందును లేకపోవుటను జూచుచుంటివి. అటులనే జగమును జూడుము. ఈజగమందు నీవనేక రూపములను జూచుచున్నావు. రూపములుగాక యన్యమగునది జగమునం దింకొకటిలేదు.

రూపనముదాయమే జగము. ప్రతిరూపమును ప్రతిక్షణమందును మార్పుజెందుచుండుట నిర్వివాదాంశము. ఈక్షణమున జూచిన రూపమింకొకక్షణమునకో మాసమునకో లేక శతాబ్దమునకో బాగుగా మారిపోవుచున్నటుల నీవు తెలిసికొందువు. వేయేల నీశరీరము ప్రతిక్షణమందును మారిపోవుటను నీవు జూచుచున్నావు. బాల్యమందుండెడి శరీరము యౌవనమందును అది వయోవస్థయందు నుండుటలేదు. నీదృష్టికి పదిసంవత్సరములకు మార్పు గోచరించుచుండినప్పటికిని వది ప్రతిక్షణమందును మారుచుండుటవలననే కొంతకాలమునకు నీకు బాగుగా గోచరించుచున్నది. ప్రతిక్షణమందును జగము మార్పును జెందుచున్నది మారుట యననేమి? "లేనిరూపము గోచరించుటయు ఉన్నది లేకపోవుటయు" అనగా "లేనిది యుండుట యున్నది లేకపోవుట"—అనగా "లేనిది", "ఉన్నది" "లేనిది".

ఉండుటను పూర్వమందును పరమందును లేకబోవుచున్నది. మధ్యకాలమందుంటున్నది. ఏది ఆదియందును నంతమందును లేనిదో యది మధ్యకాలమందును "లేనిదే" యగునుగాని యున్నదికాదు. ఎట్లన ఒకడు చీకటియందు త్రాడునుజూచి పాముగా భ్రమించుచున్నాడు. భ్రమకాలమందుండెడి పాము భ్రమకు పూర్వమందు లేదు. భ్రమ నశించి త్రాడు జ్ఞానమును బొందిన పిమ్మటను లేదు. మధ్యకాలమందున్నదందుమా యుండుట భ్రమయేగాని సత్యముగా నక్కడ పాములేదు. అటులనే ఆద్యంతములయందులేక మధ్యకాలమునందున్నటు లగపడు జగము లేనిదేగాని యున్నదికాదు. ఉన్నటు లగుపడుచుండుట భ్రమ. త్రికాలములందును జగములేనిదేయగుగాని అజ్ఞానముచే యున్నటు లగుపడుచుండును. దీనిని మిథ్యయందురు. మిథ్యయన లేనిది యున్నటుల దోచుటగాని శూన్యముగాదు. మిథ్యయన కుందేటికొమ్మురీతిగను వంధ్యాసూనునిరీతిగను శూన్యమని కొందరర్థములు జెప్పుచు లోకులను భ్రమింపజేసి తాము చెడుటయేగాక లోకులనుగూడను సత్పథమునుండి భ్రష్టులను జేయుచున్నారు. "వ్యావహారికమందుండునది పారమార్థికమం దనగా విచారణయందు

లేనిది మిథ్య ” ఎట్లన మనము మనచుట్టును ఆకాశము వ్రాలియున్న టుల వ్యావహారికమందు జూచుచున్నాము. విచారించగా ఆకాశము వ్రాలియుండుటలేదు. వ్యావహారికమన ఎండమావులయందు జలమును జూచుచున్నాము. విచారించగా జలములేదు. దీనిని మిథ్యయందురు. ఇప్పుడు మనమెపుడును మారుచుండెడి యీజగము మిథ్యారూపమని తెలిసికొని యున్నాము.

శ్రుతి॥ సాచ-ఆకాశే మేఘాదిరివ దృశ్యతే । మాయానామ- అనాదిరంతవతీ । ప్రమాణాప్రమాణ- సాధారణా । నసతీ- నాసతీ । సదస- దనిర్వాచ్యాధిష్ఠాన- ఏవావిద్యమానాంతర్వాణి- వికల్పనిరూప్యమాణోచ్చావచవ్యవహారభేదవతీ ।యానవిద్య తే- వస్తుత- స్సామాయా । తత్స్వరూపమజ్ఞానం । తదేవమూల ప్రకృతిర్గుణసామ్యా । అవిద్యేత్యా- ద్యనేకాకారా। జగదాకారేణ పరిణతా॥ —సర్వసారోపనిషత్.

తా॥ ఆకాశమునందు తోచిన మేఘములరీతిగా శుద్ధనిర్గుణ నిరాకార పరబ్రహ్మమునందు మాయ తనకు తానే తోచెను. మాయ ఆదిలేనిదియు అంతముగలదియునై యున్నది. ప్రమాణాప్రమాణములకు సాధారణమైనది. సత్తును, అసత్తును కానిది. సదసద్రూపమై, అనిర్వాచ్యమై (ఇట్టిదట్టిదని చెప్పుటకు శక్యముగానిదై) శుద్ధనిర్గుణ పరబ్రహ్మమునందు తోచిన ఆమాయ బ్రహ్మమును ఆవరించుకొని నానావిధరూపనామములు గలిగినట్టి జీవేశ్వరాది భేదములుగా వ్యవహారదశయందు తోపింపజేయునట్టిది. (యా-మా-సా-మాయా) అనునట్లు త్రికాలములయందును ఏది లేకపోవునో అదే మాయ. అనగా ఏది వస్తువుగాక రజ్జుసర్పము, స్థాణుపురుషుడు, శుక్తికారజతము, ఎండమావులవలె కల్పితమై, భ్రాంతిమాత్రమై మిథ్యగా, అవస్తువుగా తోచుచున్నదో అదే మాయ యనబడును. ఆమాయ యజ్ఞానమే స్వరూపముగా గలది. అదే గుణరూపిణియగు మూలప్రకృతి. మాయ, ఆవిద్య, ఆవరణ, విక్షేపముల నెడి అనేకాకారములు గలదియగుచున్నది. నానావిధరూపనామములతో చరాచర జగద్రూపముగాతోచుచున్నది.

శ్రుతి॥ దృశ్యం నాస్తీతి బోధేన మనసో దృశ్యమార్జనం।
సంపన్నం చేత్- తదుత్పన్నా- పరానిర్వాణ నిర్వృతిః॥
—మహోపనిషత్.

తా॥ దృశ్యము (ఎండమావులరీతిని) అసత్యమని తెలిసి మనస్సుచేఁచి దృశ్యమును తొలగించి వృత్తిరహితము జేయుటయే మోక్షమనబడును.

శ్రుతి॥ స్వస్వరూపవ్యతిరిక్త మాయామయ బుద్ధీంద్రియాదిగోచర జగత్సత్యత్వ చింతనమగ్రాహ్యం॥ —నిరాలంబోపనిషత్.

తా॥ ఆత్మస్వరూపమునకంటెను వేఱైనట్టి మాయామయములైన బుద్ధీంద్రియాదులున్ను వాటికి గోచరించు జగత్తున్ను సత్యమను చింతనము గ్రహించతగినదికాదు.

శ్రుతి॥ యదిదం దృశ్యతే సర్వం-జగత్- స్థావరజంగమం। తత్సుప్తా
వివ- స్వప్నః- కల్పాంతే ప్రవినశ్యతి తేనేయమింద్రజాల- క్రీడా
గతిః- ప్రవితన్యతే॥ —మహోపనిషత్.

తా॥ చరాచరరూపంబగు ఈ జగత్తు సర్వమున్ను స్వప్నప్రపంచమువలె మిధ్యామాత్రమైనది. కల్పాంతమునందు లయించిపోవును. ఇది యింద్రజాలమువలె నసత్యమైనది.

శ్రుతి॥ మాయాకార్యాదికం నాస్తి- మాయానాస్తి భయంనహి।
ఇదం ప్రపంచం నాస్త్యేవ నోత్పన్నం నోస్థితం క్వచిత్॥
—తేజోబిందూపనిషత్.

తా॥ మాయాకార్యాదికములేనిదే, మాయయు లేనిదే. భయపడ నక్కరలేదు. ఈ దృశ్యప్రపంచమంతయు లేనిదేమైయున్నది. ఇది యెప్పుడున్ను పుట్టనులేదు. ఉండనులేదు. (అనగా భ్రమాత్మకము, కల్పనామాత్రమని గ్రహింపవలెను.)

శ్రుతి॥ శశశృంగేణ నాగేంద్రోమృతశ్చేత్ జగదస్తితత్ మృగతృష్ణా
జలంపీత్వా- తృప్తశ్చేత్- అస్త్విదంజగత్ । నరశృంగేణ-

నష్టశ్చేత్కశ్చిత్- అస్త్విదమేనహి । గంధర్వనగరే సత్యే-జగద్భవతి సర్వదా గగనే నీలిమాసత్యే జగత్సత్యం భవిష్యతి శుక్తికారజతం సత్యం భూషణం చేజ్జగద్భవేత్ । రంభాస్తంభేన కాష్ఠేన పాకసిద్ధిర్జగద్భవేత్ । కూర్మరోమ్ణాగజేబద్ధే-జగదస్తు మదోత్కటే। జ్వాలాగ్నిమండలే పద్మవృద్ధిశ్చేజ్జగత్-అస్త్విదం మశకేన హతేసింహే జగత్సత్యం తదాస్తుతే స్వప్నదృష్టంచ యద్వస్తు జాగరేచేజ్జగద్భవః వంధ్యాగర్భాప్తితన్నాఖ్యం జ్ఞాతాచేదస్త్విదం జగత్ కాకోవాహం। నవద్గచ్ఛే జ్జగద్భవతు నిశ్చలం మహాఖరోవా సింహేన యుధ్యతేచేజ్జగత్-స్థితిః । మహాఖరోగజగతిం గతశ్చేజ్జగదస్తుతత్ । సంపూర్ణచంద్రసూర్యశ్చే జగద్భాతు స్వయంజడం భ్రష్టబీజ సముత్పన్న వృద్ధిశ్చే జ్జగదేసుతత్ । శునాం వీర్యేణ సింహాస్తు జితోయది జగత్తదా శ్వానేన సాగరేపీతే నిశ్శేషేణ జగద్భవేత్ । శుద్ధకాశో మనుష్యేషు పతితశ్చేత్తదా జగత్ భూమౌవా పతితంవ్యోమ వ్యోమపుష్ప సుగంధకే శుద్ధాకాశవనేజాతే చలితేతు తదా జగత్ ॥ —తేజోబిందూపనిషత్ ॥

తా॥ కుందేటికొమ్ముచేత ఏనుగు చచ్చినయెడల జగత్తు సత్యమగును. ఎండమావులయందలి నీరునుత్రాగి తృప్తినొందినయెడల జగము సత్యమగును. నరశృంగముచేత ఎవడైనను నష్టపడినయెడల జగము సత్యమగును. గంధర్వనగరము నిజమైనయెడల జగము నిజముగానుండును. ఆకాశమునందు నీలవర్ణము సత్యమైనయెడల జగత్తు సత్యముకాగలదు. ముత్యపుచిప్పయందు భ్రమచేత దోచువెండి నిజమగు భూషణమయ్యెనేని జగము సత్యమగును. అరటిస్తంభములను కట్టెలుగా యుపయోగించుటవలన అన్నము పాకమయ్యెనేని ప్రపంచము సత్యమగును. (మజ్జిగ పాలుగా అయినయెడల జగము నిజమగును). తాబేటిరోమమువలన ఏనుగు బంధింపబడినయెడల జగత్తునిజమగును. జ్వాలాగ్నిగుండమునందుంచబడిన తామరపువ్వము క్షీణించకుండెనేని జగత్తు నిజమగును. దోమచేత సింహము చచ్చినయెడల జగము సత్య

మగును. స్వప్నదృష్టమగు పదార్థము జాగ్రిదవస్థయం దున్నయెడల జగముండిన దగును. గొడ్రాలిబిడ్డడు శౌఖ్యముగా జీవించియుండె నేని ఈజగ మున్నదగును. కాకి హంసరీతిగా పలుకుచు తిరిగినయెడల జగము నిజముగానుండును. గాడిద సింహముతో యుద్ధముచేసి జయిం చిన యెడల జయము నిజంబగును. గాడిద యేనుగురీతిగా సంచరిం చినయెడల జగముండుగాక. పూర్ణచంద్రిబింబము సూర్యునివలె దోచె నేని జగము సత్యముగా ప్రికాశించును. అంకురశక్తిని పోగొట్టుకొనిన విత్తనము అంకురించి వృద్ధిపొందినయెడల జగముండును. శునకము సిం హమును జయించెనేని జగము నిజమగును. శునకము సముద్రిజలము నంతను పానముచేసినయెడలను ఆకాశము మనుష్యులమీద పడినను భూమిమీద పడినను ఆకాశపుష్పము సువాసనను గ్రిహించినయెడల ను ఆకాశమునందలి తోటలోని చెట్లయందలి పుష్పములు చలించి రాలినయెడలను జగము సత్యమగును. (అనగా జగత్తు ఎప్పుడును సత్యముగాదు, మిధ్యయనుట)

శ్లో॥ ప్రాగభావో నానుభూత శ్చితేర్నిత్యా తతశ్చితిః।
ద్వైతస్య ప్రాగభావస్తు చైతన్యేనాను భూయతే॥ ॥౨౫౮॥
—చిత్రిదీపము.

తా॥ ఆత్మకు ప్రాగభావము (పూర్వమందులేమి) అనుభ వింప బడడములేదు. ఆకారణమువల్ల ఆత్మ సత్యమగును. (జాగ్రితాది ద్వైతము సుషుప్తియందు లేనట్లు సాక్షియగు చిత్తుచేత ననుభవింప బడుచున్నది. ఇట్లు శ్రు॥ తమసస్సాక్షీ సర్వస్యసాక్షీ॥ అనెడి శ్రుతి చెప్పుచున్నది. కనుక) ద్వైతమునకు ప్రాగభావమే ఆత్మచేత అనుభవింప బడుచున్నది.

శ్లో॥ ప్రాగభావయుతం ద్వైతం రచ్యతేహి ఘటాదివత్ ।
తథాపి రచనాఽచింత్యా మిథ్యాతే నేంద్రిజాలవత్ ॥ ౨౫౯॥

తా॥ ఈచెప్పిన ప్రికారముగా ద్వైతము ప్రాగభావము తో గూడియుండుటవల్ల ఘటాదికమువలె కల్పింపబడుచున్న దేయగును.

అట్లు కల్పింపబడుచున్నను అద్వైతముయొక్క కల్పనము, చింతించుటకు శక్యముగాని దగును. మరియు నట్లు కల్పింపబడుచు చింతించుటకు శక్యముగాని కల్పనాస్వరూపము గలదగుటచేత, ఇంద్రజాలాది మాయచే నిర్మింపబడిన మేడవలె మిధ్యయగును. (అనగా, అచింత్య రచనాస్వభావము గలది. ప్రాగభావముతో గూడుచుండగా, మిధ్యాభావ లక్షణవంతమగుటచేత ద్వైతమునకు మిధ్యాభావము నిస్సంశయముగా సిద్ధించెను).

శ్లో॥ మాయికోయం చిదాభాస శ్రుతే రనుభవాదపి।
ఇంద్రజాలం జగత్ప్రోక్తం తదంతః పాత్యయం యతః ॥

౨౧౭ ॥ తృప్తిదీపము.

తా॥ ఆమాయ చిదాభాసరూపముచేత జీవేశ్వరుల నిద్దరిని సృష్టించుచున్నదని చెప్పెడి.

శ్రు॥ జీవేశావాభాసేన కరోతి॥ అనెడి శ్రుతిచేతను, అనుభవముచేతను, ఈరెంటిచేతను, ఈచిదాభాసుడు మిధ్యారూపుడగును. (ద్రష్టృదర్శన దృశ్యములనెడి మూటియొక్క మధ్యమందు వర్తించుచున్నాడని యెరుగుటయే, అనుభవమగును. ఈచిదాభాసుడు ఇంద్రజాలమువంటి మిధ్యాభూతమగు జగంబునందు, లోపట బడియుండుటచేత ఈచిదాభాసునియొక్క మిధ్యాత్వము అనుభవింపబడుచున్నది.

మూ॥ సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ సర్వదా।
ఇదం జగదహంచేతి బోధాభ్యాసం విదుఃపరే ॥౧౧౧॥

జ్ఞానవాశిష్ఠము ఉత్పత్తిప్రకరణము.

తా॥ ఇది జగము నేను అను దృశ్యమగు పదార్థము సృష్ట్యాదియందే కలిగినది. కావున సృష్టికి పూర్వముగాని ప్రళయమునకు పిదపగాని లేదు. బంగరుకంటె ఆభరణంబును మృత్తుకంటె ఘటంబును వేఱుగాలేనట్లు స్థితికాలమందును లేదు. కావున దృశ్యము మూడుకాలములయందును లేదని అభ్యాసముచేయుటను పరమాత్మ విషయమగు జ్ఞానాభ్యాసమునుగా చెప్పిరి.

మూ॥ దృశ్యాసంభవబోధోహి జ్ఞానం జ్ఞేయంచ కః।
తదభ్యాసేన నిర్వాణ మిత్యభ్యాసో మహాదయః॥ ౧౧౩॥

తా॥ దృశ్యము బొత్తిగా లేదను దృఢమగు జ్ఞానమే జ్ఞానమనియు జ్ఞేయమనియు చెప్పబడును. అట్టి యభ్యాసముచే అపరోక్షజ్ఞానప్రాప్తిద్వారా మోక్షంబును గలుగును. కావున అభ్యాసము గొప్పలాభమును గలుగజేయునది యగును.

మూ॥ యథా స్వప్నముహూర్తేతు సంవత్సర శతభ్రమః।
తథామాయావిలాసేన తథాఽయం జాగ్రతిభ్రమః॥ ౧౯౯॥

మూ॥ వస్తుతస్తు నజాతోఽసి నమృతోఽసి కదాచన।
శుద్ధవిజ్ఞాన రూపస్త్వం శాంత ఆత్మని తిష్ఠసి॥ ౨౦౦॥

మూ॥ పశ్యసీవైతదఖిలం నచపశ్యసి కించన।
సర్వాత్మక తయానిత్యం ప్రకచస్యాత్మనాత్మని॥ ౨౦౧॥

తా॥ స్వప్నమునందు క్షణమాత్రములో నూఱుసంవత్సరములు కడచెనని భ్రమము కలిగినట్లు నీకు జాగ్రత్తునందును మాయయొక్క సామర్థ్యముచే ఇట్టి భ్రమము కలిగినది. నిజముచేత నీవు పుట్టినవాడవుగాని మృతినొందినవాడవుగాని కానేరవు. ఇక నిర్మలమగు జ్ఞానమే రూపముగాగలవాడవును శాంతరూపుడవును అయి ఆత్మరూపమున ఉన్నవాడవు. నీవు ఈజగమును చూచుచున్నట్టున్నాడవే గాని నిజముచేత దేనిని చూచుటలేదు. నీవు సమస్తప్రపంచరూపుడవై ఎపుడును నీయందే ప్రకాశించుచున్నాడవు.

మూ॥ యస్త్వశుద్ధ మతిర్మూఢో రూఢో నవితతే పదే।
వజ్రసారమిదం తస్య జగదస్త్యసదేవసత్॥ ౨౦౨.

తా॥ ఇక ఎవడు చిత్తశుద్ధిలేక బ్రహ్మవస్తువును తెలియజాలకుండునో అట్టి మూఢునకు ఈజగములేనిదే సత్యముగాను వజ్రసారముగాను కనుబడుచున్నది.

మూ॥ యథా బాలస్య వేతాళో మృతిపర్యంతదుఃఖదః ।
అసదేవ సదాకారం తథా మూఢమతే ర్జగత్ ॥ ౨౦౩.

తా॥ తనయొక్క నీడయందు దోచిన బేతాళుడు బాలకునకు మరణపర్యంతము దుఃఖమును ఎట్లు కలుగజేయుచుండునో అట్లు అసత్యమగుజగము మూఢచిత్తునకు సత్యముగా గనుపడుచున్నది.

మూ॥ తాపఏవ యథావారి మృగాణాం భ్రిమతోభవేత్ ।
అసత్యమేవ సత్యాభం తథా మూఢమతే ర్జగత్ ॥ ౨౦౪.

తా॥ మృగములకు భ్రిమమువలన ఎండమావులే జలమని యెట్లుతోచునో అట్లు అసత్యమే యగునట్టి జగము మూఢచిత్తునకు భ్రిమమువలన సత్యముగా తోచును.

మూ॥ అవ్యుత్పన్నస్య కనకే కానకే కటకేయథా ।
కటకజ్ఞప్తిరేవాఽస్తి నమనాగపి హేమధీః ॥ ౨౦౫.

మూ॥ తథాఽజ్ఞస్య పురాగార నగనాగేంద్రి భాసురా ।
ఇయం దృశ్యదృగేవాఽస్తి నచాఽన్యాపరమార్థదృక్ ॥ ౨౦౬.

తా॥ కడియమునకు అధిష్ఠాన (ఆధార) భూతమగు బంగారముయొక్క జ్ఞానములేనివానికి ఇది కడియమే యను విపరీతజ్ఞానమే యుండును. కాని ఇది కడియముగాదు. ఇక బంగారమే యను యథార్థజ్ఞానము ఎట్లు ఉండదో అట్లు అధిష్ఠానమగు బ్రిహ్మమును ఎఱుగనివానికి ఇది పట్టణము ఇవి ఇండ్లు ఇవి చెట్లు ఇవి ఏనుగులు అని తోచునట్టి దృశ్యభ్రాంతియే యుండునుగాని ఇది దృశ్యముగాదు. ఇక బ్రిహ్మమేయను పారమార్థిక జ్ఞానము ఉండదు.

మూ॥ దీర్ఘస్వప్నమిదం విశ్వం చిత్తాహంతాది సంయుతం ।
అత్రాన్యే స్వప్నపురుషా యథా మీ జాగ్రితఃస్థితాః ॥ ౨౦౭.

తా॥ చిత్తము అహంకారము మొదలగు విషయములతోగూడిన యీ ప్రిపంచము దీర్ఘకాలము గనుపడునట్టి స్వప్నము అగును. ఈజగమునందు గనుపడునట్టి పురుషులును స్వప్నమునందు తనకంటె వేరుగా గనుపడునట్టి పురుషులను పోలినవారలే అగుదురు.

మూ॥ అస్తి సర్వగతంశాంతం పరమార్థఘనం శుచి
అచేత చిన్మాత్రవపుః పరమాకాశమాతతం॥ ౨౦౮.

తా॥ సర్వజగమునకు అధిష్ఠానభూతంబును, శాంతంబును, నిరతిశయమగు సత్యమే రూపముగాగలదియు పవిత్రమగునదియు, నిర్విషయము అగు చిత్తు మాత్రమే శరీరముగా గలదియు వ్యాపకమైనదియు నగు బ్రహ్మాకాశము మాత్రము కలదు.

మూ॥ తత్సర్వగం సర్వశక్తి సర్వం సర్వాత్మకం స్వయం
యత్ర యత్ర యథోదేతి తథాస్తే తత్ర తత్రవై॥ ౨౦౯.

తా॥ సర్వమును తెలిసికొనునట్టియు సమస్తశక్తులు గలిగినట్టియు సమస్త భూతములయందు ఆత్మరూపముతో నుండునట్టియు ఆ బ్రహ్మము ఎచట ఎచట ఏయేరూపముతో ఆవిర్భవించుచుండునో అచట ఆచట ఆయారూపముతో ప్రకాశించుచుండును.

మూ॥ స్వప్నోజాగ్రత్య సద్రూపః స్వప్నే జాగ్రదసద్వపుః॥ ౨౩౪.
మృతిర్జన్మన్యసద్రూపా మృత్యౌం జన్మాఽప్యసన్మయం

మూ॥ ఏవం నసన్నాసదిదం భ్రాంతిమాత్రం విజృంభతే॥ ౨౩౬.
అనుభూతయ ఏతాస్తు కాశ్చిత్పూర్వానుభూతితః
అపూర్వానుభవాః కాశ్చిత్సమాశ్చైవాఽసమాస్తథా॥ ౨౩౭.

తా॥ (వ్యవహారదశయందు బాధ నొందకుండెనేని కల్పితమేగాదు. సత్యమేయగునంటివేని వ్యభిచరించునది గావున దృశ్యమంతయు మిథ్యయే యగును. ఎటులనంటివేని) స్వప్నము జాగ్రత్తునందు అసద్రూపము (లేనిది) గానుండును. జాగ్రత్ప్రపంచంబును స్వప్నమునందు అసద్రూపముగానే యుండును. మరణానంతరప్రపంచము జీవితకాలమునందు అసద్రూపముగానే యుండును. జీవితకాలప్రపంచము మరణాంతరకాలమునందు అసద్రూపముగానేయుండును. ఇట్లుజగము అన్నికాలములయందు గనుపడదు గావున సత్యముగాదు. కొన్నిసమయములయందు గనుపడినది గాన అసత్తునుగాదు. ఇక భ్రాంతిమాత్రమగు మిథ్యాపదార్థమే అగును. ఈ భ్రాంతులును పూర్వానుభవము

వలన గలుగుచు కొన్ని పూర్వానుభవముతో సమానములునుగాను మఱికొన్ని అసమానములుగాను అనేకవిధములుగా ఉండును.

మూ॥ అవిద్యాయాః ప్రపంచోఽయం నాస్తిసత్య మిహాణ్వపి ।
వివేచయంతి విబుధా వివదం త్యవివేకినః ॥౧౧॥

—నిర్వాణప్రకరణం, భరద్వాజానుశాసనం.

తా॥ ఈ ప్రపంచము అవిద్యవలన గలిగినది. ఇందు గొంచె మైనను సత్యమైన వస్తువులేదు అని పండితులు నిశ్చయించుచున్నారు. వివేకరహితులు వివాదమాడుచున్నారు

మూ॥ నాస్తి భిన్నం చితః కించి త్కించిత్పరింపచేన రుధ్యతే।
అభ్యాసేన రహస్యానాం వయస్య విశదోభవ ॥౧౨॥

తా॥ చిత్తత్త్వముకంటె నితరమగునది కొంచెమైనను లేదు. కావున మిథ్యాభూతమగు ద్వైతము వాస్తవమగు నద్వైత మును బాధింపదు. ఓ మిత్రమా! ప్రణవార్థము మొదలగు రహస్య ముల నభ్యసించుటచే విశుద్ధచిత్తుడ వగుము.

మూ॥ శూన్యమూలః ప్రపంచోఽయం శూన్యతా శిఖరస్సఖే ।
సారశూన్యతయా మధ్యే ప్యనా స్థా సన్మనీషిణాం ॥౧౩॥

మూ॥ అనాదివాసనాదోషా దసన్నేవాఽయ మీక్ష్యతే
గంధర్వనగరాకార స్సంసారబహువిభ్రమః ॥౧౪॥

తా॥ ఈ ప్రపంచము మిథ్యాభూతమగు నజ్ఞానముచే గలిగి నది.అజ్ఞానమే అగ్రభాగంబునను గలది. నడుమను సత్తారహితంబై ప్రా తిభాసిక మాత్రంబుగా దోచుచున్నది. అట్లుగావున దీనియందు పండి తుల కాసక్తి లేదు. ఈజగము లేనిదే అనాదిసిద్ధమగు వాసనావళము వలన ననేకంబులగు సంసార విభ్రాంతులు గలదియై గంధర్వనగరంబుం బోలె గనబడుచున్నది.

మూ॥ ప్రాజ్ఞా స్తి చరమేనా స్తి వస్తుసర్వ మిదంసఖే।
విద్ధి మధ్యేపి తన్నా స్తి స్వప్నవృత్త మిదం జగత్ ॥ ౧౫॥

మూ॥ అవిద్యా యోనయోభేదా స్సర్వేఽమీ బుద్బుదాఇవ।
క్షణముద్భూయ గచ్ఛంతి జ్ఞానైక జలధౌలయం ॥౨౦॥

తా॥ ఓమిత్రుఁడా! ఈసమస్తమగు వస్తుజాతంబును తూర్పువగాని, పడమరగాని, నడుమనుగాని లేదు. మఱి యీజగము స్వప్నవృత్తాంతమును బోలుచున్నది. అవిద్యవలన గలిగిన యీభేదంబులన్నియు నీటిబుగ్గలవలె జన్మించి క్షణమాత్రమున జ్ఞానమను సముద్రమునందు లయమొందుచున్నవి.

మూ॥ కస్తిష్ఠతి గతఃకోవా కస్యకేన కిమాగతం।
కింనుమజ్జసి మాయాయాం పతమాత్వా మతంద్రితః ॥౨౮॥

తా॥ (సంసారమున్నది. అది శ్రీరామునకు తత్త్వజ్ఞానముచే పోయినది. నాకు పోలేదను శోకహేతువగు మోహమును వారించుచున్నాడు.) ఓభరద్వాజా! ఏదియున్నది. ఏదిపోయినది. దేనిచేత నెవనికి నేమివచ్చుచున్నది. మాయయం దేలమునింగెదవు. నీవు మాంద్యరహితుండవై మాయయందు బడకుము.

మూ॥ తత్త్వమేకం యదాత్మేతి జగదేతత్ప్రచక్షతే।
తతోఽన్యః కస్తవాతీతో యస్తాత విషయశ్చవాం ॥౨౮॥

తా॥ వేదాంతము లీజగంబంతయు నొక్కటియగు నాత్మయే యని చెప్పుచున్నది. అట్టి యాత్మకంటె నన్యుఁడు దుఃఖములకు విషయమైనవా డెవ్వఁడు కలడు.

శ్లో॥ సంసారః స్వప్నతుల్యోహి రాగద్వేషాది సంకులః।
స్వకాలే సత్యవద్భాతి ప్రబోధేఽ సత్యవద్భవేత్ ॥౬॥

—ఆత్మబోధము.

తా॥ స్వప్నము ఎంతకాలమువరకు నిద్రావస్థ యనుభవింపబడుచున్నదో అందాకను తాను మిక్కిలి యసత్యమైనను సత్యమువలెనే కనబడుచుండి నిద్రనుండి బోధకలిగిన పిమ్మట మిక్కిలి అసత్తుగా ఏప్రకారము కనబడుచున్నదో ఆలాగే సంసారమును తనకు

కారణభూతమైన అజ్ఞానదశయందు నంతవరకు సత్యమైనదిగాను జ్ఞానోదయమైన పిమ్మట లేనిదిగాను అగుచున్నది.

శ్లో॥ తావత్సత్యం జగద్భాతి శుక్తికా రజతం యథా।
యావన్నజ్ఞాయతే బ్రహ్మ సర్వాధిష్ఠాన మద్వయం ॥౭॥

తా॥ ఎంతవరకు ముత్యపుచిప్పయని యథార్థజ్ఞానము పుట్టలేదో అదివరకును భ్రమచేత ముత్యపుచిప్పయందు వెండియను జ్ఞానమే కలుగుచున్నది. ఆప్రకారమే సర్వప్రపంచమునకు ఆధారమైనదయు, సచ్చిదానందరూపమైనదియు, ఏకమైనదియునైన బ్రహ్మము ఎదివరకు ప్రత్యక్షానుభవసిద్ధము కాలేదో అంతదనుక ప్రపంచాకారముగా పరిణమించియున్న యీసంసారము భ్రాంతిచేత సత్యముగా కనబడుచున్నది.

శ్లో॥ సచ్చిదాత్మన్యనుస్యూతే నిత్యే విష్ణౌ ప్రకల్పితాః।
వ్యక్తయో వివిధాస్సర్వా హాటకే కటకాదివత్ ॥ ౮.

తా॥ సచ్చిదానందస్వరూపమై సర్వవ్యాపకమైయున్న పరమాత్మయందు దేవ, తిర్యక్, నర, స్థావర, జంగమాది పలుతెఱంగులైన స్వరూపములు ఒక్కటియైన బంగారమునందు, కడియములు హారములు, కంఠెలు మొదలైన స్వరూపములువలెను కల్పింపబడినవి. బంగారమునందు కల్పితములైన కటకకుండలాదులు బంగారముకంటె నెట్లు వేఱుకావో ఆప్రకారమే ఆత్మయందు గల్పింపబడిన యీజగజ్జాలమును ఆత్మకంటె నతిరిక్తము కాదు.

శ్లో॥ యన్నాఽఽదౌ యచ్చ నాఽన్త్యన్తే, తన్మధ్యే భాతమప్యసత్।
అతోమిథ్యాజగత్సర్వ, మితివేదాంతడిండిమః ॥ ౭౭.

—వేదాంతడిండిమం.

తా॥ ఏది ఆదియందులేదో ఏది యంతమందును లేదో అదిమధ్యమందు గనబడినను అసత్తేయగును. కావున జగత్తు సర్వంబును మిథ్యయని వేదాంతడిండిమము.

శ్లో॥ నజీవబ్రహ్మణో ర్భేదో నామ్నా రూపేణ విద్యతే ।
నామ్నోరూపస్య మిథ్యాత్వాత్ ఇతి వేదాంతడిండిమః॥ ౬౪.

తా॥ నామముచేతను, రూపముచేతను, జీవబ్రహ్మములకు భేదము లేదు. నామమును రూపమును మిథ్యయగుటవలననని వేదాంత డిండిమము.

శ్లో॥ బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాఽపరః ।
జీవన్ముక్తస్తు తద్విద్వాన్ ఇతి వేదాంతడిండిమః॥ ౬౬.

తా॥ బ్రహ్మము సత్యము, జగత్తు, మిథ్య, జీవుడు బ్రహ్మమే, ఇతరుడుకాడు. అది తెలిసినవాడు జీవన్ముక్తుడని వేదాంత డిండిమము.

శ్రీమద్భాగవతము, పంచమస్కంధము, ప్రథమాశ్వాసము.

వ॥ ................బాహ్యాభ్యంతరంబులంగలిగి స్వప్రకాశంబై భగవచ్ఛబ్దవాచ్యంబును విశుద్ధంబును బరమార్థంబును జ్ఞానరూపంబునునైన బ్రహ్మంబొకటియె సత్యంబు జగత్తసత్యంబు॥౧౪౯॥

వ॥ ....................ప్రతిబింబాదికంబు వస్తుత్వంబునం జేసి వికల్పితంబై తలంపంబడుభంగి నైంద్రికంబైన సర్వంబును వస్తుత్వంబున వికల్పితంబయి తోచుంగాని పరమార్థంబుకాదు. దేహాదికంబులు మిథ్యాత్మకంబులు. వానికి హేతువులయిన క్షితిప్రముఖంబులకును మిథ్యాత్వంబగుట సిద్ధంబు. పరమాత్మకు నవిద్యచేత నొంతదడవు వికల్పంబు దోచు నంతదడవును భ్రమంబునుదోచు. నవిద్యానివృత్తియైన సర్వంబును మిథ్యయని శాస్త్రవిధినిషేధంబులు కలలోపల మేలుగన్న తెల్గుంగగు.........469.　7 స్కంధము.

బ్రహ్మాండపురాణము, ఉపసంహారపాదము, ప్రథమాశ్వాసము.

వ॥ తత్త్వంబుల తత్త్వంబును బరీక్షింప నివి "మిథ్యాభూతంబు" లనియు బరతత్త్వంబే స్థిరమనియు దెలియనగు॥ ౨౭౯.

వ॥ అమ్మహాత్మునియందు వాచ్యావాచ్యంబులు లేవు. వ్యక్తావ్యక్తంబులగు సంసారవిస్తారంబు లాతనియం దారోపితమాత్రంబులై యుండు...........॥ ౨౯౯

శ్లో॥ జగద్విలక్షణం బ్రహ్మ బహ్మణో న్యన్న కించన।
బ్రహ్మాన్య ద్భాతిచేన్మిథ్యా యథామరు మరీచికా॥ ౬౩
ఆత్మబోధము.

తా॥ లోకములో బయలుగానుండే చవిటిభూమియందు యెండ న చూచినప్పుడు దానియందు తోచేనీళ్లు ఆయాధారమైన యెండ వినాయించి వేఱే లేకుండానున్ను, నీళ్లు కాకుండానున్ను, విచారించిన మాత్రముచేత అసత్యమైనట్లు యీజడరూపజగత్తున్ను, ఆత్మకాకుండ నున్ను, ఆయాధారభూతమైన ఆత్మను వినాయించి వేఱేలేకుండానున్ను, ఉండుటవల్ల ఆత్మకంటే వేఱుగాతోచే ఈప్రపంచము మిథ్యయని శ్రుత్యుక్త్యనుభవములచేత విచారించి తెలిసికోవలసినదనుట.

## ౨౯౯. బ్రహ్మలక్షణము.

శ్రుతి॥ సత్యం జ్ఞానమనంతమానందం సర్వశరీరోపాధి వినిర్ముక్తం కటకమకుటాద్యుపాధిరహిత సువర్ణఘనవత్। విజ్ఞాన ఘన చిన్మాత్ర స్వభావ- మాత్మచైతన్యం- బ్రహ్మ
॥సర్వసారోపనిషత్॥.

తా॥ సత్యమై, జ్ఞానమై, అనంతమై, ఆనందమై, ఏవిధమైన శరీరమున్ను లేనిదై, కటకమకుటాది ఉపాధులు లేనట్టి బంగారు ముద్ద వలె జ్ఞానముద్దగా నుండుచు (చిత్స్వరూపమై) సహజముగా సదాజ్ఞాన మాత్ర స్వరూపమైన ఆత్మప్రకాశము బ్రహ్మమనబడును.

శ్రుతి॥ సర్వోపాధివినిర్ముక్తం- నిర్విశేషచిన్మాత్రం- సదద్వైతమానంద మమాయంబ్రహ్మ ॥సర్వసారోపనిషత్॥.

తా॥ ఏ ఉపాధులున్ను లేనిదై నిర్విశేష చిన్మాత్రస్వరూపమై సత్తామాత్రమై అద్వితీయమై అఖండానందమై అవిద్య మాయ

అనెడి ద్వివిధ ఉపాధులులేనిదై సర్వపరిపూర్ణముగా నుండునదే పర బ్రహ్మమనబడును.

శ్రుతి॥ స్వప్రకాశకం జ్ఞానం- సర్వప్రకాశకంజ్ఞానం- నిరావరణచిన్మాత్రం జ్ఞానం- అనాద్యనంతం- నిరంతరమవృత్తి-వృత్తి-సాక్షిచైతన్యమేవజ్ఞానం (తదేవబ్రహ్మ) ఉత్పత్తి వినాశరహిత మనంతం- షడ్భావ వికారరహితమనంతం సర్వోపాధివినిర్ముక్తమనంతం మృద్వికారేషుమృదివ- స్వర్ణవికారేషు- స్వర్ణమివ తంతు వికారేషు తంతురివ- అవ్యక్తాది సృష్టిప్రపంచేషు వ్యాప్య- పూర్ణమవినాశి చైతన్య మనంతం॥ (తదేవబ్రహ్మ).

అంభసామర్ణవ ఇవ సుఖచేత నానామధిష్ఠాన నిత్యశుద్ధాఖండాద్వైత- చిదానందైకరసమానందం బ్రహ్మ.

—॥సర్వసారోపనిషత్॥.

తా॥ తనకు తానే స్వయంప్రకాశముగా తోచుచుండునదియు, సర్వమును ప్రకాశింపజేయునదియు, ఏవిధమైన ఆవరణములులేనిదియు, ఆద్యంతములులేనిదియు, సదా సంకల్పవికల్పములే స్వరూపముగానుండు అంతఃకరణమునకు సాక్షిగానుండు చైతన్యమే జ్ఞానమనబడును. అట్టి జ్ఞాన స్వరూపమగు వస్తువే ఆత్మలేక బ్రహ్మమనబడును.

ఉత్పత్తి వినాశములు లేనిదియు, షడ్భావ వికారములు లేనిదియు, ఎద్విధమైన శరీరోపాధులు లేనిదియు, నానావిధ ఘటముల యందుండు మృత్తురీతిగాను, కటక మకుటా ద్యాభరణములయందుండు బంగారమురీతిగాను, వస్త్రములయందుండు నూలురీతిగాను, అవ్యక్తతత్వము మొదలుకొని ఈ ప్రపంచమునగల సర్వవస్తువులయందున్ను వ్యాపించి పరిపూర్ణమై నాశనములేని చైతన్యమే అనంత మనబడును. అదియే ఆత్మ లేక బ్రహ్మమనబడును.

సముద్రము నందుండి తోచిన తరంగములకున్ను, నురుగులకున్ను, ఆ సముద్రమే అధిష్ఠానముగా నుండునట్లు ఆనందమయకోశ సహితు

లగు సకల జీవులకున్ను పరబ్రహ్మమే అధిష్ఠానముగానున్నది. అట్లు సకల జీవులకున్ను అధిష్ఠానమై, నిత్యమై, శుద్ధమై, అఖండమై, అద్వైతమై, జ్ఞానానంద రసమయ స్వరూపముగానుండు (ఆత్మ) బ్రహ్మమే యానంద మనబడును.

శ్రుతి॥ మహదహంకార పృథివ్యప్తేజోవాయు రాకాశాత్మకత్వేన బృహద్రూపే ణాండకోశేన కర్మ జ్ఞానార్థ రూపతయా భాసమాన మద్వితీయ మఖిలోపాధి వినిర్ముక్తం తత్సకలశక్త్యుపబృంహితమనాద్యనంతం శుద్ధం-శివం-శాంతం-నిర్గుణ మిత్యాదివాచ్య మనిర్వాచ్యంచైతన్యం బ్రహ్మ॥ నిరాలంబోపనిషత్॥

తా॥ మహదహంకారములకును, పృథివ్యాది పంచ భూతములకును, అంతర్యామిగాను, వాటి నతిక్రమించినదిగాను, సకలమైన ప్రపంచమునకు ఆధార భూతమైనదిగాను, నిష్కామ కర్మము చేతను, జ్ఞానము చేతను, పొందదగినదిగాను, తనకు రెండవది లేక సర్వము తానైనదిగాను, సకల ప్రపంచోపాధులు వాటిశక్తులతో కూడా తనయందు లయింప దగినదిగాను, ఆద్యంతములు లేనిదిగాను, పరిశుద్ధమైనదిగాను. సదా మంగళకరమైనదిగాను, శాంతమైనదిగాను, శుద్ధ నిర్గుణమైనదిగాను, నిరాకార మైనదిగాను, అవాఙ్మానసగోచరమైనదిగాను, శుద్ధ చైతన్యమాత్ర స్వరూపమైనదిగాను ఉండునట్టి వస్తువే బ్రహ్మమన బడును.

శ్రుతి॥ నిర్వికల్ప మనంతంచ హేతు దృష్టాంత వర్జితం । అప్రమేయ-మనాదించజ్ఞాత్వాచ- పరమంశివం॥ అమృతబిందూపనిషత్॥

తా॥ ఆ పరబ్రహ్మము నిర్వికల్పము. అనగా ఇంద్రియములచే తెలియరానిది. అంతములేనిది. తనకు మరియొకటి కారణముగా లేనిది. తనకు సమానమగు వస్తువు వేరొకటిలేనిది. అప్రమేయం అనగా ౧. ప్రత్యక్షము ౨. అనుమానము ౩. ఉపమానము ౪. ఆగమము ౫. అర్థాపత్తి ౬. అనుపలబ్ధి ౭. సంభవము ౮. ఐతిహ్యము అనెడి అష్టవిధ ప్రమాణములను అతిక్రమించినది. ఆదిలేనిది. అన్నిటికంటెను శ్రేష్ఠమైనది. సదామంగళ కరమైనది.

శ్లో॥ ఇదంసర్వం పురాసృష్టే రేక మేవా ద్వితీయకం।
సదేవాసీ న్నామరూపే నాస్తా మిత్యారుణేర్వచః॥ ౧౯.
—పంచభూతవివేకము.

తా॥ సృష్టికిపూర్వమం దీజగంబంతయు రెండవదిలేని ఒక్కటే యగు సద్రూపబ్రహ్మముగానే యుండెననియు, అప్పుడు నామరూపములుగల ఈప్రపంచములేదనియు నిట్లు అరుణునియొక్క పుత్రుడగు ఉద్దాలకమునీంద్రుడు. శ్రుతి॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్ ఏకమేవాద్వితీయం॥ అనెడి వాక్యముచేత తెలిపెను.

శ్రుతి॥ ఏకమేవాద్వితీయం॥ అనెడి మూడుపదములచేత సద్వస్తువగు బ్రహ్మమునందు స్వగతాదిభేదత్రయమును నివారింపజేయుట కొరకు నిప్పుడు లోకమందు స్వగతాదిభేదత్రయము జూపబడుచున్నది.

శ్లో॥ వృక్షస్య స్వగతోభేదః పత్రపుష్పఫలాదిభిః।
వృక్షాంతరా త్సజాతీయో విజాతీయ శ్శిలాదితః॥ ౨౦.

తా॥ వృక్షమునందుగల పత్రపుష్పఫలాదులచేత ఆవృక్షమునకు స్వగతభేదమగును. ఒక వృక్షమునకు మరియొకవృక్షముచేత సజాతీయభేదమగును. మరియు బండ మొదలగు వస్తువులవల్ల వృక్షమునకు విజాతీయభేదమగును. ఇట్లు లోకమందు ప్రతివస్తువునకును స్వగతసజాతీయ విజాతీయములనెడి మూడుభేదములు కలిగియున్నవని తెలియవలెను.

శ్లో॥ తథా సద్వస్తునో భేదత్రయం ప్రాప్తం నివార్యతే।
ఐక్యావధారణ ద్వైత ప్రతిషేధైః క్రిభిః క్రమాత్॥ ౨౧.

తా॥ వస్తుత్వ సామాన్యత్వముచేత అనాత్మవస్తువగు వృక్షమునందు స్వగతసజాతీయ విజాతీయభేదములు మూడునుగలిగినట్లు సద్వస్తువగు పరమాత్మయందును ప్రాప్తించెడి ఆ మూడుభేదములను (ఒక్కటియే రెండవది లేదనెడి) ఐక్యావధారణ ద్వైతనిషేధార్థములను దెలిపెడి శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడి మూడుపదములచేత క్రమముగా శ్రుతి నివారింపజేయుచున్నది.

శ్లో॥ సతోనావయవా శ్శంక్యా స్తదంశస్యా నిరూపణాత్
నామరూపేన తస్యాం శౌ తయో రద్యాప్యనుద్భవాత్ ॥ ౨౨.

తా॥ ఆసద్వస్తువగు పరమాత్మ నిరవయవుడగును. మరియు ఆపరమాత్మకు అవయవములు గలవనుటయందు నేవిధమైన ప్రమాణము లేదు. కనుక ఆ పరమాత్మయందు స్వగతభేదము గలదని శంకించుటకు శక్యముగాదు. సృష్టికిపూర్వమందు జగత్తుకు నామరూపములు రెండును లేవు. కనుక ఆ నామరూపకములు రెండును సద్వస్తువగు బ్రహ్మము యొక్క అవయవములని చెప్పరాదు.

శ్లో॥ నామరూపోద్భవ స్యైవ సృష్టిత్వా త్సృష్టితఃపురా
సతయో రుద్భవ స్తస్మా న్నిరంశం సద్యథావియత్ ॥ ౨౩.

తా॥ నామరూపములయొక్క యుత్పత్తియే సృష్టియగుటవల్ల సృష్టికి పూర్వమందు ఆ నామరూపములు రెండును లేవు. కనుక సద్వస్తువగు పరమాత్మ ఆకాశమువలెనే అవయవములేని వస్తువగుటవల్ల స్వగతభేదములేనిదగుటకు తగునని తెలియవలెను. ఇట్లు సద్వస్తువునందు స్వగతభేదము లేమిచేతనే శ్రుతి॥ ఏకమేవాద్వితీయం॥ అనెడి శ్రుతి ఏకశబ్దముచేత ఆ స్వగతభేదమును నివారించుచున్నది.

శ్లో॥ సదంతరం సజాతీయం స వైలక్షణ్యా వర్జనాత్
నామరూపోపాధిభేదం వినానైవ సతోభిధా॥ ౨౪.

తా॥ సజాతీయమనగా, మరియొక సద్వస్తువని చెప్పవలయును. ఈ సద్వస్తువుకంటె మరియొక సద్వస్తువు భేదమునుపొందని కారణమువల్ల సత్తునకు సజాతీయభేదమును నిరూపించుటకు శక్యముకాదు. ఆకాశమునకు ఘటమఠాద్యుపాధులచేత ఘటాకాశ మఠాకాశములనెడి ఉపాధినిమిత్తకభేదములు గలిగినట్లు సత్తునకును నామరూపవంతములైన ఆయా ఘటాద్యుపాధులచేత భేదముగలిగెనేగాని వాస్తవముచేత సత్తునకు (స్వతః) భేదములేదు. కనుక ఆయా ఘటాది ఉపాధిని విమర్శించిన పిమ్మట ఆకాశమునకు భేదముతోచనట్లు నామరూపోపాధిని విమర్శించిన యెడల సద్వస్తువునకు సజాతీయభేదము

లేనేలేదని స్పష్టముగా దోచును. కనుకనే శ్రు॥ ఏకమేవాద్వితీయం॥ అనెడి శ్రుతి "ఏవ" అనెడి పదముచేత సజాతీయభేదము లేదని నిరాకరించుచున్నది.

శ్లో॥ విజాతీయ మసత్తత్తు నఖల్వ స్తీతి గమ్యతే।
నాస్యాతః ప్రతియోగిత్వం విజాతీయా ద్భిదాకుతః ॥౨౫॥.

తా॥ విజాతీయమనగా అన్యవస్తువగును. సత్తుకంటె నన్య వస్తువు అసత్తని చెప్పబడును. అసత్తనగా లేనిదగును. మాయయు మాయాకార్యమగు జగదాదికమంతయు అసత్యమగును. మరియు, అసత్యమై కనబడుచుండెడి వస్తువు మిథ్యయని చెప్పబడును. అట్టి మిథ్యారూప అసత్యవస్తువు లేనిదగుటచేత అదిసద్వస్తువునకు విరోధి గాదు. కనుక విరోధిగాని యట్టి మిథ్యారూపమగు జగదాదికముచేత సత్తునకు విజాతీయభేదము లేనేలేదు. కనుకనే శ్రు॥ ఏకమేవా ద్వితీయం॥ అనెడి శ్రుతి, "అద్వితీయ"పదముచేత సత్తునకు విజాతీయభేదము లేదని నిరాకరించుచున్నది.

శ్లో॥ ఏకమేవా ద్వితీయంస త్సిద్ధమత్రతు కేచన।
విహ్వాలా అసదేవేదం పురాసీ దిత్యవర్ణయన్ ॥౨౬॥.

తా॥ ఈపైన చెప్పిన ప్రకారము సృష్టికిపూర్వమందు సద్వస్తువైన పరమాత్మకు సజాతీయ విజాతీయ స్వగతభేదములులేవ నుట స్పష్టమాయెను. కనుకనే సృష్టికి పూర్వమందు రెండవదిలేని సద్వస్తువొక్కటియే యున్నదని, శ్రు॥ "ఏకమేవా ద్వితీయం"॥ అనెడి శ్రుతి సిద్ధాంతముచేసెను. కొందరు విహ్వాల చిత్తముగలవారై శ్రు॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్॥ అనెడి శ్రుతిసిద్ధార్థ సద్వస్తుస్థితి కలిగియుండగా సృష్టికి పూర్వమందు ఈజగంబంతయు శూన్యముగానే యుండెనని వర్ణించిరి.

శ్లో॥ సచ్చిత్సుఖాత్మకం బ్రహ్మ నామరూపాత్మకం జగత్ ।
తాపనీయే శ్రుతం బ్రహ్మ సచ్చిదానంద లక్షణం ॥౬౨॥

—అద్వైతానందము.

తా॥ బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపంబుగలదగును. ప్రపంచంబు నామరూపములే స్వరూపముగా గలదగును. నృసింహోత్తరతాపనీయోపనిషత్తు నందు ఆథర్వణికులచేత శ్రు॥ బ్రహ్మైవేదం సర్వం సచ్చిదానందమాత్రం॥ అనెడి యిత్యాది ప్రదేశములయందు బ్రహ్మమునకు సచ్చిదానంద రూపంబు జెప్పబడెను.

శ్లో॥ సద్రూపమారుణిః ప్రాహ ప్రజ్ఞానం బ్రహ్మ బహ్వృచః।
సనత్కుమార ఆనంద మేవ మన్యత్ర గమ్యతాం ॥ ౬౩.

తా॥ మరియు సామవేదంబులోని ఛాందోగ్యోపనిషత్తు నందు ఉద్దాలక మునీంద్రునిచేత ఓ ప్రియదర్శనుడా! సృష్టికి పూర్వమందు ఈప్రపంచమంతయు సద్రూపముగా నుండెననెడి యర్థంబుగల శ్రు॥ సదేవ సోమ్యే దమగ్రఆసీత్ ॥ అనెడి యిత్యాది వాక్యముచేత సద్రూపమగు బ్రహ్మంబు నిరూపింపబడెను. "సత్" అనగా కాలత్రయమందును వినాశంబులేని బ్రహ్మవస్తువని తెలియవలెను. మరియు నాప్రకారమే ఋగ్వేదములోని ఐతరేయోపనిషత్తునందు జ్ఞానము నిత్యమనియు జ్ఞానమే బ్రహ్మమనెడి యర్థముగల శ్రు॥ ప్రజ్ఞా ప్రతిష్ఠా ప్రజ్ఞానంబ్రహ్మ॥ అనెడి వాక్యముచేత బ్రహ్మమునకు జ్ఞానస్వరూపంబు జూపబడెను. జ్ఞానమనగా స్వయం ప్రకాశమానత్వమని తెలియవలెను. ఈప్రకారము ఛాందోగ్య శ్రుతియందు సనత్కుమారుడనెడి గురుండు నారదుడనెడి శిష్యునికొరకు శ్రు॥ భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః॥ అనెడి వాక్యముచేత భూమయే తెలియదగునని యుపదేశించుటకు ప్రారంభించి యెద్ది భూమయో యెద్ది యానందమనెడి యర్థంబుగల శ్రు॥ యోవై భూమాతత్సుఖం॥ అనెడి వాక్యముచేత భూమశబ్దమనెడి పేరుగల బ్రహ్మమునకు నానంద రూపత్వమును జెప్పినవాడాయెను. ఈ పూర్వోక్త వాక్యత్రయమందు గల పదముల నేకవాక్యము జేయుగా బ్రహ్మము సత్యజ్ఞానానంద స్వరూపంబు గలదగునని సిద్ధించుచున్నది. మరియు నీప్రకారమే తైత్తిరీయాది శ్రుతులయందు శ్రు॥ ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ ॥ అనెడి యిత్యాది వాక్యములచేత బ్రహ్మమునకు ఆనంద రూపత్వాదికంబు జెప్పంబడెనని చూడదగినవి.

శ్రుతి॥ సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ”(తైత్తిరీయోపనిషత్ ఆనందవల్లి)యందు బ్రహ్మమునకు అనంతత్వము చెప్పబడియున్నది. కనుక బ్రహ్మము సత్యము, జ్ఞానము, ఆనందము, అనంతము మొదలగు లక్షణములు గలదని శ్రుతు లుద్ఘోషించుచున్నవి.

శ్రుతి॥ నవిరోధో- నచోత్పత్తి- ర్నబద్ధో- నచసాధకః । నముముక్షు
ర్నవైముక్త ఇత్యేషా పరమార్థతా॥ అమృతబిందూపనిషత్

తా॥ పరబ్రహ్మము నాశములేనిది, పుట్టుక లేనిది. కర్మబద్ధమైనది కాదు. సాధనాభ్యాసియు కాదు. ముముక్షువున్ను కాదు. ముక్తుడున్ను కాదు. ఇదియే బ్రహ్మముయొక్క పరమార్థస్థితియని తెలిసికొనవలయును.

## ౩౦ ఆత్మయే బ్రహ్మము.

శ్రుతి॥ బ్రహ్మైవాత్మాజ్ఞేయః । బ్రహ్మజ్ఞానం- సమూలానాత్మవివర్త
కం । సద్బ్రహ్మణి- విలీయతే॥ సర్వసారోపనిషత్.

తా॥ శ్రుతి॥ అయమాత్మాబ్రహ్మ॥ అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా సద్రూపమగు పరబ్రహ్మమే ఆత్మయనబడుచున్నది. ఎట్లనగా (అతతి-, తత్తద్వస్తురూపేణ వ్యాప్నోతీతి- ఆత్మా॥ అతసాతత్య- గమనే ఇతిధాతుః॥) అనునట్లు ఏది సకలవస్తువులందు వ్యాపించి తనకు రెండవదిలేక సర్వము దానై యున్నదో అదే ఆత్మయనబడును. మరియు (భృహిర్బృహ్మవృద్ధో- బృహత్వేర్థాత్తోః- అర్థానుగమాత్ । దేశతః- కాలతః- వస్తుతః అపరిచ్ఛిన్నం- యద్వస్తుతత్ బ్రహ్మేతి భాష్యం॥) అనునట్లు ఒకదేశమందున్నది ఒకదేశమందు లేదనియును, ఒక వస్తువునందున్నది ఒక వస్తువునందు లేదనియును ఒక కాలమునందున్నది ఒక కాలమునందు లేదనియును చెప్పబడక ఏది సర్వదేశ సర్వకాల సర్వవస్తువులందున్న పరిపూర్ణముగా వ్యాపించి తనకు రెండవదిలేక సర్వము తానై యున్నదో అదే బ్రహ్మమనబడును. బ్రహ్మము, ఆత్మ అను శబ్దంబులు మాత్రము భేదములుగా నున్నవి. కాని ఈ రెండుశబ్దముల యర్థములు ఒకవస్తువునే తెలియజేయుచున్నవిగాన

బ్రహ్మమే ఆత్మయని తెలిసికొనవలయును. అట్టి పరబ్రహ్మమగు ఆత్మయే మాయావిద్యోపాధులవలన పరమాత్మయనియు ప్రత్యగాత్మయనియు రెండువిధములుగా చెప్పబడుచున్నదిగాని ఉపాధిని విడిచి చూచినయెడల భేదములేక సర్వము యేకరూపముగానే యున్నది. కావున ఆత్మయే పరబ్రహ్మమనబడును. పరబ్రహ్మమే ఆత్మయనబడును. అట్టి పరబ్రహ్మమగు ఆత్మకంటెను ఇతరములైన వస్తువులు అన్నియు అనాత్మయని చెప్పబడును. అట్టి అనాత్మ వస్తువులన్నియు పరబ్రహ్మమగు ఆత్మయందు ఉత్పత్తియగుచు మరల ఆత్మయందే లయించుచుండును. కావున పరబ్రహ్మమగు ఆత్మ నాశములేదనియు సత్యమైనదనియును, అనాత్మవస్తువులు అసత్యమై నశించునట్టివనియును చెప్పబడును.

శ్లో॥ దేశకాలాన్యవస్తూనాం కల్పితత్వాచ్చ మాయయా।
నదేశాదికృతోంతోస్తి బ్రహ్మానంత్యం స్ఫుటంతతః ॥౩౬॥
—పంచకోశ వివేకము.

తా॥ బ్రహ్మమునకు పరిచ్ఛేదమును కలిగించుటకు కారణములైన ౧ దేశము, ౨ కాలము, ౩ అన్యవస్తువు, ఈమూడును మాయచేత కల్పించబడినవగును. కనుక ఇంద్రజాలాది మాయచేత కల్పించబడిన గంధర్వపట్టణాదులవల్ల ఆకాశమునకు వాస్తవమైన పరిచ్ఛేదములేనట్లు, మాయాకల్పితములైన దేశకాలాన్య వస్తువుల చేత వాస్తవమైన పరిచ్ఛేదము బ్రహ్మమందు సంభవింపదు. ఈయుక్తి వలనను బ్రహ్మమందు అనంతస్వభావము గలదని స్పష్టముగా దోచుచున్నది. మరియు బ్రహ్మమందు సత్యత్వముండుటచేత, అనంతత్వము సిద్ధముగా నుండునని తెలియవలెను. మరియు బ్రహ్మమే ఆత్మయని శ్రు॥ తదేతత్సత్యమాత్మా బ్రహ్మైవ బ్రహ్మాత్మైవా తత్రహ్యేవం నవిచికిత్స్యమిత్యోంసత్యమాత్మైవ నృసింహో దేవో బ్రహ్మభవతి॥ అయమాత్మా బ్రహ్మ॥ ఇత్యాది శ్రుతిసహస్రంబులు ఆత్మబ్రహ్మములకు అభేదమును జెప్పుచున్నవి. కనుక

బ్రహ్మమందుగల అనంతస్వభావము, ఈప్రత్యగాత్మయందు సిద్ధముగా నున్నదే యగునని యభిప్రాయము.

శ్లో॥ ఆత్మాఽనాత్మాపదార్థౌ ద్వౌ। భోక్తృభోగ్యత్వ లక్షణౌ।
బ్రహ్మైవాఽఽత్మాన దేహాది। ఇతి వేదాంతడిండిమః ॥౨॥
—వేదాంతడిండిమం.

తా॥ ఆత్మ అనాత్మయని రెండుపదార్థములు, ఆత్మభోక్త, అనాత్మభోగ్యము. ఆత్మ బ్రహ్మమేయగును. దేహాదికము ఆత్మ కాదు అని వేదాంతడిండిమము ఘోషించుచున్నది.

శ్లో॥ సచ్చిదానంద రూపత్వాత్। బ్రహ్మైవాత్మా నసంశయః।
ప్రమాణకోటి సంధానాత్। ఇతి వేదాంతడిండిమః ॥౬౦॥

తా॥ సచ్చిదానంద రూపుడగుట వలన ఆత్మ బ్రహ్మమే. సందేహంబులేదు. అనేక ప్రమాణముల పర్యాలోచనము వలననని వేదాంతడిండిమము.

౩౧ పరబ్రహ్మమే జీవేశ్వరజగంబులు (దృశ్యము) గాదోచుచున్నది.

సూర్యుడొక్కడే జలముచే నింపబడిన భిన్నఘటములయందు అనేక సూర్యులుగా ప్రతిబింబించినట్లున్ను, దర్పణమునందు ముఖప్రతిబింబము తోచినట్లున్ను, నీటిచేరువనున్న వృక్షముల నీడ నీటియందు ప్రతిబింబించినట్లున్ను, ఘట, దర్పణ, నీటియొక్క చలనాదులవలన ప్రతిబింబము చలనాదులను గలిగి యున్నటులనున్ను మాయావిద్యల యందు పరమాత్మ ప్రతిబింబించి వానియొక్క చలనాదుల వలన జీవేశ్వరులు చలించి త్రిగుణ ప్రధానములగు కర్మప్రవర్తనులై జగదాకారమును బొందుచున్నారు.

శ్రుతి॥ ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః। ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్ ॥—అమృత బిందూపనిషత్॥

తా॥ సకల భూతములందును పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కటే వ్యాపించి యున్నది. ఒక్క చంద్రుడే అనేక కుండలందుండు జలములో

వల అనేక ప్రతిబింబములుగా తోచునట్లు పరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే అనేక శరీరములందుండు అనేక అంతఃకరణములందు ప్రతిబింబించి అనేకముగా తోచుచున్నాడు.

శ్రుతి॥ దేహాదేః పరతరత్వాత్ బ్రహ్మైవ పరమాత్మా సబ్రహ్మా సవిష్ణు స్సరుద్ర స్సఇంద్ర స్సశమన స్ససూర్య స్సచంద్ర స్తేసురా- స్తేఅసురా స్తేపిశాచా స్తేమనుష్యా స్స్త్రియ- స్తేపశ్వాదయ స్తత్- స్థావరంతేబ్రాహ్మణాదయ స్సర్వం ఖల్విదం- బ్రహ్మ నేహనా నాస్తి కించన॥

తా॥ ఒక కుండయందు వ్యాపించియుండు ఆకాశము, ఆకుండయొక్క వికారములను దోషములను జెందక ఆకుండతోడ సంబంధములేక, దానికంటెను వేరుగా నుండునట్లు పరబ్రహ్మమగు ఆత్మ దేహమునందు వ్యాపించియున్నను దేహేంద్రియాదులయొక్క వికారములను దోషములను జెందక దేహమునంటక దేహేంద్రియాదులకంటెను వేరుగా విలక్షణముగా నుండుటవలన ఆయాత్మయే పరమాత్మ యనంబడుచున్నది. ఆపరబ్రహ్మమగు ఆత్మ ఒక్కడే బ్రహ్మాదిస్థావరాంతమైన సకలపదార్థములందున్ను వ్యాపించి బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, ఇంద్రుడు, యముడు, సూర్యుడు, చంద్రుడు, దేవతలు, రాక్షసులు, పిశాచములు, మనుష్యులు, స్త్రీలు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, పశువులు, పక్షులు, క్రిమికీటకాదులు, కొండలు, చెట్లు, తీగలు మొదలగు నానావిధరూపములతో తోచుచున్నాడు. ఈ సమస్తము బ్రహ్మమే. ఇక్కడ నానాత్వము కొంచెమున్ను లేదు.

శ్రుతి॥ యథా తరంగకల్లోలై ర్జలమేవస్ఫురత్యలం। ఘటనామ్నా యథా పృథ్వీ పటనామ్నాహి తంతవః॥ జగన్నామ్నా చిదాభాతి సర్వంబ్రహ్మైవ కేవలం॥ —యోగశిఖోపనిషత్॥

తా॥ సముద్రజలమే అలలు, బుగ్గలు, నురుగులు, అగుటవలన అవి జలమే అయినట్లున్న మృత్తికయేప్రకారము ఘటాదులుగా అవుచున్నవో దారములు (నూలు) యెట్లు వస్త్రాదులుగా అవు

చున్నదో అట్లు చిత్తు జగదాకారముగా ప్రకాశించుచున్నది. కాన ఈ చరాచరజగత్తు సర్వమున్ను కేవల పరబ్రహ్మ స్వరూపమే.

క॥ అవికారుఁడయ్యుఁ గనకము
వివిధాభరణంబులైన ♦ విధమున నితఁడే
దివియై భువియై రవియై
కవియై సర్వాత్ముఁడై ♦ ప్రకాశించుఁదగన్ ॥ ౧-౭౫.

సీతారామాంజనేయము.

సీ॥ విశ్వాత్మ నీయందు ♦ వేఱుగా జీవులఁ
గనఁడెవ్వఁడట వాని ♦ కంటెఁ బ్రియుఁడు
నీకు లేఁడయినను ♦ నిఖిలవిశ్వోద్భవ
స్థితివిలయంబుల ♦ కతనదైవ
సంగతి నిర్భిన్న ♦ సత్త్వాదిగుణవిశి
ష్టాత్మీయ మాయచే ♦ నజభవాది
వివిధభేదము లొందు ♦ దువు స్వస్వరూపంబు
నందుండుదువు విని ♦ హతవిమోహి

తే॥ వగుచు నుండువుగద ని ♦ న్ననన్యభక్తి
భృత్యభావంబుదాల్చి సం ♦ ప్రీతి గొల్చు
మమ్ము రక్షింపవే కృపా ♦ మయరమేశ
పుండరీకాక్ష సంతత ♦ భువనరక్ష॥ భాగవతము ౪-౧౯౩.

మ॥ హరపంకేజ భవామరాలియు మరీ ♦ చ్యాది ప్రజానాధులు
న్నరవిందాక్ష రమాహృదీశ భవదీ ♦ యాంశాంశ సంభూతులై
పరఁగందావక లీలకై నెగడు నీ ♦ బ్రహ్మాండమున్నట్టి యీ
శ్వర నీకేమతి భక్తి మ్రొక్కెదము దే ♦ వా దేవచూడామణీ॥
౪-౨౦౧.

మ॥ భవదంశాంశజు లీమరీచిముఖరుల్ ♦ బ్రహ్మ మరేంద్రాదిద్విజా
ధవముఖ్యుల్ దివిషద్గణంబుఁ బరమా ♦ త్మా నీవు విశ్వంబు ను

త్సవలీలాకరకందుకోపమును నా ♦ థా! వేదశాఖాశిఖా
స్తవనీయాంఘ్రికి నీకొనర్తుము నమస్కారంబు లశ్రాంతమున్॥
౮-౨౦౨.

వ॥ బ్రాహ్మణజనంబు లిట్లనిరి. దేవా యీ క్రతువును, హవ్యంబును, నగ్నియు, మంత్రంబులును, సమిద్దర్భపాత్రంబులును, సదస్యులును, ఋత్విక్కులును, దంపతులును, దేవతలును, నగ్నిహోత్రంబులును, స్వధయు, సోమంబును, నాజ్యంబును, బశువును, నీవ......౮, ౨౦౫.

వ॥ అనఘా కారణభూతుండును, నీశ్వరుండును, ద్రష్టయును, స్వయంప్రకాశకుండును నైన యేను గుణమయంబైన యాత్మీయ మాయం బ్రవేశించి జననవృద్ధి విలయంబులకు హేతుభూతంబులగు తత్తత్క్రియోచితంబులైన బ్రహ్మ రుద్రాది నామభేదంబుల నొందుచుండుదు నట్టి యద్వితీయ బ్రహ్మరూపకుండనైన నాయందు నజభవాదులను భూతగణంబులను మూఢుండగువాఁడు వేఱుగాఁ జూచు. మధ్యస్థుండగువాఁడు శరీరంబునకుఁ గరచరణాదులు వేఱుగాఁ దలంపని చందంబున నాయందు భూతజాలంబు భిన్నంబుగాఁ దలంపఁడు. గావున మా మువ్వురయందు నెవ్వండు వేఱుసేయకుండువాఁడు కృతార్థుండని యానతిచ్చె. (౮-౨౦౭)

క॥ హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశ ♦ యము పనిలేదా
హరిమయముగాని ద్రవ్యము
పరమాణువులేదు వంశ ♦ పావనవింటే॥ ౨, ౧౮

వ॥ దేహంబునకు ద్రవ్యంబులైన మహాభూతంబులును, జన్మనిమిత్తంబులైన కర్మంబులును, గర్మక్షోభకంబైన కాలంబును, గాలపరిణామ హేతువైన స్వభావంబును, భోక్తయైన జీవుండును, వాసుదేవుండకా నెఱుంగుము. వాసుదేవ వ్యతిరిక్తంబులేదు. సిద్ధంబు. ౨-౮౮

వ॥ దేహాదులకుఁ గారణత్వంబున నాది యందును నవధిత్వంబున నంతమందును గలుగుచు బహిరంగంబున భోగ్యంబును నంత

రంగంబున భోక్తయుఁ బరంబున పరంబును జ్ఞానంబును జ్ఞేయంబును వచనంబున వాచ్యమును నప్రకాశమును బ్రకాశంబును నైన వస్తువు నకు వేఱొండులేదు. ౭-౪౬౯.

సీ॥ పావకుండర్చుల ♦ భానుండు దీప్తుల
నెబ్భంగినిగిడింతు ♦ రెట్లడంతు
రాక్రియనాత్మ క ♦ రావళిచేత బ్ర
హ్మాదులవేల్పుల ♦ నఖిలజంతు
గణముల జగముల ♦ ఘననామరూప భే
దములతో మెఱయించి ♦ తగనడంచు
నెవ్వఁడు మనము బు ♦ ద్ధీంద్రియంబులు దాన
యై గుణసంప్రవా ♦ హంబు నెఱపు

తే॥ స్త్రీనపుంసక పురుషమూ ♦ ర్తియును గాక
తిర్యగమరనరాది మూ ♦ ర్తియును గాక
కర్మగుణభేద సదసత్ప్ర ♦ కాశిగాక
వెనుక నన్నియుఁ దానగు ♦ విభుఁడలంతు॥౮-౮౫॥

తే॥ అఖిల రూపముల్ దనరూప ♦ మైనవాడు
ఆదిమధ్యాంతములు లేక ♦ యడరువాఁడు
భక్తజనముల దీనుల ♦ పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపఁడె ♦ వేగరాఁడె॥౮-౮౭॥

సీ॥ నీవపావకుఁడవు ♦ నీవసూర్యుండవు
నీవచంద్రుండవు ♦ నీవజలము
నీవనేలయు నింగి ♦ నీవసమీరంబు
నీవభూతేంద్రియ ♦ నికరములును
నీవబ్రహ్మంబును ♦ నీవసత్యంబును
నీవయజ్ఞంబును ♦ నీవఫలము
నీవలోకేశులు ♦ నీవసర్వాత్మయు
నీవకాలంబును ♦ నీవజగము

తే॥ నీవబహుయజ్ఞ భోజివి ♦ నీవనిత్య
మూలతేజంబు నీవు నే ♦ మ్రొక్కువాఁడ
నీరజాక్షుండు చాల మ ♦ న్నించు నట్టి
శక్రముఖ్యమకావవే ♦ చాలుమునిని ॥౯-౧-౨౯॥

క॥ సర్వము నీలోనిదిగా
సర్వాత్ముఁడ వాత్మవస్తు ♦ సంపన్నుఁడవై
సర్వమయుఁడవగు నీకును
సర్వేశ్వర లేవు లోను ♦ సంధులు వెలియున్॥ ౧౦-౧-౧౨౦

ఆ॥ ఆత్మవలనఁ గలిగి ♦ యమరు దేహాదుల
నాత్మకంటె వేఱు ♦ లవియటంచుఁ
దలఁచువాఁడు మూఢ ♦ తముఁడు గావున నీశ
విశ్వమెల్ల నీవ ♦ వేఱులేదు॥ ౧౦-౧-౧౨౧

సీ॥ అఖిలజంతువులకు ♦ నాత్మవల్లభుఁడైన
భంగి బిడ్డలునిండ్లు ♦ బసిఁడిమొదలు
వస్తువులెవ్వియు ♦ వల్లభంబులుగావు
సకలాత్మకుండైన ♦ జలజనేత్రుఁ
డఖిలజంతువులకు ♦ నాత్మగావున ఘోష
వాసులకెల్లను ♦ వల్లభత్వ
మునమిక్కిలొప్పెను ♦ మూఁడులోకములకు
హితముసేయఁగ జల ♦ జేక్షణుండు

ఆ॥ మాయతోడ మూర్తి ♦ మంతుఁడై యొప్పారు
గలఁడతండు నిఖిల ♦ గణములందు
భవతి ధాతువెట్లు ♦ భావార్థమై సర్వ
ధాతుగణమునందుఁ ♦ దనరునట్లు॥ ౧౦-౧-౫౯౩

మూ॥ సర్వంచ ఖల్విదంబ్రహ్మ నిత్యంచిద్ఘన మవ్యయం
కల్పనాఽన్యామనోనామ్నీ విద్యతే నహికాచన॥ ౪౯
—జ్ఞానవాశిష్ఠము-ఉత్పత్తి ప్రకరణోపాఖ్యానం.

తా॥ కనబడునట్టి యీప్రపంచంబంతయు త్రైకాలికాబాధ్యం బును చిద్రూపంబునునగు బ్రహ్మముయొక్క వివర్తమేయగును. మనస్సు అనుకల్పనయు ఆబ్రహ్మముకంటె వేఱుగా నింకొకటిలేదు.

మూ॥ సాక్షి భూతే సమేస్వచ్ఛే నిర్వికల్పే చిదాత్మని
నిరర్థం ప్రతిబింబంతి జగంతి ముకురేయథా॥౨

—స్థితిప్రకరణము, శుకోపాఖ్యానం.

తా॥ ప్రత్యక్షముగా జూచినట్టివాడు గావున సాక్షియు పరి పూర్ణుడును, నిర్మలుడును, భేదరహితుండును, నగు చిదాత్మయందు జగములు అద్దమునందు ప్రతిఫలించినట్లు నిష్ప్రయోజనముగా ప్రతిబిం బించుచున్నవి.

మూ॥ రేఖోపరేఖావలితా యథైకాపీవరీశిలా
తథా త్రైలోక్యవలితం బ్రహ్మైకమితి దృశ్యతాం॥౩

తా॥ ఒక్కటియగు గొప్పఱాయి రేఖోపరేఖలతోగూడి ఏనుగులు గుఱ్ఱములు మొదలగు రూపములతోడను దేవాలయాది రూపములతోడను భేదముకలిగియున్నట్లు కనబడినను ఒకటియే అయి నట్లు, బ్రహ్మము ఒకటియే త్రైలోక్యరూపముతో వివర్తమును పొందియున్నదని యెంచవలయును.

మూ॥ ద్వితీయకారణాభావాదనుత్పన్నమిదంజగత్
తిష్ఠతి బ్రహ్మణిస్ఫారే ప్రతిభామాత్రరూపధృత్॥౪॥

తా॥ బ్రహ్మముకంటె నితరమగు కారణములేనందున ఉత్ప త్తినొందని యీజగము ప్రతిభామాత్రరూపమును ధరించి బ్రహ్మము నందు ఉన్నది.

మూ॥ నాఽస్తిచిత్తం నచాఽవిద్యా నమనో నాఽస్తిజీవకః।
ఏతాశ్చ కలనారామ కృతా బ్రహ్మణఏవతాః॥
బహ్మైవైకమనాద్యంత మబ్ధివత్ప్రతి జృంభతే॥౫॥

—నిర్వాణప్రకరణం.

తా॥ ఓరాఘుచంద్రా చిత్తములేదు. అవిద్యయు లేదు. మనస్సునులేదు. జీవుండునులేదు. ఈకల్పనలన్నియు బ్రహ్మమువల్లనే కలుగుచున్నవి. ఆద్యంతరహితంబును నేకంబునగు బ్రహ్మమే సముద్రమువలె బ్రకాశించుచున్నది.

మూ॥ సమస్తం ఖల్విదంబ్రహ్మ సర్వమాత్మేద మాతతం।
అహామన్య ఇదంచాన్యదితి భ్రాంతిం త్యజాఽనఘ ॥౩॥
—ఉపశమప్రకరణము.

తా॥ విస్తారంబగు నీజగంబంతయు బ్రహ్మస్వరూపంబయగును. నేను వేరు. ఈజగము వేరు. అనునట్టి భ్రాంతిని విడువుము

మూ॥ తతేబహ్మఘనేనిత్యే సంభవంతి నకల్పనాః।
విచ్ఛిత్తయః పయోరాశౌ యథారామ నసన్మయాః ॥౪॥

తా॥ నిత్యంబును ఘనీభూతంబును నగు బ్రహ్మంబునందు నితరకల్పనలు ఎప్పుడును సంభవింపవు. ఒకప్పుడు సంభవించినను సముద్రమునందు బొడమిన తరంగంబులట్లు సద్రూపంబులుగావని యెఱుంగనగును.

మూ॥ నశోకోఽస్తి నమోహోఽస్తి నజన్మాస్తి నజన్మవాన్।
యదస్తీహ తదేవాఽస్తి విజ్వరోభవ రాఘవ ॥౫॥

తా॥ అట్లుకావున శోకంబుగాని మోహంబుగాని జన్మంబుగాని లేవు. ఇక చిన్మాత్రరూపంబగు బ్రహ్మంబే గలదు. కావున సంతాపరహితుండ వగుము.

మూ॥ అవిద్యమానమేవేదం విద్యమాన మివస్థితం।
ఆభాసమాత్రం త్రిజగన్నాఽన్యదస్తి మునీశ్వర ॥ ౧౩౩॥
—నిర్వాణప్రకరణం—దేవపూజోపాఖ్యానం.

తా॥ ఈజగము నిజముచేత లేనిదే ఉన్నటుల గనబడుచున్నది. చిన్మాత్రమే యగుగాని యింతకంటె వేఱుగానేరదు.

మూ॥ యోఽసౌ బ్రహ్మదిశబ్దార్థ స్తంవిదం విద్ధికేవలాం।
నావేద్యమివ గచ్ఛతీ యాంతి చిన్నామ యోగ్యతాం ॥ ౧౩౪॥

తా॥ బ్రహ్మమొదలగు శబ్దములయర్థమును శుద్ధమగు జ్ఞానమునుగా నెఱుంగుము. అయ్యది దృశ్యమునకభిముఖమై చిత్తు అనునామమున కర్తృత్వను బొందుచున్నది.

మూ॥ క్షణాద్భావితవేద్యత్వా దహంతా మనుగచ్ఛతి।
పుమాన్భావనయా స్వప్నే వనవారణతామివ ॥౧౩౫॥

తా॥ పురుషుడు భావనచేత స్వప్నమునందు అడవియేనుగు రూపమును పొందునటుల నాచిత్తు దృశ్యమును భావించుటచే క్షణమాత్రమున నహంకారరూపమును బొందుచున్నది.

మూ॥ అస్యా అహంతా రూపాయా దేశతాం కాలతాంగతాః।
సంపద్యంతే స్వయం శూన్య రూపిణ్యాః సఖ్యఏవతాః ॥౧౩౬॥

తా॥ అహంకారరూపమును పొందిన యీచిత్తునకు శూన్యరూపంబులును ననేకంబులునగు దేశకాలాదిశక్తులు సహాయములగుచున్నవి.

మూ॥ తాభిస్సంవలితా సైవ సత్తాజీవాభిధానికా।
భూత్వా బుద్ధిత్వమాయాతి నిత్యమజ్ఞపదేస్థితా ॥౧౩౭॥

మూ॥ జీవశక్తి స్తథాభూతా నిశ్చయైక విలాసినీ।
శబ్దశక్త్యా క్రియాశక్త్యా జ్ఞానశక్త్యా నుగమ్యతే॥౧౩౮॥

మూ॥ మిళిత్వైవమగణః క్షిప్రం స్మృతిం సమను కల్పయన్।
మనోభవతి శుద్ధాత్మ బీజం సంకల్ప శాఖినః ॥౧౩౯॥

మూ॥ ఆతి వాహికదేహాఖ్యా క్తి భాజనం తద్విదుర్బుధాః।
పరామర్శైకరూపిణ్యో హ్యనంతా స్తస్య శక్తయః॥
వ్యోమాది రూపతామేత్య జగన్నానా విభాతితత్ ॥౧౪౦॥

తా॥ చిత్రిరూపిణియగు నా సత్తయా దేశకాలాదులతోగూడి జీవ రూపమునొందినదై అజ్ఞపదమునందుండి బుద్ధి రూపత్వము నొందుచున్నది. జీవరూపయగు చిచ్ఛక్తి బుద్ధిత్వమును పొంది నిశ్చయస్వరూపముతో ప్రకాశించుచు శబ్దశక్తిక్రియాశక్తి, జ్ఞానశక్తి అను

వానితోఁగూడుచున్నది. ఈ యహంకారాది సమూహంబు శబ్దశక్త్యా దులతోడఁగూడి స్మరణశక్తిని కల్పించుచు సంకల్పవృక్షంబునకు బీజ భూతంబును స్వచ్ఛంబునగు మనంబగుచున్నది. ఆమనస్సే సూక్ష్మ శరీరమనియు జెప్పబడుచున్నది. ఆమనస్సునకు పరామర్శమే ముఖ్య రూపముగాఁగల యనేకములగు శక్తులుగలవు. ఇట్టి శక్తులుగల యా మన స్సాకాశాదిరూపమును పొంది నానావిధంబగు జగంబుగా బ్రకా శించుచున్నది.

మూ॥ శూన్యఏవహి వేతాళ ఇవేత్థం చిత్తవాసనా ।
ఉదితేయం జగన్నామ్నా తచ్ఛాంతౌ శాంతిరక్షతా ॥౧౮౧॥

తా॥ ఎట్లు బేతాళుడు కల్పితుండుగావున శూన్యుఁడనుటయే పరమార్థమో ఇట్లు చిత్తవాసనయే జగద్రూపముగా నుదయించినది. ఆచిత్తవాసన శాంతింపగా జగంబునడగి కైవల్యంబు గలుగుచున్నది.

మూ॥ అహంతాయాం జగతిచ మృగతృష్ణా జలేచయః ।
సాస్థాస్తంధిగ్ఘ నతనరం నోపదేశ్య స్త్వపావిహా ॥౧౮౨॥

తా॥ఎవడు అహంకారము జగంబునను మరుమరీచికాజల మునందు వాస్తవత్వబుద్ధిగలవాఁడో వానిని ధిక్కరింపవలయు. ఇట్టివాడు బ్రహ్మవిద్యోపదేశమునకు నర్హుఁడుకాడు.

మూ॥ ఇమాఘటపటాకారా పదార్థశతశక్తయః ।
ఆత్మైవ నాన్యదస్తీతి నిశ్చయస్సమ్యగీక్షణం ॥౯౩॥
—ఉపశమప్రకరణం వీతహవ్యోపాఖ్యానం.

తా॥ ఘటము పటము ఈమొదలగు నాకారంబులుగల యనే కంబులైన పదార్థంబులు ఆత్మయే యగుగాని యాత్మకంటె నితరము కానేరవు. అను నిశ్చయము దృఢమగు జ్ఞానమని చెప్పబడును.

మూ॥ నచేత్య మన్యన్నోచిత్తం బ్రహ్మైవేదం విజృంభతే ।
సర్వమేకం పరంబ్రహ్మ కోమోక్షః కాచబంధతా ॥౯౪॥

తా॥ ఆత్మకంటె నితరముగా భిత్తముగాని చేత్యము (దృశ్యము) గాని లేదు. బ్రహ్మమే ప్రకాశించుచున్నది. సర్వంబును పరంబ్రహ్మము ఒక్కటియే అయియుండగా మోక్షమెయ్యది? బంధ మెయ్యది? యగును.

మూ॥ బ్రహ్మేదం ప్రహితాకారం  బృహద్బృహ దవస్థితం।
దూరాదస్తమితద్విత్వం భవాత్మైవ త్వమాత్మనా ॥ ౯౭॥

తా॥ ఇట్టి బ్రహ్మంబే విస్తరంబగురూపంబు గలిగి భూమి పర్వతములు మొదలగు రూపములతో నొకదానికంటె నొకటి గొప్ప దియగు రూపంబుధరించి ప్రకాశించుచున్నది. కావున నీవు అద్వి యంబగు నాపరమాత్మ స్వరూపుండ వగుము.

3-వ బ్రహ్మశక్తియగు మాయాలక్షణము.

సీ॥ ఉన్నదిలేదని ♦ యూహింపఁగానేర్చు
లేనిదికలదన ♦ లెస్సనేర్చు
నజడంబుజడమని ♦ యాగడింపఁగనేర్చు
జడమజడంబని ♦ చాటనేర్చు
సుఖముదుఃఖంబుగాఁ ♦ జూపిచెప్పగనేర్చు
దుఃఖఁబుసుఖమనఁ ♦ దొలుతనేర్చు
నిదియదిగాదని ♦ యింపుగాననేర్చు
నదియిదిగాదని ♦ యనఁగనేర్చుఁ

తే॥ బిదపఁగలదిమొకలదు లే ♦ నిదియెలేదు
కడగి యజడంబె యజడము ♦ జడమజడము
సుఖముసుఖమే సుఖముతలంప న ♦ సుఖమసుఖము
అదియొయిది యిదియదియని ♦ యాడనేర్చు॥3-౮౧॥
—సీతారామాంజనేయము.

తే॥ అట్టినాయందనాదిగా ♦ నాత్మశక్తి
యలరు నవ్యక్తమై జగ♦దాదియగుచుఁ

గలితమృత్తికయందున్న ♦ కలశశక్తి
యేర్పడక కుంభ హేతువై ♦ యొనసినట్లు॥ ౨-౧౯

సీ॥ వటబీజమున మహా ♦ వటమహీరుహశక్తి
యుజ్జ్వలవహ్నియం ♦ దుష్ణశక్తి
యింద్రజాలకునియం ♦ దెపుడు మాయాశక్తి
కలితోపలములందుఁ ♦ గఠినశక్తి
సలిలజాతమునందు ♦ సలలిత ద్రవశక్తి
పవనంబునందతి ♦ స్పందశక్తి
పారిశుక్లశోణితం ♦ బులయందుఁ దనుశక్తి
తగుశరీరముల జై ♦ తన్యశక్తి

తే॥ దనరి యవ్యక్తమగుచు ♦ దత్సన్నిధాన
మై యధిష్ఠానమునకంటె ♦ ననితరంబు
నగుపగిదినొప్పు నాయందు ♦ నాత్మశక్తి
యేర్పడక యన్యమై విశ్వ ♦ హేతువగుచు॥ ౨-౨౦

తే॥ అరయ నాయున్కికంటె వే ♦ ఱైనయున్కి
లేదుగాన మద్భిన్నంబు ♦ గాదవిద్య
ప్రకృతి యజ్ఞానమనిపల్కు ♦ బడుటవలన
గాదు మదభిన్నమును నా య ♦ నాదిమాయ॥ ౨-౨౨

క॥ భిన్నాభిన్నముగాదని
యెన్నంగానేల ప్రకృతి ♦ యిట్లగుట సుసం
పన్నులనిర్వాచ్యంబని
మున్నగణించిరి సమస్త ♦ ముం దెలిసి సుతా॥ ౨-౨౩

తే॥ అనుభవజ్ఞానదృష్టిచే ♦ నరయఁదుచ్ఛ
మొఁగిన నిర్వచనీయమా ♦ యుక్తిదృష్టి
చేత లౌకికమయదృష్టి ♦ చేననంత
మగుదలంప మదీయ మా ♦ యాతమంబు॥ ౨-౨౪

సీ॥ త్రాడు భుజంగమై ♦ స్థాణువు పురుషుఁడై
రాజిల్లుశుక్తిక ♦ రజతమగుచు
*మరుమరీచికలు ని♦ర్మలసలిలంబులై
తొడరిమిన్నసితమై ♦ తోఁచుపగిది
సద్వయామలసచ్చిదా ♦ నందమయుడనై
తగునేనుమిగులనే ♦ ద్దానివలనఁ
దోలుతన సజ్జడ ♦ దుఃఖాత్మకములైన
జగములై కనుపింతు ♦ జనులకెల్ల
తే॥ దృఢతరాద్వైతవిజ్ఞాన ♦ దృష్టిచేతఁ
బండితులుపూర్ణనిర్గుణ ♦ బ్రహ్మమయుఁడ
నైన ననుగాంచినంత నె ♦ య్యది యభావ
మగునదియసూ మదీయ మా♦యాతమంబు॥ ౨-౨౫.

వ॥ అది మఱియు సర్వభూతసుషుప్తి సమష్టిరూపంబు, సమస్తప్రపంచవాసనామయంబు, సత్త్వరజస్తమోగుణాత్మకంబు, స్వాంతర్గుప్తానంతకోటిజీవసంఘాతంబుఁ, గేవలజడంబు, మోహాత్మకంబు, సకలజగదుపాదాన కారణంబు, నవిద్యావ్యక్తతమస్సుషుప్తి, ప్రకృతిప్రళయ ప్రధానమాయాజ్ఞానాది శబ్దవాచ్యంబునై యొప్పుచుండునని వెండియు॥ ౨-౨౬.

తే॥ ఆదిమధ్యాంతశూన్యమై ♦ నట్టిప్రకృతి
యాదిమధ్యాంతములుగల్గి ♦ నట్లుతోఁచి
యాదిమధ్యాంతరహితాద్వ♦యాత్మునకును
నాదిమధ్యాంతములుగల్గ ♦ నావరించె॥ ౨-౨౭.

శ్లో॥ మాయా మాయాకార్యం సర్వంమహదాది దేహపర్యంతః।
అసదిదమనాత్మకం త్వం విద్ధిమరుమరీచికాకల్పం॥

తా॥ మాయయున్ను మాయాకార్యమైన మహత్తుమొదలు దేహముపర్యంతము సర్వము అసత్యము. ఇదంతయు అనాత్మకమనియు

మరుమరీచి (ఎండమావుల) కలరీతిని కల్పితమనియు నీవు తెలిసి కొనుము.

శ్రుతి॥ మాయానామ- అనాదిరంతవతీ వ్యవహారభేదవతీ యానవిద్యతే వస్తుతస్సామాయా తత్స్వరూప మజ్ఞానం ॥సర్వసారోపనిషత్ ॥

తా॥ మాయ అనాదియు సాంతమునై యున్నది. వ్యవహారదశయందు జీవేశ్వరాది నానావిధభేదములుగా తోపింపజేయునదియై యున్నది. ఏది వాస్తవముగా (త్రికాలములయందు) లేనిదో అదియే మాయ యనబడును. అజ్ఞానమే దానిస్వరూపము.

శ్రుతి॥ అజ్ఞానమితిచ రజ్జు సర్పభ్రాంతిరివా ద్వితీయే సర్వానుస్యూతే సర్వమయే బ్రహ్మణి దేవతిర్యఙ్నర- స్థావర- స్త్రీపురుష- వర్ణాశ్రమ-బంధమోక్షోపాధినా- నానాభేదకల్పితం జ్ఞానమజ్ఞానం॥

—నిరాలంబోపనిషత్ ॥

తా॥ అజ్ఞానమనగా ఏది? ఉత్తరము:— అద్వితీయమైనటువంటిన్నీ, సర్వమునందు నున్నటువంటిన్నీ, సమస్తవస్తువులయందున్ను బహిరంతములయందు నిండియున్నటువంటిన్నీ బ్రహ్మమునందు రజ్జుసర్పభ్రాంతిరీతిగా దేవ మానవ తిర్యగ్స్థావర స్త్రీపురుష వర్ణాశ్రమ బంధమోక్షములు మొదలైన నానాభేదమును కలిగించెడి జ్ఞానమే అజ్ఞానమనబడును.

శ్లో॥ నిస్తత్త్వా కార్యగమ్యాస్య శక్తిర్మాయాగ్నిశక్తివత్ ।
నహి శక్తిం క్వచిత్కశ్చి ద్బుధ్యతే కార్యతః పురా ॥ ౪౭॥

—పంచభూతవివేకము.

తా॥ బొబ్బలుచేయుట మొదలగు గురుతుగల కార్యమును గలిగించెడి యుష్ణశక్తి అగ్నియందున్నట్లు ఈసద్వస్తువునందు ఆకాశాది చిహ్నముగల కార్యమును గలిగించెడి శక్తియొకటిగలదు. ఆశక్తి మాయయని చెప్పబడును. ఆమాయ తనకాధారమగు సద్వస్తువుకంటె నన్యమైన స్వరూపములేనిదగును. ఆకాశాది కార్యచిహ్నముచే నెరుగ

దగినదగును. ఆయాకార్యమును చేయుటకంటె పూర్వమందు నాయా శక్తి నెచ్చటనైన నెవ్వడైన నెరుగజాలడు.

శ్లో॥ నసద్వస్తు సతశ్శక్తి ర్నహివహ్నె స్స్వశక్తితా ।
సద్విలక్షణసత్తాయాంతు శక్తేః కింతత్వముచ్యతాం ॥ ౪౮॥

సద్వస్తువగు బ్రహ్మమందుండెడి మాయాశక్తిని సద్వస్తువని చెప్పినయెడల సద్వస్తువగు బ్రహ్మముకంటె నభిన్నమని చెప్పవలసి వచ్చును. అట్లభిన్నమైనయెడల నామాయకు శక్తియనెడి పేరు గలుగ రాదు. మరియు అగ్నియందుగల ఉష్ణశక్తి తేజోరూపమగు అగ్నియే మైనట్లు కనపడలేదు. కనుక సద్వస్తువునందుగల మాయాశక్తిని సద్వ స్తువేయని చెప్పరాదు. మరియు నామాయాశక్తిని అసత్తని చెప్పెడి పక్షమందు ౧. మనుష్యులకు కొమ్ముగలదనెడి మాటవలె కేవలశూ న్యమో లేక ౨. సద్వస్తువగు బ్రహ్మముకంటె నన్యమో జెప్పుము.

శ్లో॥ శూన్యత్వ మితిచేచ్ఛూన్యం మాయాకార్య మితీరితం ।
నశూన్యం నాపి సద్యాదృక్తా దృక్తత్వమిహోచ్యతాం ॥ ౪౯॥

తా॥ మాయాస్వరూపము మనుష్యులకు కొమ్ముగలదనెడి మాటవలె కేవల శూన్యముకాదు. అందుచేత మాయాస్వరూప మును సద్వస్తువుకంటె నన్యమేనని చెప్పవలెను. కనుక శూన్యము గానట్టియు సద్రూపముగా నట్టిరూపమెటువంటిదో అట్టి స్వరూపము గలది మాయయని తెలియవలెను. అనగా సత్యాసత్య శబ్దములచేత జెప్పుటకు యోగ్యతలేనిది మాయాస్వరూపమని యభిప్రాయము.

శ్లో॥ నాసదాసీ న్నోసదాసీత్తదానీం కింత్వభూత్తమః
సద్యోగాత్తమ సస్సత్వాం నస్వత స్తన్నిషేధనాత్ ॥౫౦॥

తా॥ ఆమాయాశక్తి సద్రూపముగాదనియు, శూన్యము గాదనియు శ్రుతి జెప్పుచున్నది. మరియేమనగా ఆమాయాశక్తి సృష్టికి పూర్వమందు సుషుప్తియందువలె గాఢాంధకారరూపముగా నుండెనని శ్రు॥ నాసదాసీన్నో సదాసీత్తమ ఆసీత్తమసా గూఢమగ్రే॥

అనేది ఇత్యాదిశ్రుతి జెప్పుచున్నది. ఆ యంధకారము సద్వస్తువగు బ్రహ్మముతో గూడియుండుటచేత ఆయంధకారరూపమాయకు (ఉండెననెడి) సద్రూపధర్మము చెప్పబడనేగాని ఆమాయకు స్వంతముగా సద్రూపత్వము లేదు. కనుక మాయ వస్తువు గాదు. అయంధకారరూపమగు మాయాశక్తి సత్యవస్తువుగాదని శ్రుతిచేత నిషేధింపబడెను. అందుచేత నామాయాశక్తికి స్వంతముగా ప్రత్యేకస్థితి లేదని తెలియవలెను.

వ॥ అదియునుగాక నీవు నన్నడిగిన ఈజగన్నిర్మాణ మాయా ప్రకారం బెఱింగింతువేని యర్థంబు శుక్తిరజత భ్రాంతియుంబోలె నేమిటి మహిమండోఁచి క్రమ్మఱ దోఁపకమానునదియె నా మాయా విడంబనంబని యెఱుంగు మదియునుంగాక లేనియర్థంబు దృశ్యమానంబగుటకును గలయర్థంబు దర్శనగోచరంబు గాకుండుటకును ద్విచంద్రాదికంబును దమఃప్రభావంబును దృష్టాంతంబుగాఁ దెలియుము......

—భాగవతము, ద్వితీయస్కంధము ౨౫౫.

మూ॥ అవిరతమియమాతతాస్థితౌస్థై, ర్యవతి వినశ్యతి వర్ధతేముధైవ
త్రిభువనరచనావిమోహమాయా, పరమపదేలహరీవ వారి
రాశౌ॥౭౨॥ జ్ఞానవాశిష్టము.

తా॥ సముద్రంబున ప్రవాహంబట్లు బ్రహ్మమందు విస్తరంబై యస్థిరంబై త్రిభువనరచనామూలంబై యందఱను మోహింపజేయునట్టిమాయ వ్యర్థంబుగ బుట్టియు పెఱిగియు నశించుచున్నది.

మూ॥ అహోవిచిత్రం మాయేయం బలవిశ్వవిమోహినీ
అసత్యైవాపి సద్రూపా సుదృఢామరువారివత్॥ ౩౨॥

—నిర్వాణప్రకరణం శతరుద్రోపాఖ్యానం.

తా॥ ఈమాయ మిథ్యాభూతమైనను దృఢంబుగ సద్రూపంబై మరుమరీచికాజలంబుబోలె విశ్వంబును మోహపెట్టుచున్నది. ఎంత చిత్రము.

శ్రుతి॥ తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మ శక్తిం స్వగుణై
ర్నిగూఢాం॥ —శ్వేతాశ్వతరము.

తా॥ వారు (మునులు) జగత్కారణమును తెలియగోరిన వారగుచు స్వభావకాలాదులు జగత్కారణములగుననెడి వాదముల యందు దోషబాహుళ్యమును జూచినవారై జగత్కారణమును దెలియ వలెననెడి ఇచ్ఛచేత ధ్యానయోగము నవలంబించి పరబ్రహ్మము యొక్క మాయాశక్తిని తన కార్యములగు స్థూలసూక్ష్మశరీరములచేత గప్పబడియున్న దానినిగా ప్రత్యక్షముగా జూచిరి.

శ్రుతి॥ పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీజ్ఞానబలక్రియాచ॥
—శ్వేతాశ్వతరము.

తా॥ బ్రహ్మముయొక్క సర్వజగత్కారణభూతమగు ఉత్కృష్టశక్తి, జ్ఞాన, ఇచ్ఛాక్రియాస్వరూపము గలదగుటచేత నానావిధముగా వినబడుచున్నది.

శ్రుతి॥ మాయాచ తమోరూపా॥

తా॥ మాయతమోరూపి.

శ్రుతి॥ తదేతజ్జడం మోహాత్మకం॥ అనంతం॥
తా॥ అతి మోరూపియగు ఈమాయ జడరూపియనియు, మోహనరూపియనియు, అనంతమనియు తెలియవలెను.

శ్రుతి॥ నాసదాసీన్నోసదాసీత్ ॥ మాయసత్యముగాదు. అసత్యమునుగాదు (అనిర్వాచ్యము)

శ్రుతి॥ తుచ్ఛమిదంరూపస్య అయుక్తం॥ తా॥ జ్ఞానదృష్టిచేత ఆమాయ సర్వదా లేనిదియేగనుక మాయ తుచ్ఛరూపమని (అనగా కాలత్రయమందు లేనిది తుచ్ఛము) జెప్పి "అయుక్తమని" శ్రుతివలన ఉపేక్షింపబడుచున్నది.

శ్రుతి॥ అస్యసత్త్వమసత్త్వంచదర్శయతి॥ తా॥ ఈజగత్తుయొక్క ఉనికిలేములను జూపుచున్నది.

శ్రుతి॥ స్వతంత్రాఽస్వతంత్ర్యత్వేన॥ మాయకుస్వాతంత్ర్యము అస్వాతంత్ర్యము రెండును జూపబడుచున్నది.

శ్రుతి॥ జీవేశావాభాసేనకరోతి॥ తా॥ (మాయ) చిదాభాస స్వరూపముచేత జీవేశ్వరుల నిద్దరిని జేయుచున్నది. మాయాలక్షణ తత్కార్యాదులను గురించి శ్రీవేదాంతపంచదశి చిత్రదీపమునందు౧౨౫ మొదలు ౧౫౩ శ్లోకమువరకు విపులముగా చర్చింపబడి యున్నది.

## 33 మాయకు ఏకదేశవృత్తిత్వము.

మాయ పరబ్రహ్మముయొక్క ఏకదేశమందు వర్తించుచున్నది కాని బ్రహ్మమందంతట నుండియుండలేదు. భూమియందు మెత్తని మట్టియందే ఘటమును కలిగించెడిశక్తి యుండినట్లున్ను, సముద్రము యొక్క యొకభాగమునందే అలలు నురుగులను కలిగించెడి శక్తి యుండినట్లున్ను, మాయయు బ్రహ్మముయొక్క ఏకదేశమందుండి అనేక భేదరూపములయిన జగద్విలాసములను జూపుచున్నది. మిగత బ్రహ్మముయొక్క మూడుభాగములును ముక్తులచే పొందదగిన అమృతస్వరూపముగా నున్నది.

శ్రుతి॥ పాదోఽస్యవిశ్వాభూతాని త్రిపాదస్యాఽమృతం దివి॥

—తైత్తిరీయోపనిషత్ ॥

తా॥ సర్వభూతములును ఈబ్రహ్మముయొక్క ఏకపాదమగును. ఈబ్రహ్మముయొక్క మూడుపాదములు (స్వప్రకాశనిర్వికల్పమగు) అమృతస్వరూపమై యున్నది.

శ్రుతి॥ సభూమిం విశ్వతోవృత్వా హ్యత్యతిష్ఠద్దశాంగులం॥

తా॥ నిర్గుణుడగు నాపరమాత్మ భూమి యంతటను వ్యాపించి బ్రహ్మాండము నతిక్రమించియున్నాడు.

సూ॥ వికారావర్తిచ తథాహి స్థితిమాహ॥ బ్రహ్మసూత్రము.

తా॥ వికారమందు వర్తింపని నిర్వికల్పరూపము బ్రహ్మమునకు గలదు.

శ్లో॥ అథవాబహునైతేన కింజ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్॥ ౪౨॥

—శ్రీభగవద్గీతా॥

తా॥ ఓయర్జునా! నామాహాత్మ్య విస్తారములను వేర్వేరుగా వివరింపవలసిన యావశ్యకము లేదు. వానిని జక్కగా దెలియవలసిన పని నీకును లేదు. ఈ యెల్లప్రపంచములు నా యనేకాంశములలో నొక యంశముచేతనే వ్యాపింపబడియున్నవని యెఱుగుము.

శ్లో॥ నకృత్స్న బ్రహ్మవృత్తిస్సా శక్తిః కింత్వేక దేశభాక్।
ఘటశక్తిర్యథా భూమౌ స్నిగ్ధమృద్యేవ వర్తతే॥ ౫౪॥

—పంచభూతవివేకము॥

తా॥ భూమియందు ఘటమును గలిగించెడిశక్తి మెత్తని మట్టి యందు మాత్రమే వర్తించుచున్నట్లు ఆమాయాశక్తి బ్రహ్మమందంతట బ్రవర్తనముగలదిగాక ఒకప్రదేశమందే వర్తించుచున్నది.

౩౪ విద్య (జ్ఞానము) వలన అవిద్య (అజ్ఞానము) నశించును.

జగద్భ్రమకు కారణము సత్యవస్తుజ్ఞానము లేకుండుటయగు. సర్పభ్రమకు కారణము సత్యమగు రజ్జుజ్ఞానము లేకుండుటయే. రజ్జువు యొక్క అజ్ఞానముచే సర్పము ప్రతీతియగుచున్నది. అటులనే ఆత్మ యొక్క అజ్ఞానమే మిథ్యాజగమునకు కారణము. తనయజ్ఞానముచేతనే జగము ప్రతీతియగుచున్నది. తాను సచ్చిదానందస్వరూపుడనని తెలిసి కొనకుండుటయే అజ్ఞానముయొక్క స్వరూపమగును. ఆత్మజ్ఞానమును బొందుటయే అజ్ఞానమునకు వినాశనమగును.. ఆత్మ సచ్చిదానందస్వ రూపుడని తెలియుటయే అనృత జడదుఃఖాత్మికయగు జగద్భ్రమకు కారణమైన అజ్ఞానమునకు నాశనమగుచున్నది.

శ్రుతి॥ యాతదభిమానం కారయతి సాహ్యావిద్యా సోభిమానో యయానివర్తతే సావిద్యా॥ —సర్వసారోపనిషత్॥

తా॥ దేహేంద్రియంబులే నేననెడి అభిమానము ఆత్మకు దేనివలన గలుగుచున్నదో అదే అజ్ఞానమనియు లేక అవిద్యయనియు

చెప్పబడును. అట్టి యభిమానము ఏజ్ఞానమువలన నివర్తింపబడుచున్నదో ఆజ్ఞానమే విద్యయనబడును.

శ్రుతి॥ దృశ్యాసంభవ బోధోహి జ్ఞానం జ్ఞేయంచిదాత్మకం। తదేవ కేవలీభావం తతోన్యత్సకలం మృషా॥ —మహోపనిషత్॥

దృశ్యము అసత్యమని ఎరుగుటే విచారణజ్ఞానమనబడును. చిద్రూపమగు బ్రహ్మమే సత్యముగా తెలిసికోతగినది. అదియే సత్యము. అంతకంటే అన్యమంతయు అసత్యము.

శ్రుతి॥ సఏవమాయా పరిమోహితాత్మా శరీరమాస్థాయ కరోతి సర్వం। స్త్రీ అన్నపానాది విచిత్రభోగై స్సఏవ జాగ్రత్పరితృప్తిమేతి। స్వప్నేపి జీవస్సుఖదుఃఖ భోక్తా స్వమాయయా కల్పిత విశ్వలోకే। సుషుప్తికాలే సకలే విలీనే తమోభిభూత స్సుఖరూపమేతి॥ పునశ్చ జన్మాంతర కర్మయోగా త్సఏవ జీవస్స్వపితి ప్రబుద్ధః। పురత్రయే క్రీడతియశ్చ జీవ స్తతస్తు జాతం సకలం విచిత్రం॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే। తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే॥

తా॥ ఆపరమాత్మయే శరీరమందుండి మాయచేత మోహింపబడినవాడై జీవరూపమును ధరించి, సర్వమును జేయుచున్నాడనియు, ఆజీవుడే స్త్రీఅన్నపానాది విచిత్రభోగములచేత జాగ్రదవస్థయందు తృప్తిబొందుచున్నాడు. మరియు ఆజీవుడే స్వప్నావస్థయందు తన మాయచేత గల్పింపబడిన ప్రపంచసంబంధ సుఖదుఃఖముల ననుభవించుచున్నాడు. మరియు ఆజీవుడు సుషుప్త్యవస్థయందు సకలేంద్రియములు లయించుచుండగా అజ్ఞానముచేత దిరస్కరింపబడి సుఖరూపమును బొందుచున్నాడు. మరల నాజీవుడే పూర్వజన్మ కర్మసంబంధవశమున స్వప్నజాగ్రదవస్థలం బొందుచున్నాడు. ఇట్లు మూడవస్థలనెడి మూడుపట్టణములయందు ఏజీవుడు క్రీడించుచున్నాడో ఆజీవునివల్ల విచిత్రమంతయు బుట్టుచున్నది. మరియు జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపం

చమును, ఏ బ్రహ్మము ప్రకాశింపజేయుచున్నదో, ఆ బ్రహ్మము నేనని యెరిగిన జీవుడు సర్వబంధములచే విముక్తుడగుచున్నాడు.

శ్లో॥ అపరోక్షాత్మవిజ్ఞానం శాబ్దం దేశికపూర్వకం
సంసారకారకాజ్ఞాన తమసశ్చండభాస్కరః॥౬౮

తా॥ ఆచార్యునివల్ల తత్త్వమస్యాది వేదాంతవాక్యవిచారణ ద్వారా కలిగిన బ్రహ్మసాక్షాత్కారరూపమగు అపరోక్షజ్ఞానము సంసారకారణమైన అజ్ఞానమనెడి చీకటికి మధ్యాహ్నకాలీన సూర్యుని వంటిదగును. అనగా అహంబ్రహ్మాస్మి అనెడి యాకారముగాగల అపరోక్షజ్ఞానము అజ్ఞానమును నశింపజేసి పురుషునకు సర్వసంసార విముక్తిని కలిగింపుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ అవిచారకృతోబంధో విచారేణ నివర్తతే।
తస్మాజ్జీవపరాత్మానౌ సర్వదైవ విచారయేత్॥ ౫

—నాటకదీపము.

తా॥ ఆత్మతత్త్వవిచారములేమిచే గలిగినట్టి బంధము తత్త్వవిచారముచేత నివర్తించుచున్నది. ఆకారణమువలన జీవపరమాత్మలను సర్వదా విచారించవలెను.

శ్లో॥ స్థాణౌ పురుషవద్భ్రాంత్యా। కృతాబ్రహ్మణి జీవతా।
జీవస్య తాత్వికేరూపే తస్మిన్ దృష్టే నివర్తతే॥ ౪౫

—ఆత్మబోధము.

తా॥ లోకమందు గాఢాంధకారములో ఒక మొద్దునుచూచి దొంగగా భ్రమించినప్పుడు దానివలన భయకంపములు మొదలైనవా టినిపొంది దుఃఖపడినప్పటికిన్ని విచారించి దాని యధార్థస్వరూపము తెలిసికొన్నమాత్రముచేత ఆ మొద్దునందు కల్పింపబడ్డ చోరత్వము నివర్తింపబడి దుఃఖరహితుడైనట్లు బ్రహ్మమందు కల్పింపబడిన జీవత్వ మున్ను శ్రుత్యుక్త్యనుభవములవల్ల విచారించినట్లైతే ఆ జీవత్వము నివ

ర్తింపబడి కర్తృత్వాది రహితుఁడుగానున్ను దుఃఖరహితుఁడుగానున్ను బ్రహ్మస్వరూపుఁడుగానున్ను అగుచున్నాఁడు.

శ్లో॥ తత్వస్వరూపానుభవా దుత్పన్నం జ్ఞానమఞ్జసా ।
అహంమమేతి చాజ్ఞానం బాధతే దిగ్భ్రమాదివత్ ॥ ౨౬

తా॥ లోకమందు అంధకారములో తగులుకొని తూర్పు, దక్షిణము, పడమరయని తెలియక దిగ్భ్రమను బొందినవానికి సూర్య దర్శనమువలన ఆదిగ్భ్రమవదలినట్లు జీవుఁడే బ్రహ్మము బ్రహ్మవ్యతిరిక్త మెంతమాత్రమున్ను కాడనే అభేదరూపమైన యథార్థానుభవము వల్ల కలిగినజ్ఞానము కర్తృత్వాదులవల్ల వృద్ధిబొందియున్న అజ్ఞానమును బొత్తిగా పోఁగొట్టుచున్నదనుట.

శ్లో॥ జ్ఞానాఽజ్ఞానే పదార్థౌ ద్వౌ ఆత్మనో బంధముక్తిదౌ ।
జ్ఞానాన్ముక్తిర్నిబంధోఽన్య దితి వేదాంతడిండిమః ॥ ౩

—వేదాంతడిండిమము.

తా॥ జ్ఞానము అజ్ఞానము అని రెండు పదార్థములు. ఆత్మకు అజ్ఞానము బంధము నొసంగును. జ్ఞానము మోక్షమునొసంగును. జ్ఞానమువలననే మోక్షము కలుగును. ఇతరమువలన బంధమేయని వేదాంతడిండిమము.

మూ॥ నకర్తాఽస్మి నభోక్తాఽస్మి సర్వం శాంతమజం శివం
ఇతి నిశ్చయవానంత రజ్ఞానం తనుతాంనయ॥౭౧

—నిర్వాణప్రకరణము, శిఖిధ్వజోపాఖ్యానం.

మూ॥ అజ్ఞానం శిథిలీభూతమేవం నష్టం విమృశ్య బుధాః
ననాశే నవినోదేతి పూర్వసంస్థాన విచ్యుతిః॥౭౨

మూ॥ తానవం దృశ్యతేయస్య తస్యాఽమరక్రమతః స్వయం
పూర్వసంస్థాన విగమా త్ప్రశి మోప్యుపపద్యతే॥౭౩

తా॥ ఇదియనియు నాదియనియు దోచునట్టి సర్వంబును బ్రహ్మంబేగావున నేను కర్తనుగాను. భోక్తనుగాను. అను నిశ్చయము

గలవాడవై హృద్గతమగు నజ్ఞానమును కృశింపజేయుము. ఈవిధంబున నజ్ఞానము నశించునని పండితులు వచించిరి. అజ్ఞానము నశింపకున్న జగముయొక్క సంస్థానము తొలగిపోనేరదు. దేనికి కార్యము కనబడుచున్నదో దానికి క్రమంబున పూర్వస్థితి తొలగి నాశము సంభవించుచున్నది.

మూ॥ ద్వైతైకత్వ దృశౌ చిత్తం తదేవాఽజ్ఞానముచ్యతే
ఏతయోర్ద్వయోర్లయో దృష్ట్యోః సజ్జ్ఞానం సాపరాగతిః॥౧౧౨

తా॥ భేదదృష్టియు నభేదదృష్టియు నీరెండును జేరి చిత్తము. అదియే యజ్ఞానమని చెప్పబడుచున్నది. ఈ రెండు దృష్టులును లయించుటయే జ్ఞానము. అదియే కైవల్యము నగుచున్నది.

మూ॥ ఏకం వస్తుజగత్సర్వం చిన్మాత్రం వారివాఽంబుధిః
తదేవస్పందతే ధీభి శ్శుద్ధవారీవ వీచిభిః॥౧౧౩

మూ॥ బ్రహ్మచిన్మాత్రమమలం సత్యమిత్యాదినామకం
యద్గీతం తదిదం మూఢాః పశ్యంత్యంగజగత్తయా॥౧౧౪

మూ॥ సర్గచిత్స్పందమాత్రాత్మా సమ్యగ్దృష్టో విలీయతే
ఉదేత్య సమ్యగ్దృష్ట్యాతు రజ్జ్వాం సర్పభ్రమోయథా॥౧౧౫

తా॥ జలముమాత్రమే సముద్రమగునట్లు చిత్తుమాత్రమే సమస్తమగు జగంబగుచున్నది. శుద్ధజలంబు తరంగములచే చలించునటుల నాచిన్మాత్రంబే చిత్తవృత్తులచే చలించుచున్నది. చిన్మాత్రంబును నమలంబును సత్యంబునగు నేబ్రహ్మంబుగలదో దానినే మూర్ఖులు జగంబుగా గాంచుచున్నారు. చిత్తుయొక్క విక్షేపమాత్రంబగు నీసర్గంబధిష్ఠాన స్వరూపంబు నెఱుంగగా విలయమొందుచున్నది. అధిష్ఠాన స్వరూపజ్ఞానము లేకుండునెడ నది రజ్జువునందు సర్పభ్రమంబువలె గలుగుచున్నది.

శ్లో॥ యదా భూతపృథగ్భావ మేకస్థ మనుపశ్యతి।
తతఏవచ విస్తారం బ్రహ్మసంపద్యతే తదా॥ ౩౧॥

—శ్రీభగవద్గీతా॥ 13 అధ్యా.

శ్లో॥ తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥
భగవద్గీతా॥ ౧౦ అ. ౧౧ శ్లో.

తా॥ అట్టివారికి మాత్రిమే నేను దయచేసి నాసర్వవ్యాపకమైన జ్ఞానప్రికాశముచేత వారల ప్రికృతిసంబంధమైన యవివేకమనెడి యంధకారమును నశింపజేయుచున్నాను.

శ్లో॥ ప్రికృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రికృతిసంభవాః॥ ౧౩-౨౦॥.

తా॥ ప్రికృతిపురుషులిద్దరు ననాదులని తెలిసికొమ్ము మనోబుద్ధులకుఁ గలుగు వికారములును సత్త్వరజస్తమోగుణములును మూల ప్రికృతివల్లఁ గలిగినవిగాఁ దెలిసికొమ్ము.

మూ॥ విపా్రిఽపర్యవసానేయం మాయాసంసృతినామికా।
ఆత్మచింతనమైలేయం క్షయమాయాతినాన్యథా ॥౮౮॥
—జ్ఞానవాశిష్ఠము, గాధివృత్తాంతం.

తా॥ సంసారంబనుపేరుగల యీమాయ అంతములేనిది. ఇయ్యది ఆత్మభావనచేతనే క్షయమొందుగాని యింకొకవిధమున నశింపనేరదు.

### ౩౬ "ముక్తి" పునరావృత్తిరహితము.

జ్ఞానముచే ప్రిస్తుతమందీయజ్ఞానము నశించినను యిదితిరిగి కలుగకూడదాయనిన అట్లు కలుగనేరదు. ఏది నశించుచున్నదో అది తిరిగికలుగదు. ఎట్లన యొకనికితండ్రి యీక్షణమున చనిపోయినాడు. ఇక నెప్పటికిని కలుగుటకు వీలులేదు. పితురభావమునకు యీక్షణమే ఆదియైయున్నది. కాని నీయభావమున కంతములేదు. అనగా అనంతముగా లేకపోవుచున్నాడు. ఇది నాది అనంతము. ఇటులనే ఆత్మజ్ఞానము కలిగినవెంటనే అజ్ఞానమనంతముగా అభావమును బొందుచున్నది. కనుక తిరిగికలుగుటకు వీలులేదు. నాశనమునకు నాశనమెప్పు

డనుకలుగదు. నాశనమునకు నాశముగలుగుటయన నశింపకుండుట యని యర్థము. ఏది తిరిగికలుగునో యది మొదట నశింపలేదనియే చెప్పవలయును. కాని నశించినది తిరిగిరాదు. జ్ఞానముకలిగినవెంటనే అజ్ఞానము నశించుట యనుభవసిద్ధము. ఇందువిషయమై సందేహించువారెవరును నుండరు. నశించిన అజ్ఞానమునకు పునరావృత్తిని జెప్పుట యన అజ్ఞాననాశనమునకు నాశముజెప్పుటయగు. అనగానశింపకుండుటయని యర్థము. మొదలునశింపలేదనియే జెప్పవలయునుగాని నశించినది తిరిగివచ్చినదని చెప్పకూడదు. అనుభవమందు నశించుచున్నది. కనుక అజ్ఞానమునకు శాశ్వతమైన నాశనమునే జెప్పవలయునుగాని పునరావృత్తిని జెప్పకూడదు.

శ్రుతి॥ అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపఞ్చోపశమశ్శివోఽద్వైత ఏవ మోఙ్కార ఆత్మైవ సంవిశత్యాత్మ నాత్మానం యఏవం వేదయఏవంవేద॥ మాండూక్యం ౭ ఖండము ౧ మాత్రము.

తా॥ అకారఉకారమకారములనెడి మాత్రలులేని ఓంకారము వాక్కుచే వ్యవహరించుటకు నలవిగానిదియును, జాగ్రదాది ప్రపంచనాశనము గలదియును, పరిశుద్ధమైనదియును, అద్వయస్వరూపమైనదియు, నైనపూర్వము చెప్పియుండెడి ఆత్మయొక్క చతుర్థపాదాత్మకమగు నాత్మగానే యున్నయది. ఇట్లు ఆత్మస్వరూపమగు అకారాది మాత్రారహితమైన ఓంకారము తన స్వరూపముతో పారమార్థిక ఆత్మస్వరూపమును బొందుచున్నది. ఇట్లు ఓంకారమును తెలిసికొని పొందబడిన ఓంకారసాధనముగలిగి సన్మార్గమును పొందినవారై ఓంకారముయొక్క అకారాదిమాత్రలకును ఆత్మయొక్క విశ్వాదిపాదములకును ఏర్పడిన సమానతను తెలిసికొనిన, మంద మధ్యమ బుద్ధులు గలవారలకు ఇట్లుపాసింపబడిన ఓంకారము, బ్రహ్మమును పొందుటకు ఆలంబనమగుచున్నది. ఇట్లు ఓంకారమును తెలిసికొని యుపాసించువాడు తిరిగిపుట్టడు.

శ్రుతి॥ యస్తు విజ్ఞాన వాన్భవతి సమనస్కస్సదాశుచిః। సతుతత్పద మాప్నోతి యస్మాద్భూయోనజాయతే॥ కఠోపనిషత్ ॥ ౩-౮.

తా॥ ఎవడైతే జ్ఞానముగలవాడుగాను, యుక్తమనస్సుగల వాడుగాను, ఎల్లప్పుడు పరిశుద్ధుడుగాను అగుచున్నాడో వాడు ఏస్థానమునుపొంది తిరిగి పుట్టడో ఆస్థానమును పొందుచున్నాడు.

శ్రుతి॥ ............అత్రాంతరం బ్రహ్మ విదోవిదిత్వా లీనా బ్రహ్మణి తత్పరాయోని ముక్తాః॥ —శ్వేతాశ్వతరం ౧-౭.

తా॥ బ్రహ్మవిదులు ప్రపంచమందు సర్వశేషిగానుండు పరబ్రహ్మమును తెలిసికొని బ్రహ్మమునందు లయమునుపొందినవారలై బ్రహ్మమందు దాసక్తిగలవారలై యోనియంత్రమును (అనగా జనన మరణ ప్రవాహమును) విడిచినవారలు అగుచున్నారు.

శ్లో॥ తద్బుద్ధ యస్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛంత్య పునరావృత్తిం జ్ఞాన నిర్ధూతకల్మషాః॥ ౫-౧౭.
—శ్రీభగవద్గీత.

తా॥ జ్ఞానముచే పాపమునెల్ల నశింపజేసినవారా బ్రహ్మమందే బుద్ధిగలిగియు పరబ్రహ్మమే యాత్మస్వరూపముగా నెంచి దానియందే యభినివేశము గలిగి పునరావృత్తి రహితమైన మోక్షము నందుచున్నారు.

శ్లో॥ ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావృత్తినోఽర్జున।
మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే॥ ౮-౧౬.

తా॥ ఓకౌంతేయా! బ్రహ్మాండమునకు లోబడిన యావల్లోకములును జీవులకు మరల జన్మముల నియ్యగల స్వభావముగలవి. నన్నుఁ బొందినపిదప యున్ననో పునర్జన్మములులేవు.

శ్లో॥ ఇదంజ్ఞాన ముపాశ్రిత్య మమసాధర్మ్య మాగతాః।
సర్గేఽపి నోపజాయంతే ప్రళయేన వ్యథంతిచ॥ ౧౪-౨.

తా॥ ఈ జ్ఞానమును జెంది నాస్వరూపమును పొందినవారై బ్రహ్మసృష్టి కాలములలోగూడ జన్మములు పొందరు. బ్రహ్మప్రళయకాలములలోను దుఃఖమును జెందరు.

శ్లో॥ గుణా నే తానతీత్యత్రీన్ దేహీ దేహ సముద్భవాన్ ।
జన్మమృత్యు జరాదుఃఖై ర్విముక్తోఽమృతమశ్నుతే ॥ ౧౪-౨౦

తా॥ ఎవడు దేహోత్పత్తికి కారణములైనయీమూడు గుణములను దాటిపోవుచున్నాడో వాడు జన్మమృత్యు జరాదుఃఖములచే విడువబడినవాడై మోక్షమును బొందుచున్నాడు.

శ్లో॥ నతద్భాసయతే సూర్యో । నశశాంకో న పావకః ।
యద్గత్వా ననివర్తంతే । తద్ధామ పరమంమమ ॥ ౧౫-౬.

తా॥ అలాటి యవ్యయపదమును సూర్యుడుగాని చంద్రుడుగాని యగ్నిహోత్రుడుగాని ప్రకాశింపఁజేయ జాలరు. ఏపదమును జెందినవెనుకఁ బునర్జన్మములు లేవో యట్టి పరమోత్కృష్టమైన పదమే నాస్థానమని తెలియుము.

శ్లో॥ కర్మిణో వినివర్తన్తే । నివర్తన్త ఉపాసకాః
జ్ఞానినో ననివర్తన్తే । ఇతి వేదాన్తడిండిమః॥ ౨౦

—వేదాంతడిండిమం.

తా॥ కర్మముచేసినవారు మరలివచ్చుచున్నారు. ఉపాసకులును మరలివచ్చుచున్నారు. జ్ఞానులు మరలిరారు. అని వేదాంతడిండిమము.

తే॥ పరమవిజ్ఞానమును బొందఁ ♦ బ్రాణమయ శ
రీరము నశింప నస్థూశ♦రీర మొందఁ
డామహాత్ముఁడు దగ్ధబీ ♦ జాంకురస్త
మైన యంకురమునుబోలి ♦ యవనియందు॥

వ॥ జ్ఞాని సర్వసంసారావిజ్ఞశారీరమానసుండై ప్రకృతిస్థుండై స్వజ్ఞానబలంబునఁ జతుర్దశభువనంబులంగూడ నెఱుఁగక ముక్తుడగు.

—బ్రహ్మాండపురాణము, ఉపసంహారపాదము, ప్రథమాశ్వా॥ 279-280

సీ॥ మఱియు నహంకార ♦ మమకారశూన్యులై
యుద్ధివర్తించుచు ♦ నర్చిరాది

మార్గగతుండును ♦ మహనీయచరితుండు
విశ్వతోముఖుండును ♦ విమలయశుడు
జగదుద్భవస్థాన ♦ సంహారకారణుం
డవ్యయుం డజుఁడుఁ బ ♦ రాపరుండుఁ
బురుషోత్తముఁడు నవ ♦ పుండరీకాక్షుండు
నైన సర్వేశ్వరు ♦ నందుఁబొంది

తే॥ మానితా పునరావృత్తి ♦ మార్గమయిన
ప్రవిమలానంద తేజోవి ♦ రాజమాన
దివ్యపదమున సుఖయించు ♦ ధీరమతులు
మరలిరా రెన్నటికిని జ ♦ న్మములబొంద॥ ౧౧౭

—భాగవతము, 3 స్కంధము.

క॥ విను సర్వభావములఁ బర
ముని ననఘు ననంతు నీశుఁ ♦ బురుషోత్తము ని
న్ననయము భజియింపుము ముద
మునఁ బునరావృత్తిలేని ♦ ముక్తిలభించుఁ॥౧౧౮

—భాగ. 3స్కం.

32 జ్ఞానాజ్ఞానములు రెండును నేకకాలమందుండున.

జ్ఞానముసామాన్యమని విశేషమని రెండు విధములు. సర్వదేశములందును సర్వకాలములందును దోచుచుండునది సామాన్యమనబడును. ఒకప్రదేశమందు కొలదికాలము మాత్రముండునది విశేషమనబడును. ఇందు సామాన్యజ్ఞాన మజ్ఞానమునకు విరోధముగా లేదు. విశేషజ్ఞానమే అజ్ఞానమునకు విరోధమగును. ఎట్లన దారువునందుండునది సామాన్యాగ్ని. ఇది దారువును దహించుచుండుటలేదు. రెండుదారువులను మథించుటవలన గలుగునది విశేషాగ్ని. ఇదిదారువులనేగాక సర్వమును దహించును. సామాన్యాగ్ని దారువునకు విరోధముగాలేదు. విశేషాగ్ని దారువును నశింపజేయుచున్నది. అటులనే ఆత్మయందుండెడి

జ్ఞానము సామాన్యము. ఆత్మానాత్మవిచారణవలన నుదయించు నది విశేషజ్ఞానము. సామాన్య జ్ఞానము అజ్ఞానమునకు విరోధముగాలేదు. విశేషజ్ఞానము అజ్ఞానమునకు విరోధముగానుండి దానిని నశింప జేయుచున్నది.

ఆత్మజ్ఞానస్వరూపుడైనను ఆత్మయం దజ్ఞానముండుటకు వీలుగలదు. సుషుప్తియం దీయనుభవమును మనము బొందుచున్నాము. ప్రతివాడును సుషుప్తియందు తాను సుఖముగా నుంటిననియు తన కేమియు తెలియలేదనియు జెప్పుచున్నాడు. సుషుప్తియందు బుద్ధీంద్రియములు లీనమగుటవలన అవి ప్రకాశించుటలేదు. అట్లుగాక సుషుప్తియందు బుద్ధిగాని యింద్రియములుగాని యున్నవని చెప్పునెడల జాగ్రత్తలోవలెనే త్రిపుటి (అనగా జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయము) బ్రకాశించుచుండవలెను. అట్లు బ్రకాశించుట లేదు. సుషుప్తియందు ఆత్మజ్ఞాన స్వరూపుడుగా ప్రకాశించుచుండినను నేమియు తెలియకుండు అజ్ఞానమునకు విరోధముగాలేదు. కనుక సుషుప్తియం దాత్మను అజ్ఞానమావరించుకొని యున్నది. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అనగాఅజ్ఞానముచేత జ్ఞానమావరింపబడి యున్నది. ఆయజ్ఞానముచేతనే పురుషులు మోహమును బొందుచున్నారు. అని భగవద్గీతా వాక్యము బోధించుచున్నది. మథింపబడిన దారువునందు గలిగిన అగ్ని దారువునుదహించు చందంబున వేదాంతశ్రవణంబున నుదయించిన విశేషజ్ఞానము ఆత్మనావరించుకొని యుండిన యజ్ఞానమును నశింపజేయును.

## ౩౮ జ్ఞానికి దేహపాతమువరకు భ్రిమలేని వ్యవహారముండును.

అధిష్ఠాన రజ్జు జ్ఞానమువలన పాము బోయినప్పటికిని భ్రమకాలమున దోచిన పామువలన గలిగిన భయముచే బరుగిడ గోడ మొదలగు వానివలన నెదురు దెబ్బ తగిలి కలిగినపుండు పోవుచుండుటలేదు. కొంతకాలమునకు మానుచున్నది. భ్రమ సర్పమువలన గలిగిన భయముచే గుండెలు కొట్టుకొనుట మొదలగునవి కొంత సేపటికి క్రమముగా

నాగినట్టులను నాత్మ జ్ఞానమువలన జగము సత్యమనెడి భ్రమ నశించి ముందు గల్గుగబోవు జగత్సంస్కారము నశించునుగాని వెనుకటి భ్రమ వలన గలిగిన జగమును దేహేంద్రియములును గొంత కాలమువరకు నుండును. ఆత్మ జ్ఞానమువలన జగత్సంస్కార మెపుడు నశించునో అపుడు కామక్రోధాదులు నశించి చిత్తము సత్త్వగుణ సంబంధము లైన దయాసత్యాది సద్వృత్తులతో గూడి ప్రకాశించును. జగము సత్యమనుటవలన గలిగిన తృష్ణ నశించి చిత్తోపశమము గలుగును. ఇట్టి ఆత్మజ్ఞాని లోకమందు వ్యవహరించుచుండినను లోకమువలన వానికే మియు బాధగలుగదు. అతనివలన జగమునకును భయములేదు. లోకు లవలన తనకు కలిగెడి అపకారోపకారములు తన స్వరూపముగానెంచి యనుభవించునేగాని ప్రతీకారబుద్ధిని గలిగి యుండడు. తన నాలుకను తాను గరచుకొని యెవరిమీద కోపపడవలయును? తన యవయవము లలో నొకదానివలన నొకదానికి గలిగెడి బాధను సహించి యనుభ వించునేగాని అవయవమునందు ప్రతీకారబుద్ధి యెటులలేదో అటులనే లోకమునుండి కలిగెడి సుఖదుఃఖముల ననుభవించునేగాని ప్రతీకారబు ద్ధిని గలిగియుండడు. అతని చిత్తము సర్వసమత్వమును బొందియుం డును. సమదృష్టియే యాతని జీవనము. ఇట్టివాడే జీవన్ముక్తుడు. శరీర పాతానంతరము విదేహముక్తుండగును.

మూ॥ ఆత్మానమితరంచైవ దృశానిత్యా విభిన్నయా।
సర్వం చిజ్జ్యోతిరేవేతి యః పశ్యతి సపశ్యతి ॥౧౦॥.

—స్థితిప్రకరణం దామాద్యుపాఖ్యానం.

సర్వశక్తిరనంతాత్మా సర్వభావాంతర స్థితః।
అద్వితీయ శ్చిదిత్యంత ర్యఃపశ్యతి సపశ్యతి ॥౧౧॥.

తా॥ తన్నునితరుని భేదరహితమగు దృష్టిచే చూచువాడును, జగంబును చిన్మాత్రంబుగా గాంచువాడును, ఆత్మను సర్వశక్తిము తునిగాను, అపరిచ్ఛిన్నునిగాను ద్వితీయవస్తురహితునిగాను చిన్మా త్రునిగాను లోనజూచువాడు ఆత్మను చూచుచున్నాడు.

మూ॥ నాఽహం నచాఽన్యదస్తీతి బ్రహ్మైవాఽస్తి నిరామయం।
ఇత్థం సదసతోర్మధ్యం యః పశ్యతి సపశ్యతి ॥౧౨॥

తా॥ అహంకారవిశిష్టవస్తువుగాని దృశ్యంబుగాని లేదు. మరి నిర్వికారంబగు బ్రహ్మంబేగలదు. అని యిట్లు ఆత్మానాత్మల యొక్క నడుమను చిన్మాత్రస్వరూపమును జూచువాడు ఆత్మను చూచుచున్నాడు.

మూ॥ అయత్నోపనతేష్వక్షి దృగ్ద్రవ్యేషు యథాపునః।
అరాగమేవ పతతి తద్వత్కార్యేషు ధీరధీః ॥౧౩॥

తా॥ కన్ను లయత్నసిద్ధములుగా సమీపముననున్న వస్తువులయందు అనురాగంబులేకయే పడునట్లు ఆత్మవిదుని చిత్తము కార్యములయందు రాగదోషరహితంబుగనే ప్రవర్తించుచున్నది.

మూ॥ పరిజ్ఞాయోప భుక్తోహి భోగో భవతి తుష్టయే।
విజ్ఞాయసే వితశ్చోరో మైత్రీ మేతి నశత్రుతాం ॥౧౪॥

తా॥ తెలిసి సేవింపబడునట్టి చోరుడు బాధకుడుగాక మైత్రినేపొందునట్లు తెలిసి సేవింపబడునట్టి భోగంబును ఆత్మజ్ఞులకు సంతోషకరంబే యగును.

మూ॥ అశంకితోపసంప్రాప్తా గ్రామయాత్రా యథాఽధ్వగైః।
ప్రేక్ష్యతే తద్వదేవజ్ఞై ర్భోగ శ్రీరవలోక్యతే ॥౧౫॥

తా॥ బాటసారులు తలంపులేక సంప్రాప్తమైన మహాత్సవాదులగాంచినట్లు ఆత్మవిదులు భోగజాలమును గాంచుచున్నారు.

మూ॥ నత్యజంతి నవాంఛంతి వ్యవహారం జగద్భవం।
సర్వమేవానువర్తంతే పారావారవిదో జనాః ॥౧౬॥

—దాశూరాఖ్యానం.

తా॥ తత్త్వజ్ఞానసంపన్నులగు జనులు జగత్సంబంధమగు వ్యవహారమును విడువకయు గోరకయు సర్వంబును యథాప్రాప్తంబుగ ననువర్తించుచుందురు.

మూ॥ సమాధిమథకర్మాణి మాకరోతు కరోతువా।
హృదయేనాఽస్త సర్వాస్థో ముక్త ఏవోత్తమాశయః॥౨౭
—ఉపదేశోపాఖ్యానం.

మూ॥ నైష్కర్మ్యేణ నతస్యార్థో నతస్యార్థోఽస్తికర్మభిః
నసమాధిజపాభ్యాంవా యస్యనిర్వాసనం మనః॥౨౮

తా॥ హృదయంబున సమస్తకోరికలను విడిచిపెట్టిన మహానుభావుండు సమాధినిష్ఠనుగాని లేక కర్మంబులనుగాని చేసిన చేయుగాక. లేకున్న విడుచుగాక. అతడే ముక్తుండని చెప్పబడును.

ఎవ్వనియొక్క మనస్సు వాసనారహితంబగునో, వానికి కర్మరాహిత్యముతోగాని, కర్మములతోగాని, సమాధితోగాని, జపముతోగాని ప్రయోజనములేదు.

3. ఆత్మజ్ఞానియొక్క వ్యవహారము ధర్మబద్ధమై యుండును.

మనచుట్టును ఆకాశమువ్రాలి భూమికంటినటులుండుట మిధ్యయను జ్ఞానమును బొందినప్పటికిని ఆకాశము వ్రాలియున్నటు లగపడుచునే యుండునట్లు జగముమిధ్యయను జ్ఞానమును బొందినప్పటికిని వ్యవహారమందు జగముండును. కనుక దేహపాతమువరకు నీవు, నేను, పుణ్యము, పాపము, మంచి, చెడు, పురుషుడు, స్త్రీయనెడి భేదబుద్ధివిడుచుట ధర్మముకాదు. ఎండమావులయందు జలములేదని తెలిసికొను వివేకికి నీరున్నటు లగపడుచుండినను నీటికొరకు పరుగిడెడియాయాసమెటుల లేదో అటులనే జ్ఞానికిని జగమునందు ద్వైతము దోచుచుండినను నాసక్తితోగూడిన వ్యవహార మాతనికిఁగలుగదు. లక్ష్యమద్వైతము, లక్షణము ద్వైతము. కనుక జ్ఞాన్యజ్ఞానులకు వ్యవహారదశయందు ద్వైతమే సిద్ధించునుగాని అద్వైత మెన్నటికిని సిద్ధింపదు. కనుక వ్యవహారమునందు సంకరమును గలుగజేయుట జ్ఞాన

లక్షణముకాదు. జ్ఞాన్యజ్ఞానులకు పారమార్థికమునం దనుభవభేదమే గాని వ్యావహారికభేదము లేదు. కాని యీ యుభయులకును వ్యావహారికభావభేదము గలదు. అజ్ఞానికి వ్యవహారము సత్యమనుభావన యుండును. కనుక నాతనిచిత్తము కామలోభాదులకువశమై యుండును. జ్ఞానికి జగమంతయు నాటకరంగముగా దోచుచుండును. కనుక కామలోభాదులకు చిత్తమువశముగాక దయాసత్యాదులతో గూడియుండును. జ్ఞాని శరీరభ్రమలేక లోకోపకారముగా జీవించునుగాని స్వార్థమును స్వప్నమందైనను గోరడు.

వ॥ వినుము స్వరూపసాక్షాత్కారంబున దేహి బహిరింద్రియాదికంబైన యింతయు నాభాసమాత్రంబుగా నిశ్చయించి మొదాక జీవుండు స్వతంత్రుండయిన యీశ్వరుండుగాకుండు నంతదడవు నంగన యిది పురుషుండ నేనని యెడి భేదబుద్ధిమానుట కర్తవ్యంబుగాదు. బ్రహ్మచారి, యతి, గృహస్థులం దెవ్వండైనం జిత్తంబు పరిపక్వంబుగాక యద్వైతానుసంధానముసేసిన మూఢుండగుం గావున రహస్యంబునం బుత్రికనైనం డాయకుండవలయును. —భాగవతము ౭-౪౨౩.

## ౪౦ జ్ఞానసాధనములు.

| | | |
|---|---|---|
| 1 నిత్యానిత్యవస్తువివేకము | | |
| 2 ఇహాముత్రార్థఫలభోగవిరాగము | | వీనికి సాధనచతుష్ట |
| 3 శమాదిషట్కసంపత్తి | } | యమని పేరు. |
| 4 ముముక్షుత్వము | | |

ఇందు 1 నిత్యానిత్యవస్తువివేకమనగా:—

ఏది నిత్యమో యేది యనిత్యమో విచారించి తెలిసికొను వివేకము.

2 ఇహాముత్రార్థఫలభోగవిరాగమనగా:—

ఇహమునందును పరమగు స్వర్గాదిలోకములందును సుఖించవలయుననెడి ఆశనువిడిచి విరక్తిని బొందుట.

3 శమాదిషట్కసంపత్తి:—

ఇం దారుగుణములు గూడియున్నవి.

1 శమము:— అనగా మనస్సును విషయభోగములనుండి మరలించి యెల్లప్పుడును ఆత్మవిచారణయందు నిలుపుట.

2 దమము:— ఇంద్రియములను వానివాని వృత్తులనుండి మరలించి స్వవశము చేసికొనుట.

3 ఉపరతి:— ఆత్మవిచారణకంటె నన్యమగు సర్వవిషయములను పరిత్యాగము చేయుట.

4 తితిక్ష:— సుఖదుఃఖాది ద్వంద్వములయందు రాగద్వేషములను బొందక యోర్చుకొనియుండుట.

5 శ్రద్ధ:— సద్గురువులయొద్ద సదుపదేశములను బొందుచు వాని యనుష్ఠానమం దప్రమత్తుడై యుండెడి మనోనిశ్చయము.

6 సమాధానము:— గురువులును వేదశాస్త్రములును చేయుబోధ యందు ప్రతిహాంశమును తాను శ్రద్ధతో గృషిచేసి తన యనుభవములోనికి దెచ్చుకొనువరకు పైవాక్యములను సందేహింపక వాటిని సత్యముగా నమ్మియుండుట.

7 ముముక్షుత్వము:—మోక్షమును బొందవలయుననెడి తీవ్రేచ్ఛ.

ఈ పైచతుస్సాధనములను బొంది సద్గురువు నాశ్రయించి తాను జీవన్ముక్తావస్థను బొందువరకు వారిబోధలను సదా శ్రవణముచేయుచుండవలయును. అట్లు శ్రవణముచేయబడిన హాంశములను యుక్తి యుక్తముగా నేకాంతస్థానమందు తాను మననము చేయవలయును. ఇట్లు శ్రవణమననములను నిత్యమును జేయుచుండగా బోధయంతయు మనమునకు గాఢమైన నిధిధ్యాసనము దానంత నదియె లభ్యమగును.

శ్రుతి॥ ఆత్మావాఽరేద్రష్టవ్యః, శ్రోతవ్యః,
మంతవ్యః, నిధిధ్యాసితవ్యః ॥

తా॥ పరమాత్మ దర్శింపదగినది. శ్రవణము జేయదగినది. మననము జేయుదగినది. నిధిధ్యాసనము జేయుదగినది.

ఇందు సాధనచతుష్టయమును బొందుటకు సత్సంగమే మూలాధారము. నిరంతరము సత్పురుషులను సేవించుచు వారిసాంగత్యమున కాలముగడపుచుండగా కాలక్రమమున పైనాలుగుసాధనములును యభ్యాసమగును. పైచతుస్సాధనములును యలవడినవెంటనే వేదాంతశ్రవణంబున తీవ్రేచ్ఛ యుదయించును. ఇందునకు తగిన సద్గురువును సేవింప యావశ్యకమగును. తదనంతరము సద్గురువు నన్వేషించి వారి పాదసేవ జేయుటయం దాసక్తుండగు సద్గురుస్వామి యనుగ్రహంబుచే శ్రవణాదులయందు ప్రవృత్తియు మహావాక్యోపదేశంబును గలుగును. అందువలన తత్వదర్శనంబగు. అనంతరము జీవన్ముక్తుడై శరీరపాతపర్యంతము కర్మమును జేయుచు గాని, నిష్కర్ముడై గాని సర్వభూతప్రియుండై చరించి శరీరపతనానంతరము పునరావృత్తిరహితమగు శాశ్వతపదవిని బొందు.

## ౪౧ సత్సంగము.

'ఆధ్యాత్మికవిద్యను బొందగోరు ప్రతిమానవుడును మొదలు సత్సంగమునే సంపాదింపవలయును. సత్సంగమును గురించి శ్రీజ్ఞానవాశిష్ఠమునం దిట్లుదాహరింపబడినది.

మూ॥ యస్మిన్దేశేహి తత్త్వజ్ఞో, నాస్తి సజ్జనపాదపః।
నఫలశ్శీతలచ్ఛాయో నతత్ర దివసం వసేత్ ॥

తా॥ ఆత్మ తత్త్వజ్ఞానమను చల్లనికాంతిరూపమగు నీడగలిగిన సత్పురుషుడనుచెట్టు యేదేశమందు లేకుండునో యాదేశమందు ముముక్షువు యొకదివసమైనను వసింపదగదు.

మూ॥ సదా సంతోషిహి గంతవ్యా! యద్య ప్యుపదిశంతి న!
యాః కాస్స్వైరకథాస్తేషా ముపదేశా భవంతితాః॥

తా॥ సత్పురుషులు తనకు చక్కని యుపదేశమియ్యక పోయినను వారిని యెల్లపుడు నాశ్రయించదగినదేగాని మానదగినది కాదు. ఏమనగా వారు సర్వదా బ్రహ్మవిషయములగు కథలనే పలుకుచుందురు. కావున నవియే శ్రద్ధావంతునకు నుపదేశములై బ్రహ్మజ్ఞానమును గలిగించుచున్నవి.

మూ॥ మోక్షద్వారే ద్వారపాలా శ్చత్వారః పరికీర్తితాః!
శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధుసంగమః॥౮౬॥
—ముముక్షు వ్యవహారప్రకరణము.

తా॥ మోక్షముయొక్క వాకిటియందు నల్వురు ద్వారపాలకులు గలరు. అందు ఇంద్రియనిగ్రహము మొదటిదియు, బ్రహ్మవిచారము రెండవదియు, ఎపుడును సంతోషము మూడవదియు, సజ్జనసాంగత్యము నాల్గవదియు నగును.

మూ॥ ఏతే సేవ్యాః ప్రయత్నేన చత్వారో ద్వౌ త్రయోఽథవా।
ద్వారముద్ఘాటయంత్యేతే మోక్షే రాజగృహే యథా ॥౮౭॥

తా॥ ఈనాల్గిటిగాని, ఇందు మూడిటిగాని లేక రెండిటిగాని ప్రయత్నపడి సేవించవలయును. ఇట్లు సేవించెనేని యివ్వి రాజగృహమందు ద్వారమునుపోలె మోక్షద్వారమును తెఱువగలవు.

మూ॥ ఏకంవా సర్వయత్నేన సర్వముత్సృజ్య సంశ్రయేత్।
ఏకస్మిన్ వశగే యాంతి చత్వారోఽపి వశంయతః॥ ౮౮.

తా॥ ఇందొకటి స్వాధీనమగునెడల నాలుగును స్వాధీనములు కాగలవు. కాన అంతటిని విడిచి యొకదానినైనను సర్వప్రయత్నములచేతను నాశ్రయింపవలెను.

మూ॥ శాస్త్రైస్సజ్జనసంసర్గ పూర్వైస్సతపోదమైః
ఆదౌ సంసారముక్త్యర్థం ప్రజ్ఞామేవాఽభివర్ధయేత్॥ ౪౯.

తా॥ సంసారము విడిపోవుటకై మొదలు శాస్త్రములచేతను, సత్సాంగత్యముచేతను, తపముచేతను, ఇంద్రియ నిగ్రహముచేతను బుద్ధినే పెంపు సేయవలయును.

మూ॥ విశేషేణ మహాబాహో సంసారోత్తరణే నృణాం।
సర్వత్రోపకరోతీహ సాధుస్సాధుసమాగమః॥ ౫౦.

తా॥ నిడుపులగు చేతులుగల శ్రీరామచంద్రా! శ్రేష్ఠమగు సజ్జనసాంగత్యము సంసారమునుండి తరించువిషయమై మనుజులకు అంతటను ఉపయోగపడుచున్నది.

మూ॥ శూన్యమాకీర్ణతామేతి మృత్యురప్యుత్సవాయతే।
ఆపత్సంపదివాభాతి విద్వజ్జనసమాగమే॥ ౫౧.

తా॥ పండితుల సమాగమము కలిగెనేని ఎవరును లేని చోటును పలువురు కలదిపోలె నుండును. మరణసమయంబును సంతసము గలిగించునదిపోలె నుండును. ఆపదయు సంపదను బోలియుండును.

మూ॥ యస్స్నాతశీతశితయా సాధుసంగమగంగయా।
కింతస్య దానైః కింతీర్థైః కింతపోభిః కిమధ్వరైః॥ ౫౨.

తా॥ చల్లనైనట్టియు శుద్ధమైనట్టి సజ్జనసాంగత్యమును గంగానదీజలముచేత స్నానముచేసినవానికి దానములతో నేమిప్రయోజనము. తీర్థములతో నేమిప్రయోజనము. తపములతో నేమిప్రయోజనము. యజ్ఞములతో నేమిప్రయోజనము. వేటితోడను ఎట్టిప్రయోజనంబును లేదనుట.

మూ॥ విచ్ఛిన్నగ్రంథయస్తజ్ఞా స్సాధవస్సర్వసమ్మతాః।
సర్వోపాయేన సంసేవ్యాస్తే హ్యుపాయా భవాంబుధౌ॥ ౫౩॥

తా॥ విడిపోయిన యహంకారగ్రంథిగలవారును, ఆత్మతత్త్వము నెఱింగినవారును, అందఱకు నిష్టులునగు సాధుజనులను అన్నివిధములగు నుపాయములచేతను సేవింపవలయును. ఈచెప్పబడిన శాంతి మొదలగు నాల్గును సంసారసముద్రమును దాటుటకు నుపాయములగును.

మూ॥ ఆబాల్యా దలమభ్యస్తై శ్శాస్త్ర సత్సంగమాదిభిః।
గుణైః పురుషయత్నేన స్వార్థస్సంప్రాప్యతే హితః॥

తా॥ బాల్యమునుండియు అభ్యసింపబడునట్టి శాస్త్రము, సత్సాంగత్యము మొదలగు గుణములతో చాలును. పురుషప్రయత్నముచేత యిష్టమగు పురుషార్థమును పొందనగును.

మూ॥ సాధుసంగమ సచ్ఛాస్త్ర పరోభవసి రామచేత్।
తద్దినై రేవ నోమాసైః ప్రాప్నోషి మాం పరాంధియం॥

తా॥ శ్రీరామచంద్రా! నీవు బ్రహ్మవిదులసాంగత్యము వేదాంతశాస్త్రముయొక్క యభ్యాసము కలిగియుండితివేని నెలలతో డను పనిలేక కొన్నిదినములలోనే యుత్కృష్టమగు నీజ్ఞానమును బొందగలవు.

మూ॥ అపి జీవితదానేన గుణినం పరిపాలయేత్।
గుణవత్సంగమౌషధ్యా। మృత్యురప్యేతి మిత్రతాం॥

తా॥ ప్రాణములనిచ్చియైనను గుణవంతుని కాపాడవలయును. గుణవంతుల సాంగత్యమను నౌషధముచే మృత్యువైనను మైత్రిని బొందగలదు.

మూ॥ మృతిర్గుణే తిరస్కారో జీవితం గుణిసంశ్రయః।
ఫలం స్వర్గాపవర్గాది జీవితా ద్గుణి సంశ్రయాత్॥

తా॥ గుణవంతుల తిరస్కరించుటయే మరణమగును. గుణవంతుల నాశ్రయించుటయే జీవితమగును. జీవితమగునట్టి గుణవంతుని యాశ్రయమువలననే భోగము, మోక్షము మొదలగు ఫలంబులును గలుగును.

మూ॥ సాధూనాం సమదృష్టీనాం పరిప్రశ్నేన సేవయా।
సంగమేనచ సాయుక్తి ర్లభ్యతే ముచ్యతే యయా॥

తా॥ ఏయుపాయముచే ముక్తినొందనగునో అట్టియుపాయమును సజ్జనులసాంగత్యముచేతను, వారినడుగుటచేతను, వారిని సేవించుటచేతను లభించుచున్నది.

చ॥ అరయ ధరిత్రినెవ్వని గృ♦హంబు మహార్హ్యజనోపయోగ్య వి
స్ఫురితతృణాంబుభృత్యగృహ♦భూముల సారెఁదనర్చు నట్టి మం
దిరపతి పేదయైన జగ ♦ తింగడు ధన్యుఁడటండ్రుగాన సు
స్థిరమతి మీరువచ్చుట న ♦ శేషశుభంబుల నేనుబొందెదన్॥
—శ్రీమద్భాగవతము ౪-౬౦౮.

చ॥ వరమతులార! యెవ్వని ని♦వాసముఁ దీర్థపదాంతరంగులై
పరఁగినయట్టి భాగవత ♦ పాదజలంబులు సోఁకవేనిఁ ద
త్పురుషుఁడు భూరిసంపదలఁ ♦ బొంపిరిపోయిననైన వానిమం
దిర మురగప్రకీర్ణజగ ♦ తీజముఁ బోలునటండ్రు కోవిదుల్॥ ౬౧౦

తే॥ ధరణి సజ్జనసంగంబు ♦ దలఁప నుభయ
సమ్మతంబగు వారలు ♦ సలుపునట్టి
సరససంభాషణప్రశ్న ♦ సరణి నిఖిల
జనములకు సుఖకరమగు ♦ జనవరేణ్య॥ ౬౦౫

క॥ ధరసాధులు విమలాంతః
కరణులు భగవద్గుణాను ♦ కథనశ్రవణ

స్ఫురితస్వాంతులు ననఘులు
వరధిషణులునైన భాగ • వతజనులసభన్॥ ౮౬౭

క॥ సరసోదారమహాత్మ ము
ఖరితములగు మధువిరోధి • కమనీయగుణో
త్కర సురుచిరచరితామృత
పరిపూరిత వాహినులను • బరమప్రీతిన్॥ ౮౬౮

క॥ మనమలరఁగ శ్రోత్రాంజలు
లను బానముసేయు పుణ్యు • లకు క్షుత్తృష్ణా
ఘనభయశోక విమోహము
లనయంబును సోకకుండు • నవనీనాథా॥ ౮౭౦ ॥

వ॥ కావున నిట్టి భాగవతసమావాసంబులేకయున్నఁ దనంతన భగవద్భాగవత గుణాభివర్ణనకథానుచింతనాదులయందుం బవర్తించిన నాలస్యాదిదోషంబులొంది యీ జీవలోకంబు సహజ క్షుధాధికంబున నుపద్రుతంబై సర్వేశ్వరకథామృతవాహినియందు రతింజేయదిది నిశ్చితంబు॥ ౮౭౧

చ॥ హరి భవదీయమాయ నన • యంబును జెందిన నేము నిచ్చలుం
గరమనురక్తి నేటితుద • గా భవకర్మములమై ధరిత్రిపైఁ
దిరుగుదు మంతదాఁక భవ • దీయజనంబులతోడి సంగతిన్
గురుగతి జన్మజన్మముల • గూరుసమకూరఁగఁజేయు మాధవా॥
[౯౨౮॥

మ॥ కమలాధీశ్వర తావకీనపదభ • క్తవ్రాతసంసర్గలే
శముతోడన్ సరిగాఁ దలంప మెలమిన్ • స్వర్గాపవర్గాది సౌ
ఖ్యములన్నన్ వినుమానుషంబులగు నీ • కామంబులన్ జెప్పనే
ల మునిప్రస్తుతపాదపద్మ సుజనాళీపానుమోదాత్మకా॥౯౨౯॥

వ॥ మఱియు భగవద్భక్త సంగంబులయందుఁ దృష్టాప్రశమనంబులైన మృష్టకథలు చెప్పబడుటచేత భూతంబులయందు వైరంబును లేకుండునని—౯౩౦.

చ॥ వనముల ముక్తసంగులగు ♦ వారు నుతింపఁ దనర్తువీవు గా
వున నిలఁబుణ్యతీర్థముల ♦ నోప్పఁ బునీతము సేయుబూని యు
ర్థిని బదచారులై ధరఁ జ ♦ రించు భవత్పదభక్త సంగమం
బనుపమభూరిసంసృతి భ ♦ యఘ్నని బుద్ధి రుచింపకుండునే॥౯౩౧॥

వ॥ ..................నాత్మవంతులకు నాత్మయు నాత్మభావనుండు నయిన యీశ్వరుండు భక్తానుగ్రహంబుకొరకు నీలోకంబుల మీవంటి సిద్ధరూపంబున వర్తించుచుండు............౬౧౩.

సీ॥ ధరలోన బ్రహ్మంబుఁ ♦ దపమునదానంబు
లను గృహధర్మంబు ♦ లను జలాగ్ని
సోమసూర్యులచేత ♦ శ్రుతులచేనైనను
బరమభాగవతుల ♦ పాదసేవఁ.

బొందినమాడ్కిని ♦ బొందంగరాదని
పలుకుదురార్యులుఁ ♦ బరమమునులు
ఘనతపోబాహ్యాసా ♦ ఖ్యములకు విముఖులు
నయినట్టిపుణ్యులు ♦ హరిగుణాను

తే॥ మోదితాత్ములునగు బుధ ♦ పాదసేవ
ననుదినంబును జేసిన ♦ నంతమీఁద
మోక్షమార్గంబునకును బ ♦ ద్మాక్షునందు
బట్టువడియుండు నప్పుడుఁ ♦ బరగబుద్ధి ॥౫-౧౬౦॥

చ॥ కొలుతురు మర్త్యులిష్టములు ♦ గోరి శిలామయదేవసంఘముఁ
జలమయ తీర్థసంఘమును ♦ నంతతముస్నటు వారుగొల్వఁగా

వలదనరాదుగాక భగ ♦ వత్పదభక్తులరైన మీరాక్రియర్
సాలయక దేవతీర్థములు ♦ చూచినయంతనె కోర్కులిచ్చునే॥
౧౦ - ౧౧౧౧.

సీ॥ సన్మునీశ్వరులార ♦ జన్మభాగ్యములమైన
మాకు నిచ్చోట స ♦ మ్మతిని దేవ
నికర దుష్ప్రాపులు ♦ నిరుపమయోగీంద్రు
లైన మీ దర్శనం ♦ బబ్బెగాదె
ధృతిమందభాగ్యు లిం ♦ ద్రియపరతంత్రులు
నైన మాధాత్ముల ♦ కనఘులార
భవదీయదర్శన ♦ స్పర్శన చింతన
పాదార్చనలు దుర్ల ♦ భంబులయ్యు

తే॥ నేడుమాకిట సులభమై ♦ నెగడెఁగాదె
జగతిపైఁ దీర్ఘభూతులు ♦ సాధుమతులు
మిమ్ము దర్శించుటయచాలు ♦ నెమ్మితోడ
వేఱ తీర్థంబు లవనిపై ♦ వెదుక నేల॥ ఉత్త. ౧౦. ౧౧౧౯

వ॥ అదియునుంగాక యుగకమలంబులైన తీర్థంబులును, మృచ్ఛిలామయంబులైన దేవగణంబులును, తీర్థదేవతారూపంబులు గాకుండుట లేదయిన నవి చిరకాలసేవనార్చనలంగాని పావనంబులు సేయవు. సత్పురుషులు దర్శనమాత్రంబునం బావనంబు సేయుదురని వెండియు॥ ౧౧_౨౦.

సీ॥ ఆదిత్య చంద్రాగ్ని ♦ మేదినీతారాంబు
మారుతాకాశవా ♦ జ్మనము లోలిఁ
బరికింప దత్తదు ♦ పాసనంబులఁ బునీ
తములు సేయగ సమ ♦ ర్థములుగావు
సకలార్థగోచర ♦ జ్ఞానంబుగల మహా
త్మకులు దారు ముహూర్త ♦ మాత్రసేవఁ

జేసి పావనములు ♦ సేయుదు రజియుఁన
ట్లుండె ధాతుత్రయ ♦ యుక్తమైన

తే॥ కాయమం దాత్మబుద్ధియుఁ ♦ గామినీ కు
మారులందు స్వకీయాభి ♦ మానములును
దివిరిజలమునఁ దీర్థబు ♦ ద్ధియును జేయు
నట్టి మూఢుండు పశుమూర్ఖుఁ ♦ డనఁగఁ బరఁగు॥ ౧౧_౨౧.॥

సీ॥ జగతిపై బహుతీర్థ ♦ సదనంబులనఁగల్గి
బుణ్యానువర్తన ♦ స్ఫురితులగుచు
బాటించి నీయందు ♦ బద్ధమత్సరములు
లేక భక్తామరా ♦ నోకహంబ
వగు భవత్పాదాబ్జ ♦ యుగళంబు సేవించి
భవపాశముల నెల్లఁ ♦ బాఱఁదోలి
సమమతులై యదృ ♦ చ్ఛాలాభతుష్ట మేరు
సమముగాఁ గైకొని ♦ సాధులగుచుఁ

తే॥ బాదతీర్థంబుగల మహా ♦ భాగవతజ
నోత్తమోత్తములైనట్టి ♦ యోగివరుల
వారకెప్పుడు సేవించు ♦ వాఁడుపొందు
బ్రవిమలానందమయ మోక్ష ♦ పదము మఱియు॥ ౧_౨౫

శ్రీమచ్ఛంకరాచార్యస్వాములవారు ముక్తినిబొందుటకు శ్రేష్ఠమగు నుపాయమును లోకమున కనుగ్రహించియున్నారు. అదే దనగా!

"సత్సంగమే"

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం । నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

తా॥ సత్సంగమువలన నిస్సంగతయు (అనగా మనస్సు విషయానురాగమును విడుచుట) నిస్సంగతవలన పతీ సుత సోదర ధనధాన్య వస్తువాహనములయందు మోహము నశించుటయు, నిర్మో

హాతవలన మనోచలన మడిగి ఆత్మయందు నిలుకడను బొందుటయు అట్టి మనోనిశ్చలత్వమున జీవన్ముక్తియుఁ గలుగును.

జీవన్ముక్తిని బొందుటకు లోకమునందు సత్సంగమువంటి యుత్కృష్టసాధన మింకొకటిలేదు. సర్వప్రయత్నములచేతను తన సర్వస్వమును ధారబోసియైనను సత్సంగమును సంపాదింపవలయును. తన జీవితమునందు సత్సంగమునెరుగని మూఢుడు జీవన్మృతుడు. అట్టివాని కిహమందుగాని పరమందుగాని సుఖము కలుగనేరదు. సత్సంగముచే నిత్యము నాత్మవిచారణజేయుచు లోకోపకారముగా జీవితమును గడపు మహాత్మునికి ముక్తి యరచేతనుండును.

## ౪౨ "తపస్సు"

సాధకుడు తన కిష్టమైన దేవతానామమును సదా యుచ్చరించుచుండుటచేత వాగింద్రియము నిగ్రహింపబడును. ఆర్యసాంప్రదాయమంతయు నీ వాగింద్రియనిగ్రహమే సర్వోత్కృష్టసాధనముగా గైకొనినది. అందువలననే మంత్రద్రష్టలగు ఋషుల కందరకును మౌనులనునామము సార్థకమైనది. పూర్వకాలమునందు తాపసులు యోగులు మొదలగు వారందరును మౌనవ్రతము నెక్కువగా బ్రశంసించి యవలంబించుచుండిరి. భగవన్నామమును సదా స్మరించుచుండుటవలన వాగింద్రియము నిగ్రహింపబడి బాహ్యాంతరింద్రియముల విక్షేపమును చాలవరకు బోగొట్టును. భగవన్నామస్మరణమువలన పాపక్షయమగును. భగవద్భజనము కథాకాలక్షేపములు నత్యంత సహకారములుగా నుండును. భగవన్నామమును లిఖించుటవలన (అనగా రామకోటి, శివకోటి) యింద్రియవిక్షేప మడిగి యేకాగ్రతను బొందును. భగవన్నామమంత్రజపమువలన పాపక్షయము, యింద్రియ నిగ్రహము, యేకాగ్రత, యిష్టదేవతయొక్క స్వరూపధారణయు గలుగును. ఈ విధులయందు శౌచమును, ముఖ్యముగా గమనింపవలయును. శౌచము బాహ్యమని యనాంతరమని యు రెండువిధ

ములు. వానిలో మృత్తికచేతను, జలముచేతను చేయబడునది బాహ్యము. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర, దంభములు మొదలైన దుర్గుణసంఘములతోడ కూడక మనస్సు నిర్మలమై యుండుటే అంతశ్శౌచము. ఈ బాహ్యాభ్యంతరశౌచములను గమనింపక జేయుజపము నిష్ప్రయోజనమగుటయేగాక దుష్ఫలము నిచ్చును.

సీ॥ వేదాంతవిదులను ♦ మోదించు నట్టిది
జపకర్మమత్యంత ♦ శౌచశాలి
యై కుశాస్తీర్ణస ♦ మావనీ తలమునఁ
గుశముష్టి సేకొని ♦ విశదచిత్త
వృత్తి నింద్రియములు ♦ విషయ సక్తంబులు
గాకుండ నిలిపి త ♦ దేకపరత
మత్సరాహంకార ♦ మానదంభాపగ
మంబును బ్రహ్మచ ♦ ర్యంబుఁగలిగి

తే॥ జపముసెల్లించు పురుషుండు ♦ సర్వలోక
విజయి నిస్పృహమగు జప ♦ విధివిశోక
హర్ష రాగాదికంబును ♦ నవ్యయంబు
నైన పదముఁ బొందించు నృ ♦ పాగ్రగణ్య॥ శాంతి ౪.౧౩౦

క॥ శౌచాదిగుణము వెడలుట
నీచత్వము వాటిలంగ ♦ నిశ్చలమతిదు
ష్టాచరితమైన జపవిధి
నాచెప్పిన సుగతిదేదు ♦ నరకముదెచ్చున్ ॥౪-౧౩౧॥

స్వరూపధారణను బొందిన జప మతితీవ్రతను బొందెనేని ధ్యానమనబడును. దృఢమగు ధ్యానమునకు తపమను నభిధానంబు గలుగును. తపమువలన నిష్టదేవత సాక్షాత్కరించును. ఇది తపము యొక్క సాధారణరూపము. విశేషరూపము సద్గురునియొద్ద యుక్తమాధికారికి బొందసాధ్యమగును. తపము సర్వార్థసాధకము. తపము

వలన బొందరాని పదంబులెవ్వియును లేవు. అష్టసిద్ధులును తపము వలన సిద్ధించును.

మ॥ భగవంతుం బురుషోత్తముం హరిం గృపా♦పాథోధి లక్ష్మీశ్వరుం
సుగుణభ్రాజితు నచ్యుతుం బరుం బరం♦జ్యోతిం బ్రభుం సర్వభూ
తగుహావాసు నధోక్షజుం శ్రితజన♦త్రాణైకదక్షు న్నజుం
జగదాత్ముం గనుచుందు రార్యులు తప♦శ్శక్తిం స్ఫుటజ్ఞానులై॥

—భాగ౩-౩౭౪.

క॥ తపమనఁగ సత్స్వరూపము
తపమను గురువునకు ఫలవి♦తానము నేనా
తపమునకే జననస్థి
త్యుపసంహరణము లొనర్పు♦చుండుదుఁ దనయా॥

—భాగ-౨-౨౪౭.

క॥ కావున మద్భక్తికి దప
మేవిధమున మూలధనము♦నిది నీమది రా
జీవభవ యెఱిఁగి తపమిటు
గావించుట విగతమోహ♦కర్మ్మదవింకన్॥ ౨౪౫.

వ॥ ............తపంబు దపంబని మును లాచరింతురు. దాని తెఱంగెఱింగింపుమని నీవు దొల్త నడిగినవిధంబునం దొడంగి నాచెప్పిన విధంబులిన్నియుం దపంబను శబ్దంబున కర్థంబులై యుండునని చెప్పి యంగుష్ఠప్రమాణదేహులు మృగాజినవసనులు నిర్ద్వంద్వులునై వాలఖిల్యులనుపేరం బ్రసిద్ధులగు మునులు దినకరదీప్తులతోడంగూడి వర్తించుచుందురు. వారల తపోవైభవంబునంగాదె జగంబులు సుస్థిరంబులై యున్నయవి యెందు నెయిదుర్లభంబులైనట్టివి తపంబున సులభంబులగుం. తపంబుగడచిన ధర్మంబుంగల దే యనిపలికి.........

—అనుశా-౨౯.

క॥ ఇయ్యఖిలము సృజియింపగ
నెయ్యదిప్రభు వమ్మహాము ♦ హితభూతము పొం
దయ్యెడి శుభంబుదపమునఁ
జయ్యనసిద్ధించు నది వి ♦ సంశయమనఘా॥ శాంతి౫-౧౦౧.

క॥ అని చెప్పి తపము పెంపును
వినిపించుట కిట్టులనియె ♦ విద్యాధర స
న్ముని దేవతాగణంబులు
వినుతతపంబునన మహిత ♦ విభవముబొందెఁ॥ శాంతి ౫-౪౯౭

చ॥ కమలభవుండు దాఁ దపము ♦ కల్మినకాదె సృజించె నెల్లలో
కములను నాదిరాజు లధి ♦ కంబగు పెంపువహించు టెల్ల ను
త్తమతపమాచరించుటన ♦ తద్దయు సౌఖ్యకరంబులైన భో
జ్యములును గంధమాల్యములు ♦ శయ్యలు భవ్యతపఃప్రభూత
[ములె॥ ౪౯౮

తే॥ దారధన మిత్రపుత్రికా ♦ ద్యంబులగు ప
దార్థముల సంగమునఁ జిత్త ♦ మలఁతిబొంది
విసివినప్పుడు నిర్మల ♦ విపులతపము
గారణంబగు నుపశాంతి ♦ కలిమికనఘ॥ ౪౯౯

క॥ విను లోభము సంతోషం
బును దుఃఖసుఖప్రదములు ♦ పురుషునకవి సం
జనితములగుట తపము లే
కునికిని గలుగుటనుజూనె ♦ యుర్వీనాథా॥ ౫౦౦

తే॥ అనఘ సుఖదుఃఖములు వచ్చి ♦ నపుడు మదవి
పాదములులేక సంప్రాప్త ♦ సముపభోగ
రతుఁడు నప్రాప్యవాంఛా ని ♦ రాసకుండు
నగుట సారతపోరూప ♦ మండ్రు బుధులు॥ ౫౦౧

క॥ పరధర్మము నర్థంబును
నరసంబగు విషయ సుఖము ♦ సద్గతియుఁ దపః
పరిపాకమునన కలుగుఁగా
నరునకుఁ దత్తద్విధాత్త ♦ నైపుణ్యుఁడైనఁగా॥౫౦౨

౪౩ వైరాగ్యము.

ఇహలోకసంబంధమగు నైశ్వర్యమంతయు మన మీలోక మున విడిచి పోవలసినదే గాని వెంటవచ్చునదేదియు లేదు. భగవద్భక్తియే నిహాపరసాధకమై యున్నది. విషయములు ప్రవాహరూపముగా వచ్చుచు బోవుచుండును. దుఃఖంబులు వాంఛితంబులుగాక జేకురుభంగి సుఖంబులును గాలానుసారంబులుగా సంప్రాప్తమగుచుండును. కావున వృథాప్రయాసంబున నాయుర్వ్యయంబు జేయం జనదు. హరిభజనంబున మోక్షంబు సిద్ధించు. జననమరణ ప్రవాహము నుండి మన ముద్ధరింపబడుటకు విషయములయందు విరాగమును బొంది అహంకార మమకారములను విడిచినవారమై యీశ్వరుని సేవింపవలయును.

సీ॥ కంటిరే మనవారు ♦ ఘనులు గృహస్థులై
విఫలులై గైకొన్న ♦ వెట్టితనము
భద్రార్థులైయుండి ♦ పాయరు సంసార
పద్ధతినూరక ♦ పట్టువడిరి
కలయోనులందెల్ల ♦ గర్భాద్యవస్థల
బురుషుండు దేహియై ♦ బుట్టుచుండు
దన్నెఱుంగడు కర్మ ♦ తంత్రుఁడై కడపట
ముట్టడు భవకేళి ♦ ములకునయిన
ఆ॥ దీనశుభములేదు ♦ దివ్యకీర్తియులేదు
జగతిఁబుట్టిపుట్టి ♦ చచ్చిచచ్చి
పొరలనేల మనకుఁ ♦ బుట్టనిచావని
త్రోవ వెదకికొనుట ♦ దొడ్డబుద్ధి॥ భాగ౭—౨౧౪

ఆ॥ విషయాసక్తులైన ♦ విబుధాహితులతోడి
మనికివలదు ముక్తి ♦ మార్గవాంఛ
నాదిదేవు విష్ణు ♦ నాశ్రయింపుడు ముక్త
సంగజనులఁగూడి ♦ శైశవమున॥ ౭౧౬.

క॥ దేహము నిత్యముగాదని
మోహముఁదెగఁగోసి సిద్ధ ♦ మునివర్తనుఁడై
గేహము వెలువడు నరుఁడు
త్సాహముతోఁజెందు ముక్తి ♦ సంపద ననఘా॥ భాగ౧-౩౧౫

క॥ మందునకు మందబుద్ధికి
మందాయువునకు నిరర్థ ♦ మార్గములను గో
విందచరణారవింద మ
రందముగొన్నఁ దెఱపిలేదు ♦ రాత్రిందివముల్॥ ౧-౩౯౪,

మ॥ అరవిందాక్ష పదారవిందమకరం ♦ దాసక్తులై యున్న స
త్పురుషశ్రేష్ఠులవృత్తముల్ వినక దు ♦ ర్బుద్ధిఁ విలంఘించి దు
ర్నరవార్తాకథనప్రపంచములు ♦ గర్ణప్రాప్తముల్ సేసి వా
సరముల్ వ్యర్థముద్రోచుచుండ జన ♦ దీసంసార మోహాంబునన్॥
౧-౩౯౭.

సీ॥ మనువు నిత్యముగాదు ♦ మరణంబు నిజమని
యెఱిగి మోక్షస్థితి ♦ నిశ్చయించు
నల్పాయువులగు మా ♦ కన్యదుర్జనచరి
త్రములోలిఁగర్ణరం ♦ ధ్రముల బెట్టి
బంగారువంటి యీ ♦ బ్రదికెడుకాలంబుఁ
బోనాడగానేల ♦ పుణ్యచరిత
మాధవపదపద్మ ♦ మకరందపానంబు
జేయింపవే...............

—భాగ ౧-౩౯౩

సీ॥ ..........................

..........................

..........................

..........................

గృహములలోపల ♦ గృహమేధులగు వారు
    లాత్మతత్త్వము లేక ♦ మైనసెఱుఁగ
రంగనారతుల ని ♦ ద్రానక్తిఁజను రాత్రి
    పోవుఁగుటుంబార్థ ♦ బుద్ధి నహము

ఆ॥ పశుకళత్రపుత్ర ♦ బాంధవదేహాది
    సంఘమెల్లఁ దమకు ♦ సత్యమనుచుఁ
    గాపురములు సేసి ♦ కడపటఁ జత్తురు
    కనియుఁ గానరంత ♦ కాలసరణి॥ ౨౩.

వ॥ విను మూఢుండు శబ్దమయ వేదమార్గంబైన కర్మఫలబోధన ప్రకారంబున వ్యర్థంబులైన స్వర్గాదినామ లోకసుఖంబుల నిశ్చయించుచు మాయామయమార్గంబున వాసనామూలంబున నిద్రించువాడు గలలు గను తెఱంగునం బరిభ్రమించుచు నిరవద్య సుఖలాభంబుం జెందడు. తన్నిమిత్తంబున విద్వాంసుండు నామమాత్రసారంబులగు భోగ్యంబులలోన నెంతట దేహనిర్వాహణంబు సిద్ధించు నంతియ కైకొనుచు నప్రమత్తుండై సంసారంబు సుఖంబని నిశ్చయింపక యొందుమార్గంబున సిద్ధిగలదని చూచి పరిభ్రమణంబు సేయుచుండు. ౨.౨౦.

సీ॥ కమనీయభూమిభా ♦ గములు లేకున్న వే
    పడియుండుటకు దూది ♦ పరుపులేల
సహజంబులగు కరాం ♦ జలులు లేకున్న వే
    భోజనభాజన ♦ పుంజమేల
వల్కలాజినకుశా ♦ వళులు లేకున్న వే
    కట్టముకూలసం ♦ ఘంబులేల

గొనకొని వసియింప ♦ గుహలు లేకున్న వే
ప్రాసాదసౌధాది ♦ పటలమేల

తే॥ ఫలరసాదులు గురియవే ♦ పాదపములు
స్వాదుజలముల నుండవే ♦ సకల నదులు
బొసఁగఁబిక్షలు వెట్టరే ♦ పుణ్యసతులు
ధనమదాంధుల కొలువేల ♦ తాపసులకు॥ ౨. ౨౧.

క॥ రక్షకులు లేనివారల
రక్షించెదననుచుఁ జక్రి ♦ రాజై యుండన్
రక్షింపుమనుచు నొకనరు
నక్షముఁ బ్రార్థింపనేల ♦ యాత్మజ్ఞులకున్ ॥ ౨. ౨౨.

క॥ పాలింపుము శేముషిను
న్మూలింపుము కర్మబంధ ♦ ముల సమదృష్టిం
జాలింపుము సంసారముఁ
గీలింపుము హృదయమందు ♦ గేశవభక్తిన్॥ ౭. ౨౬౮.

౪౩ శ్రీమచ్ఛంకరాచార్యకృత వైరాగ్యాష్టకం.

శ్లో॥ భార్యాపుత్రాగ్రహాధన పశుక్షేత్ర ధాన్యాదిసంప
త్కర్ణేభూషా వివిధవసనం కంఠమాల్యాంగులీయం
నానావిద్యా కటితటలసత్స్వర్ణసూత్రంచ గాత్రం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః ॥౧॥

తా॥ దారాపుత్రులు, యిండ్లు, ద్రవ్యము, పశువులు, పొలములు, ధాన్యము మొదలైన సంపదలును, చెవుల కాభరణములును, అన్నిరకముల వస్త్రములును, కంటెలు నుంగురములును, సమస్తవిద్యలును, బంగారు మొలనూలుచే ప్రకాశించు శరీరము నివియన్నియు చనిపోవు సమయమందు వ్యర్థమైనవి. పార్వతీపతి సహాయమొక్కటియే (కావలసినదిగాని పైనిచెప్పినవన్నియు వ్యర్థములనట).

శ్లో॥ తర్కే శబ్దే బహుళపరిచయే వేదవేదాంగయోర్వా
మీమాంసాయాం శ్రుతిషు సకలాస్త్వాగమే వైద్యశాస్త్రే
కింవాలాపై ర్బహువిధచతుష్షష్టివిద్యాకలాసు
సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః॥ ౨

తా॥ తర్కశాస్త్రముయొక్కయు, శబ్దశాస్త్రముయొక్కయు, షడంగయుక్తమగు వేదములయొక్కయు, స్మృతులు మొదలైనవాని యొక్కయు, సమస్తాగమములయొక్కయు, వైద్యశాస్త్రము యొక్కయు, విశేపరిచయము ననేకవిధములగు చతుష్షష్టివిద్యలయొక్కవ్యాపకమంతయు మరణసమయమందు వ్యర్థమైనదే. సాంబమూర్తియొక్క సహాయమొక్కటియే (కావలసినది).

శ్లో॥ దారాపుత్రో నరాణాం పరిజనసహితో బంధువర్గః ప్రియోవా
మాతా భ్రాతాపితావా గురుజనసహితో భోగవైశ్వర్యయుక్తః
విద్యారూపం విమలనయనం యౌవనం మానగర్వం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః॥ ౩

తా॥ నరులకు భార్యాపిల్లలును, సేవకులతోకూడిన బంధుజాలమును, స్నేహితులును, తల్లితండ్రులును, యన్నదమ్ములును, గురువులును, సమస్త భోగభాగ్యములును, విద్యయును, చక్కదనమును, నిర్మలమైన నేత్రములును, యౌవనమును, మదగర్వములును, నివి యన్నియు మరణసమయమందు వ్యర్థమైనవియే (యగును) కాని శివునియొక్క సహాయమొక్కటియే (కావలసినది).

శ్లో॥ జ్యోతిష్టోమాద్యఖిలక్రతుభి ర్ధ్యానయోగంచ విద్యా
గోత్రం సూత్రం కులజనమదమాత్సర్యవర్ణాశ్రమావా
క్షేత్రారామాద్యఖిలవిభవో పుణ్యపాపంచ చీర్ణం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః॥ ౪

తా॥ జ్యోతిష్టోమము మొదలైనయజ్ఞములును, ధ్యానయోగమును, విద్యయును, కులగోత్రములును స్వజాతియందు దోర్వ లేమి

యును, మదిగర్వములను, తోటలు. పొలములు మొదలైన సంపదలును, పాపపుణ్యము లివియన్నియును మరణ సమయమందు వ్యర్థము. సాంబమూర్తి సహాయమొక్కటియే (కాదగినది.)

శ్లో॥ స్థూలం సూక్ష్మం ఇహకిల సుహృదస్సువ్రతం చాభిమానం
దేహేమోహః దృఢతరమణిమాద్యష్టసిద్ధిశ్చ భోజ్యం
ఆయుర్వృద్ధి ధృతి రతికుశలం యౌవనం మానగర్వం
సర్వం వ్యర్థం మరణసమయే సాంబఏకస్సహాయః॥ ౫

తా॥ మంచిహృదయమును, మంచిప్రవర్తనయు, అభిమానమును, దేహమందుకోరికయు, ఆయుర్వృద్ధిదములయిన యణిమాద్యష్టైశ్వర్యముల యనుభవమును, ధైర్యమును, నేర్పరితనమును, యౌవనమును, అభిమానగర్వము నివియన్నియు మరణకాలమందు వ్యర్థములు. సాంబమూర్తి సహాయమొక్కటియే (కావలసినది.)

శ్లో॥ సేవా యాచ్ఞా నటనవికటం వాద్యగీతానుమోదః
గంగాసేతుగయముఖ సుమహాక్షేత్ర తీర్థాటనంచ
దిక్పాలత్వం దినకరహుతభుగ్దేవతారాధనంవా
సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః॥ ౬

తా॥ సేవకావృత్తియు, యాచించుటయును, సంగీతము, నృత్యము వీనియందు సంతోషమును, గంగ, సేతువు, గయ మొదలైన పుణ్యతీర్థములయొక్కయు, పుణ్యస్థలములయొక్కయు, సంచారమును, భూపాలనమును, సూర్యుడు, అగ్నిమొదలైన దేవతలయొక్కయారాధనము నివియన్నియు మరణకాలమందు వ్యర్థమైనవి. (సాంబమూర్తియొక్క సహాయమే (కావలసినది.)

శ్లో॥ చింతారత్నం ప్రచురవిభవః కల్పకః కామధేనుః
కాంతాక్రీడా కనకకుసుమాద్యుక్తశయ్యోపధానం

స్వాంతఃకరణాద్యఖిలవివృతాద్యావతీహ్యాస్తిలోకే
సర్వం వ్యర్థం మరణసమయే సాంబవీకస్సహాయః॥ ౭

తా॥ కామధేనువు, కల్పవృక్షము, చింతామణి వీనితో సమానమగు *ప్రసిద్ధమైనదానమును, బంగారుపువ్వులచేత కూడిన ప్రక్కయును, స్త్రీసంభోగమును, మొదలైనవన్నియు మరణకాలమందు వ్యర్థమైనవి. సాంబమూర్తియొక్క సహాయమొక్కటియే (కాదగినది.)

శ్లో॥ ఇత్థం స్తోత్రం పఠతిచ పుమాన్ సర్వదా భక్తియుక్త
స్తస్యాఽవశ్యం పరమకృపయా సాంబమూర్తిః ప్రసన్నః
దత్వా సమ్యగ్విమలమచల జ్ఞానవైరాగ్య సంప
త్సంఘం భూమా జననమరణాత్తూర్ణ ముద్ధారకశ్చ॥

తా॥ ఈస్తోత్రమును భక్తియుక్తుడై యెల్లప్పుడెవడు పఠించుచున్నాడో వానికి శ్రీసాంబమూర్తి కృపాయుతుడై ప్రత్యక్షమై నిర్మలమగు చలింపని జ్ఞానవైరాగ్యసంపదనొసంగి జననమరణముల నుండి యుద్ధరించును.

ఓం తత్సత్.

## ౨౫ ఆహారనియమము తపోసిద్ధికి మూలము.

మనము నిత్యమును భుజించు ఆహారమే సర్వేంద్రియములకు బలము నొసంగుచున్నది. అన్నరసము రక్తముగాను, రక్తము శుక్లముగాను మారును. శుక్లమునకు మనస్సు సూక్ష్మరూపము. (శాంతి. ౭.౩౦౮.) బాహ్యాంతరింద్రియములు విషయములనుండి విరమించి ఆత్మయం దేకాగ్రతను బొందుట (అనగా రాజస తామసభావములను విడిచి సాత్త్వికభావమును బొందుట) కు నాహారనియమమును

యములచే సత్త్వము గలుగును. సత్త్వమువలన తపోసిద్ధి యగును. కనుక నాహారనియమమే తపస్సుగాబరిగణింపబడుచున్నది.

క॥ తపము నిదానము ధర్మ
ప్రపంచమునకెల్ల దాని ♦ గ్రమమున వ్రతతం
త్రపరాయణు లొనరింతు ర
థిప ఫలమూలాంబువృత్తిఁ ♦ దృప్తిఁ బొరయుచున్॥
—శాంతి ౩.౮౧౩

క॥ విను మశననిగ్రహము దప
మనునభిధానంబుగల మ ♦ హాధర్మము త
ద్ధనవంతుచిత్తవశగతి
జను నఖిలస్థావరమును ♦ జంగమతతులున్॥ ౮౧౮

తే॥ పంచవిధవృత్తులగు ♦ మహాపాతకములు
లోనుగా గిల్బిషములెల్ల ♦ లుంఠితంబు
లగుఁ దపంబున నత్యశౌ ♦ చాదు లొలయు
నఖిలసిద్ధులు నతనిచేత ♦ నావహిల్లు॥ ౮౧౫

క॥ విను దేవతాప్రసాదం
బున నిర్మలయోగతంత్ర ♦ ములు పనుపడు న
య్యనువున నిశ్చలమతి ని
ల్చునది శిథిలితాన్నపాన ♦ సుఖతృష్ణుండై॥ ౮.౩౧౫

క॥ శాకకణమూలఫలపి
ణ్యాకాదుల భైక్షమైన ♦ యన్నంబున ని

శ్లోకత నాఁకలివుచ్చుచు
లోకాలోకంబున నచ ♦ లుఁడు గావలయున్॥ ౪-౩౧౬.

క॥ జ్ఞానమ యింధనముగ వి
జ్ఞానాగ్నిం బ్రబలఁజేయ ♦ జరయు మరణమున్
నానావిధదుఃఖంబులు
లేని యమృతమక్షరంబు ♦ లెస్సై తోఁచున్॥ ౪-౩౧౭.

తే॥ బ్రహ్మచర్య మహింసనాఁ ♦ బరఁగు పరమ
ధర్మములు రెండుసువ్వా యు ♦ త్తమతపంబు
దానిఁగలవాఁడు నిర్మల ♦ జ్ఞానయోగ
వంతుడై చూడనేర్చు స ♦ ర్వంబు ననఘ॥ ౪-౪౩౪.

క॥ ఆతతసంసారము తృ
ష్ణాతంతుస్యూతిబంధ ♦ నంబున దృఢమై
చేతస్సంగతిఁ బాయమి
కా తెఱఁగు తపంబు పుత్ర ♦ యామధముసుమీ॥ ౪-౩౩౫.

ఆ॥ ఎచటమెలఁగనేమి ♦ యెట్లుండనేమి దా
నేమిసేసెనేమి ♦ యెల్లసంగ
ములును విడిచి ఉడువు ♦ వలన నియతిగల్గు
యతికి మోక్షవీధి ♦ యాటపట్టు॥ భారతము అను శాం౫-౫౩.

తే॥ తపమునను బ్రహ్మచర్యవ్ర♦తమున హితమి
తాశనమున రసాయనా ♦ భ్యాసమునను
బెరుఁగునాయు వాక్రియలపై ♦ నరుఁడు
గలుగఁటయుఁ బూర్వభవకృత ♦ కర్మఫలము॥ అను ౫-౧౩౧

తే॥ మాతకును వేదమునకు ధ ♦ ర్మంబులకును
బరములగు గురుశాస్త్రలా ♦ భములు లేవు
తపములే దుపవాసవ్ర♦తంబుకంటె
నధికమైనదియుండు మ♦హాత్ములనఘ॥ అను ౭-౧౬౩

చ॥ అనశననిష్ఠఁజేసి సుర ♦ లాదిమునుల్ మహితానుభావులై
రనఘ సహస్రవర్షసమ ♦ నంతరకల్పితమైన యేకభు
క్తనియమతంత్రమున్ నడపి ♦ గాధితనూజుఁడు బ్రాహ్మణత్వ[ముం
గనియె మహోపవాసములఁ ♦ గానిఫలంబులు లేవు భూవరా.
—అను ౭-౧౬౪॥

క॥ కావున నుపవాసవ్రత
సేవనము శరీరమునకుఁ ♦ జిత్తంబునకుం
బావన మైహికమహిమయు
దేవనిలయసుఖము నివ్వి ♦ ధిన్ సమకూర్పన్॥ ౭-౧౬౫

క॥ పరమగు నీవ్రతమునఁ గం
గిరసుఁడు దర్శకుఁడు ♦ దత్పుగీతవిధమునన్
నరులెవ్వరు దర్శకులగు
గురు వారింబోరయ వేమి♦దుఃఖములు నృపా॥ ౭-౧౬౬

## ౪౬. నిర్విచార జీవనము.

"అనాయాసేన మరణం వినా దైన్యేనజీవనం"

ప్రపంచమందు మానవకోటి యిహపరములయందు బూర్ణత్వ మును బొందుటకుతగిన "నిర్విచార జీవనము" బ్రసాదింపబడుచున్నది.

స్వాతంత్ర్యము, సుఖము, ఆరోగ్యమును నాశనముజేసి మానవ కోటిని దుఃఖాక్రాంతముగా జేయుచున్న నవనాగరికతా పిశాచము మనశారీరక, మానసికశక్తులను క్షీణింపజేసి కోట్లకొలదిగానుండిన పురుషులను, స్త్రీలను, బిడ్డలను అజ్ఞానమునందు ముంచుచున్నది. అసం తృప్తియు, అశాంతియు లోకమునం దన్ని దేశములందును, అన్నిజా తులయందును పెరుగుచు తోడిమానవులయొక్క స్వాతంత్ర్యమునకును, జీవితమునకును యడ్డమై నిరంతర రక్తపాతమునకు మూలమగు చున్నది. ఇక్కాలమున మానవకోటిని కలవరపరుచుచుండిన సాంఘిక, ఆర్థిక, విద్యా, మతవిషయిక సమస్యలను సమన్వయముజేసి ప్రజల యందు బెరుగుచుండిన దుఃఖమును, నిరాశను, అసంతృప్తిని బోగొట్టి మానవకోటికి యుత్కృష్టజీవితము నొసగుటయం దీసాధన ముప యోగపడుచున్నది. ఈయుత్తమ సాధనమే బురుషులకు ధర్మార్థ కామ మోక్షములను నాలుగు బురుషార్థములను సులభముగా బొందించు నదియైయున్నది. ఐహికాముష్మికసంబంధములగు సకలైశ్వర్యములను బొందించి జీవునికి ముక్తినిచ్చున దీయుత్కృష్టసాధనమే. కనుక ముము క్షువులు బహుశ్రద్ధాభక్తులతో దీని నభ్యసించుదురుగాక.

శ్లో॥ అనన్యాశ్చింతయంతోమాం । యేజనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం । యోగక్షేమం వహామ్యహం ॥

తా॥ ఎవ రితరకోరికలు లేక నన్నే శరణుపొంది కొలిచెదరో యట్టి యచంచలచిత్తులైనవారల యోగక్షేమములను నేనే పూనియుం

ఈశ్వరునియందు విశ్వాసముండిన ప్రతిమానవుడును నీయాజ్ఞ ననుసరించినయెడల నతిభారమై మానవకోటి నడచివేయుచుండిన "విచారము"ను తోసివేసి సుఖింపవచ్చును. ఆహారము, వస్త్రము, యితరజీవనావసరములను గురించి మనము నిరంతరము విచారించు చుందుము. వలసినంత యాహారాదుల నొసగుటకు తగిన వసతులను గలిగియుండినయెడల బుద్ధిమంతున కీవిచారము తగ్గిపోవును. ఆహారసంపాదనయందు కష్టముకలిగిన కొలది "అవసరము" యెక్కువగుచుండును. "అవసరములు మానసికభారములు" ఈభారము మానవుని క్రింగదీయును.

"అవసరము" సర్వసాధారణమైన "ఆత్మహత్య"యని జెప్పవచ్చును. "అవసరము" ఆకలిని జంపును. నిద్రాభంగమును గలిగించును. ఉచ్ఛ్వాస నిశ్వాసములను విషమమార్గమున నడపును. జీర్ణశక్తిని పాడుచేయును. మానసికశక్తులను నడతను క్షీణింపజేయును. ఆరోగ్యమును పాడుజేసి రోగమును వృద్ధిజేయును. "అవసరము మానసిక విషము."

అవసరములనుండి విముక్తిని బొందుటెట్లు?

మనయవసరములను పూర్తిగా తగ్గించుటవలన మనము విముక్తులమగుదుము. మన యవసరములకు కారణములను బరిశీలింపగలిగితిమేని మనము భవిష్యత్కాలమున "నిర్విచారజీవనము"ను నడుపగలుగుదుము.

మన యవసరములను బాగుగా విమర్శింప గలిగితిమేని 1 ఆహారము. 2 వస్త్రము. 3 నివాసములను మూడు భాగములుగా భాగింప

## (1) ఆహారము.

ఆహారావసరములే మానవుని క్రుంగదీయుచున్నవి. ఆహారమునకు వలయు బియ్యము లేక పిండిని తయారు చేయుటకును, పప్పు కూరలు వగయిరా సాధకములకును వీనిని తయారుచేయుటకు వలయు సాధన సామాగ్రియు, సువాసన ద్రవ్యములు, కట్టెలు, పాత్రసామానులు, భోజనపాత్రలు మొదలైన యనేకవస్తువు లేక కాలమునందు కూడినగాని, మనమాహారమును తయారు చేయలేము. ఈ పదార్థములు నిలువ యుంచుటకు తగిన నివాసమును యితర యవకాశములను గలిగియుండ వలయును. ఈ వస్తుసముదాయము నంతయు పచనము చేసి భోజనమునకు సిద్ధము చేయుటకు ప్రత్యేకమనుష్యులు కావలయును. నాగరికుడైన యొకపెద్దమనిషికి యిరువురు పరిచారిక మనుష్యులు లేక జరుగుట దుర్ఘటము. అనగా నొకరు సుఖముగా జీవనము గడుపుటకు మరియిద్దరు మనుష్యులను బోషింపవలయును. ఇందుకు ధనము నార్జింపవలయును. ధనార్జనయందు యహర్నిశములు కాలము గడిపిననేగాని లభించదు. ధనార్జన కనేకావసరములను గల్పించుకొని మానవుడు క్రుంగిపోవుచున్నాడు.

## (2) వస్త్రము.

వస్త్రము కొరకు మానవు డనేకానర్థములను బొందుచున్నాడు. తాను నివసించు దేశముయొక్క శీతోష్ణస్థితి ననుసరించి యధిక విలువగల వస్త్రములను కొంద రుపయోగించుచుండ నాగరికతపేరున తమదేశమున యనవసరమైనను కొందరు విలువగల వస్త్రములను వాడుచున్నారు. ఇందుకొరకు ధనము నార్జించుటలో యవసరముల నెక్కువగా కల్పించుకొనవలసి వచ్చుచున్నది.

## (3) ని వా స ము.

ప్రస్తుతకాలనాగరికతామహాత్మ్య మేమియోగాని మానవుడు తాను జీవించుకాలము స్వల్పమైనను యనేకతరములవరకు మరమ్మతును కోరని దివ్యభవనములను కట్టుచున్నాడు. ఇందువలన చింతా సమూహాములు పెరుగుచున్నవి.

1 ఆహారము. 2 వస్త్రము. 3 నివాసము.

ఈ సమస్యాత్రయమును సులభముగా సమన్వయ పరచిన యెడల మానవుడు అవసరములలోనుండి విముక్తుడగును.

1 ఆహారము:—మానవునియొక్క శారీరక, మానసిక, నైతికాభివృద్ధి కత్యవసరమని నిస్సందేహాముగా జెప్పవచ్చును. మానవకోటియొక్క యవయవనిర్మాణమును విచారించినయెడల మానవుడు వ్యాఘ్రము మొదలగు క్రూరజంతువులరీతిని మాంసభక్షకుడుగాని పశువులరీతి శాకభక్షకుడుగాని పావురము మొదలగు పక్షులరీతి ధాన్యభక్షకుడుగాని కాడు. వానరములరీతి ఫలభక్షకుడు. సాధారణముగా నన్నిఫలములు నాతని కాహారములుకావు. నారికేళఫలమొక్కటియే నాతని కాహారము. ప్రకృతిసిద్ధమైన నీ యాహార విధానవిముఖత్వమే యతని కనేకానర్థములను గల్పించినది. కల్పించుచున్నది. ఇంకను కల్పింపనున్నది. స్వాభావిక జీవన మెంతముఖ్యమైనదియు, నీ సమస్యను పరిష్కరించుట మానవకోటి కెంతయవసరమైనదియు, బుద్ధిమంతులకు విదితమే. మానవుడు ప్రత్యేకము నారికేళ ఫలముమీదనే జీవింపవచ్చును. కొబ్బరి మనముజేయు వివిధవంటకముల కేవిధమునను తీసిపోదు. ఈ ఫలము సూర్యరశ్మిచే తయారు కాబడుచున్నది. సూర్యభగవానుల యనుగ్రహాముతో బోల్చి చూచినయెడల వంటవాని చాకచక్యము చాలాహైన్యము, యసంపూర్ణమునై యున్నది. వంటవాని విద్య శ్మశానవాటికకు దారిజూపుచున్నది. రుచిచేగాని, వాసనచేగాని, మానవుని కింపుగా సృష్టింప

బడని పదార్థములు పచనముచేయుటవలనను, యితరవస్తువులలో కలుపుటవలనను, సుగంధద్రవ్యములను జేర్చుటచేతను తినుటకింపుగా మనవంటలక్కలచే మార్చబడుచున్నది. ఈ విధానము సప్లయి దారుల సంచులు నింపుచు తినువారి బుద్ధివికాసమున కాటంకము కలిగించుచున్నది. అభోజ్యములను భుజించువాడు విపరీతాలోచనలను కర్మములను జేయును. స్వాభావికాహారమును భుజించువాడే తన శరీరమునకును మనస్సునకును సమానమైనపుష్టి నివ్వగలడు. అట్టివాడే సరియైన యాలోచనలను జేసి స్వాభావికకర్మలయందు వర్తింపగలడు. భూమిమీాద జన్మించిన ప్రతిజంతువునకును తినుట కాహారమమర్పబడియుండగా సృష్టికాధారభూతుడైన మానవునకుమాత్రము తగిన యాహారమేల భూమిమీాద సిద్ధముచేయబడి యుండదు? మానవ సృష్టిలో దేనికది ప్రత్యేకచిహ్నములను గలిగి చూచుటలోనే యుపయోగమును గ్రహించుస్థితియందుండగా నీశ్వరసృష్టియందు మానవున కట్టియవకాశమేల గల్పింపబడలేదు? సృష్టియందు వానరము మానవుని బోలియుండునటుల నారికేళఫలము మానవుని శిరమును బోలియున్నది. దానికి రెండునేత్రములు, నోరు, జుట్టు లోపలమెదడు రక్తముమొదలగు పోలికలను గలిగియున్నది. ఈపోలికలవలననైనను మానవుడు తనయాహారమును నిర్ణయించుకొనవచ్చును.

ప్రకృతిశాస్త్రము నీ విషయము నాక్షేపింపవచ్చును. కాని రాళ్లను, చెట్లను, జంతువులను, మానవులను పోలికలనుబట్టి తరగతులుగా విడదీయుటలేదా? ప్రకృతిశాస్త్రము మానవులను, వానరములను నొకేజాతియని జెప్పినపుడు ప్రత్యేకము మానవుని శిరమును బోలి యొకఫలముకనబడునప్పు డెట్లాక్షేపింపగలదు. ఆకారమందును వర్ణమందును తాము జీవించు శాకములనుబోలిన జంతువులుండుట మనము జూచుచున్నాము. అనేక క్రిమికీటకములు తాము జీవించుచెట్ల యాకులయొక్క యాకారములను, రంగులను బోలియుండుటను మనము సృష్టియందు గాంచుచున్నారము. ఈ విషయమునుగురించి "డార్విన్" యొక్క పరిణామశాస్త్రమామూలాగ్రముగా బోధించును. ప్రతివాడు

యనే కావసరములనుండి విముఖత్వమును బొందవలయునని పరమేశ్వరునిచే మనకనుగ్రహింపబడిన స్వాభావికాహారమునకు మరలవలయును. నారికేళఫలమే కొద్దిపదార్థములో నెక్కువబలమును, శ్రేష్ఠమైన బుద్ధిని, అధికమైన యోర్పును, నీయగలిగినది. నారికేళమును ప్రత్యేకముగా నభ్యాసముజేసిన మనుష్యునకు పూర్తిగా తయారైన యొకఫలమొకదినమున కాహారమునకు సరిపోవును. ఈఫలమొక అణా ఆరుపైసలకు దొరకును. నెల 1కి (రు 3-0-0 లు) మూడురూపాయిలు యొకనియాహారమునకు చాలును. సం॥ రమునకు నూటికి రు 12-0-0 లచొ॥ వడ్డీకి మూడువందల రూపాయలున్నయెడ ననాయాసముగా జీవింపవచ్చును. మనము స్వంతముగా కొబ్బరిచెట్లను పెంచుకొనినయెడల సం॥రమునకు చెట్టు 1 కి నూరుఫలములకు తక్కువలేక యిచ్చును. నాలుగు చెట్లుండినయెడల యొకమనిషికి సం॥రమునకు చాలును. ఎనిమిది సెంట్లనేలలో నాలుగు చెట్లనునాటవచ్చును. నారికేళవృక్షము మధమము నూరు సం॥ రములకు తక్కువలేకుండా ఫలితమునిచ్చును. ఒక్కయకరమునేలలో పెంచిన కొబ్బరిచెట్లవల్ల పదిమంది కాహారము నివ్వవచ్చును. దైవస్వరూపమైన కొబ్బరి నాహారముగా స్వీకరించువాని కాహారసంబంధమైన సమస్య తీరిపోవును. ఆహారవిషయములోపడు శ్రమమంతయు నాలుగు కొబ్బరిచెట్లను మాత్రము జాగ్రత్తపరుచుకొనుటకు తగ్గించబడినది వానికష్టమంతయు గట్టెక్కినది.

## పాశ్చాత్య పండితుల యభిప్రాయములు.

1. Dr. Brinkmeer says in his "Books on the palms" "There cannot be a more noble recreation than a serious occupation with palm trees, as there is indeed contained in them all the beauty and nobility of nature created by God."

డాక్టరు బ్రింకు మీయరను పాశ్చాత్య పండితు డీ విధముగా నుడివి యున్నాడు.

"ప్రకృతియొక్క సౌందర్యము, గాంభీర్యము, పవిత్రత అంతయు నారికేళమునం దమర్చబడి యున్నది."

2. Dr. Berthold Seemaun exclaims enthusiastically in his book "The popular national history of the palms."

"The palms, in fact, take care of so many of our wants and contribute so largely to our cnvenience, that it seems strange that mankind in habits parts of the world, where these trees do not grow."

డాక్టరు బర్థుహోల్డు సీమన్ అను నాయన తన నారికేళ చరిత్రమను గ్రంథమునందు—

"నారికేళము మన కోరికల నన్నిటి నిచ్చును. మన సౌకర్య ముల నన్నిటిని సమకూర్చును. ఇట్టి కొబ్బరిచెట్టు జీవించని చలి దేశములలో మానవులు నివసించుట జూడ నా శ్చర్యముగా నున్నది.

3. Dr. Lime exclaimed, full of admiration:—

"Man lives a natural life in the tropics and supports himself with the fruits of the palm tree; he is only existing in other parts of the world and lives miserably on grain and meat".

డాక్టరు లిన్నియను నాయన నాశ్చర్యముతో నిట్లు నుడివి యున్నాడు.

"మానవు డుష్ణదేశములందు సముద్రతీరములలో స్వాభావికా హారమగు నారికేళమును తిని సుఖముగా జీవించును. ప్రపంచములోని యితరభాగములలో ధాన్యము, మాంసము మొదలగు పదార్థముల మీద యాధారపడి కష్టతరముగా క్లేశముతో కాలము గడుపు చున్నాడు."

4. Mr. A. Hartmann writes in his treatise on the name of and the worship for the palms in the old world:—

"While the man in cold zones has to hunt for his nourishment under difficulties and dangers, as he takes his food from the animal kingdom, and likewise the man of the temparate zones, who gains his food from the different grain plants, can only gain his bread under the greatest hardships, the inhabitant of the tropics takes his nourishment easily from the trees. Those trees, however, now supplying many populations with nearly all their requirements, were once upon a time the only nourishers of all mankind".

హార్టుమన్ అను నాయన "పూర్వయుగములలోని నారికేళ పూజ" యను గ్రంథమందు.

"శీతలప్రదేశములలో (cold zones) జనులు తమ యాహార ముకొరకు ననేకకష్టములను అపాయములను పొంది జంతుకోటిని వేటా డుచున్నారు. మధ్యప్రదేశములలోని (Temperate Zones) ప్రజలు యనేకశ్రమలకోర్చి ధాన్యమునుండి తమ యాహారమును తయారు చేసికొనుచున్నారు. అయితే యుష్ణదేశములలో (Tropics)ని జనులు తమయాహారమును, అనాయాసముగా వృక్షములనుండి పొందుచు న్నారు. ఈవృక్షములే సృష్ట్యాదియందు మానవకోటికంతకు నాహార వస్త్రనివాసముల నొసంగినవి."

ఉష్ణదేశములలోని ప్రజలు బహుకొద్దిప్రదేశములో స్వల్ప వ్యయముతో నెక్కువ కాలహరణములేకుండా శరీరమునకు తుష్టిపుష్టు లనిచ్చు నాహారమును యనాయాసముగా నొందగలరు. భూమధ్యరేఖ (Equator) నుండి మనము దూరదేశమును పొందినకొలదిని విస్తీర్ణ మగు భూమియందు యెక్కువబలమును, కాలమును, ధనమును వ్యయ పరచి యసంపూర్ణమైన యాహారమును బొందుచున్నాము. "అస్వాభా విక జీవనము గలిగిన మానవుడు ప్రపంచమందు తనజీవనము కొరకనే కావసరములను గల్పించుకొని శారీరక మానసిక కష్టములచే తన్ను

కొని చావవలయును. కాబట్టిమానవులు ఫలకోటి యతిపవిత్రమై శక్తివంతమైన నారికేళఫలాహారమునకు మరలుటయే పరమశ్రేయము.

క్రైస్తవ మతగ్రంథమందు (బైబిలు) నారికేళము నుద్దేశించి వ్రాయబడిన వచనములిందు పొందుపరుప బడుచున్నవి.

I Mos. 2. 8, "And the Lord God planted a garden eastward in Eden; and there He put the man whom he had formed"

And 2. 15. "And the Lord God took the man, and put him into the garden of Eden, to dress it and to keep it."

ఆదికాండము. 2, 8, 15.

మరియు యెహోవా దేవుడు తూర్పున ఏదెనులో నొకతోట వేసి, తాను నిర్మించిన నరుని దానిలోనుంచెను. మరియు, యెహోవా దేవుడు నరుని తీసికొని, ఏదెను తోటను సేద్యపరచుటకును, దాని కాచుటకును, దానిలో వాని విశ్రమింపజేసెను.

Revelation ef John; Chapter 22. Verses 1&2 reads thus:

"And he shewed me a pure river of water of life, clear as crystal, proceeding out of the throne of God and of the Lamb."

"In the midst of the street of it, and on either side of the river, was there the tree of life, which bare twelve manner of fruits, and yielded her fruit every month: And the leaves of the tree were for the healing of the Nations."

Verse 14:— "Blessed are they that do his commandments, that they may have right to the tree of life, and may enter in through the gates into the city."

యోహాను ప్రకటన.

(22 అధ్యాయము 1, 2 & 14 వచనములు.)

"మరియు స్ఫటికమువలె మెరయు జీవజలనది దేవునియొక్కయు, గొర్రెపిల్లయొక్కయు సింహాసనమునుండి బైలువెళ్లుట నాకు అగుపరచెను." "దాని వీధిమధ్యనున్ననదియొక్క ఈవలను, ఆవలను, పన్నెండు ఫలములు ఫలించు జీవవృక్షము నెలనెలకు తనఫల మిచ్చుచున్నది. ఆ వృక్షముయొక్క ఆకులు రాష్ట్రములను స్వస్థపరచు మందు". "ఆయన (దేవుని) యాజ్ఞలను నెరవేర్చువారలు ధన్యులు. జీవవృక్షముమీద వారు అధికారులై యుందురు. వారు ద్వారముల గుండా పట్టణములోనికి వెళ్లుదురు."

Daniel 4: 10, 11, 12. "...............................and behold a tree in the midst of the earth, and the height thereof was great. The tree grew, and was strong, and the height thereof reached unto heaven, and the sight thereof to the end of all the earth. The leaves thereof were fair, and the fruit thereof much, and in it was meat for all; the beasts of the field had shadow under it, and the fowls of the heaven dwelt in the boughs thereof, and all flesh was fed of it."

దానియేలు 4 అధ్యాయము 10, 11, 12 వచనములు.

"................ఇదిగో! లోకముయొక్క నడుమ నొక వృక్షము నాకు కనబడెను; అది మహోన్నతముగా నుండెను. మరిన్ని ఆవృక్షముపెరిగి, బలముగానుండి, దానిచివర ఆకాశమును అంటి, లోకపు సరిహద్దులన్నిటిపర్యంతము వ్యాపించెను. దాని యాకులు చూడ విచిత్రముగా నుండెను; దానిఫలములు బహుగా విస్తరించి వుండెను; దానియందు సకల జీవకోట్లకు ఆహారము కలిగి యుండెను; దానిక్రింద భూమృగములకు నీడకలదు; ఆకాశపక్షులు దానికొమ్మలయందు నివసించెను. దానివల్ల సకలజీవకోట్లకు ఆహారము కలదు.

ఇంకను యెహెజికెలు మొదలైన వానిలో నీ వృక్షమును గురించి విస్తారముగా జెప్పబడినది.

"అవసరములను, రోగములను, జరామరణములను జయించవలయునని ప్రాణవంతమై, పవిత్రమైన నారికేళఫలమునీదనే జీవించుము."

నారికేళమునుగురించి సింహళములోని పురాణములయందు విసారముగా వర్ణింపబడినది.

1 నారికేళవృక్షము:—ఇండ్లు పడవలు కట్టుటకును
2 ఆకులు:—ఇండ్లకప్పులకు, చాపలకు, దళ్ళకును
3 నార:—గుడ్డలకు, పట్టాలకు, తాళ్ళకు, పరుపులకును
4 ఫలములు:—ఆహారమునకు, నూనెకు, గుండీలకు, వంటచెరుకునకు నుపయోగపడుచున్నవి.

నారికేళము భరతవర్షమున బూజింపబడినటుల మరెచ్చటను పూజింపబడుటలేదు. భారతవర్షమునందు కాలానుసారముగా ఫలించు ఫలకోటులన్నిటిలో నారికేళ మగ్రస్థానమలంకరించుచున్నది. ఆర్యులచే బూజింపబడు దేవతలందరకు నారికేళము బ్రియమగు నివేదనముగా సమర్పింపబడుచున్నది. ఆసేతుహిమాచలము ఆర్యదేవాలయముల లో నిత్యము ననేకవేలు, లక్షలు నారికేళము లవసరనివేదన ములకుగా నివేదింపబడుచున్నవి. ఆర్యులయం దన్నితరగతులవారును యాపత్కాలమునందు తను యిష్టదేవతలకు నారికేళములను సమర్పింపుదుమని మొక్కులిడుచున్నారు. దేవాలయములకు దర్శనములకు వెళ్లునప్పుడుగాని, గురువులను దర్శించునప్పుడుగాని, నారికేళఫలములేక రిక్తహస్తములతో బోగూడదను నియమముగలదు. భూతదయాపరులగు ఆర్యులందరు తామసదేవతలగు అమ్మవార్లజాతరలయందు వేటలను బలియిచ్చుటకు బదులు సజీవియగు నారికేళమును నివేదింపుచున్నారు. ఫలకోటిలో నారికేళమే సజీవిగా నెంచబడుచున్నది. శ్రుతి

యుక్తమైన ఫలదానములకు నారికేళఫలముద్దేశింపబడుచున్నది. ముత్తైదువులు పసపుకుంకుమలు యొకరొకరి కిచ్చుకొనునపుడు నారికేళమును జేర్చి యిచ్చుట గొప్పగౌరవముగా నెంచబడుచున్నది. వివాహానంతరము నారికేళములు గ్రామములో నిరుగుపొరుగువారికి పంచిపెట్టబడుచున్నవి. వేయేల ఆర్యులందరు తమదేవతల నుద్దేశించి జేయుపూజలయందు విగ్రహములులేనిచోట నారికేళము దేవతాస్థానమందుంచబడి దేవతవలె బూజింపబడుచున్నది. ఈప్రదర్శనము శ్రీరామకలశములయందును, సత్యనారాయణ పూజలయందును, దుర్గాకలశములయందును జూడనగు. దీనినిబట్టియే ఆర్యసంఘమునందు నారికేళమెట్టి గౌరవస్థాన మలంకరించినదియు స్పష్టపడుచున్నది. అనాదినుండియు దైవస్వరూపముగా గౌరవింపబడుచుండిన నారికేళమునకు తుష్టిపుష్టుల నిచ్చి మనశరీరముల బోషింపజాలిన సంపూర్ణమైన యాహారమైయుండగా మనమేల యనేకావసరములను గల్పించుకొని నిటునటు వ్యర్థముగా తిరుగులాడవలెను? ఉదరపోషణకొర కెట్టిదుర్మార్గములు జరుగుచున్నవి. ఇందునుగురించి యొకకవి యిట్లు వర్ణించియున్నాడు.

సీ॥ పండివ్రాలిన యట్టి ♦ పైరైన నొల్లక
నుంఛవృత్తి జరించు ♦ చుండిరెపుడు
చలిచీమనైనను చాదొ్ర ♦ క్కనోపక
శమదమాదుల నొప్పు ♦ సత్త్వఘనులు
కూటికిపేదలై కూట ♦ సాక్ష్యముల క
ళీకసృష్టికి కల్ల ♦ పోకడలకు
దుర్దానములకును ♦ దుష్టాన్నములకును
హేయకృత్యములకు ♦ నెగ్గులేక
జొచ్చి యవియును గరవైన ♦ జూదమునకు
చౌర్యమునకును బాల్పడి ♦ జతురులైరి
వారినేమనవలయు ని ♦ వ్వసుధలోన
లేమి యేమేమి జేయింప ♦ లేదు జనుల॥

పైపద్యమునందు వర్ణింపబడినటుల ఆహారము లేమి యేగదా పైదుర్ణయముల కాకరమగుచున్నది. స్వాభావిక నారికేళఫలాహారమునకు మళ్లినయెడల మన దారిద్ర్యవిచ్ఛిన్నమగును. నీచత్వము దూరమగును. దుర్ణయములు నశించును. హృదయము పవిత్రమగును. మనస్సు విషయతృష్ణావిజృంభణమును విడుచును. బుద్ధియందు దోషముహరించి పరమార్థదర్శనము గలుగును. మానవకోటిలో యన్యోన్యాటంకము తొలగి విశ్వమానవసౌభ్రాతృత్వము కలుగును.

కొబ్బరి రక్తమును శుభ్రపరిచి వృద్ధిజేయును. నరములకు బుష్టినిచ్చును. జ్ఞాపకశక్తిని వృద్ధిచేయును. కీళ్లయందు వేడిమిని తీసివేయును. లోపలియవయవములను నరుగకుండ జేయును. ధాతువులను సమమార్గమున నడపును. శరీరములోని నిక్కాకలను జ్వరము కడుపులోనిమంట మొదలగు రుగ్మతలను బోగొట్టి శరీరమును సౌమ్యస్థితియందుంచును. స్త్రీపురుషుల యస్వాభావిక యింద్రియవేగమునడిచి వీర్యమునమోఘముగా జేయును. జీవితమును వృద్ధిజేయును. శరీరమును శక్తివంతముగా జేయును. జీర్ణకోశమున కనవసరమగు పనిని గలుగనీయక మంచిస్థితియందుంచును. ఊపిరితిత్తులు మొదలగు యవయవముల కధికయొత్తిడిని గలుగనీయదు. క్షయదగ్గును వరిబీజమును యత్యద్భుతముగా కుదుర్చును. దంతరోగములకు సంజీవివంటిది. రక్తములోనీరును జేరనీయదు. శరీరమును జోషించుటకు తగిన కొవ్వుచముగు మొదలగువానితో ప్రపంచములో నేయాహారము సరితూగనేరదు. అంతరింద్రియముల కెక్కువపనిని కలుగనీయకయే శరీరములోని సర్వావయవములను బోషింపగలిగినది యొక్కనారికేళఫలమే.

నారికేళము మానవుని యాధ్యాత్మికశక్తులను వృద్ధిజేయును. రజస్తమోగుణములనడిచి సత్త్వగుణమును వృద్ధిజేయును. మనస్సునకు సూక్ష్మరూపము నొసగును. స్థిరసంకల్పమును, దృఢశక్తిని, యింద్రియనిగ్రహమును గలుగజేయును. బుద్ధిని తేజోవంతముగా జేసి సత్త్వముగా మార్చును. మలత్రయవిమోచనమును జేయును. అరిషడ్వర్గము

వణచి శమాదిషట్కము వృద్ధిజేయును. యోగమునందు స్థైర్యము నిచ్చును. వేయేల. చతుర్వింశతితత్త్వములను సౌమ్యమార్గమున నడపి పంచవింశకుండగు జీవుని ప్రవృత్తినుండి నివృత్తిమార్గమునకు స్వాభావికముగా ద్రిప్పగలిగినది నారికేళఫలమే.

నారికేళమును గురించి "వస్తుగుణ దీపిక" యందేమి చెప్పబడినదియు జూతము.

కొబ్బరిచెట్టు:— దీనిని సంస్కృతమున నారికేళ; నీలతరు; విశ్వామిత్రప్రియ యని యందురు. దీనికాయడొక్క యనగా పెచ్చు లేక పీచుయొక్క పొట్టు (Husk of the fruit) లోపలికిచ్చిన "నాడాపాము" (Tape worm) ను చంపును. పచ్చికాయ డొక్కరసము నిచ్చిన పులిత్రేనుపులు (acidity) అతిత్రేనుపులు (gastric irritation) కట్టును. కొబ్బరి చిప్పలు కాల్చి తీసిన చమురు పూసిన తామర, దద్దురు, పక్కిలు, గజ్జి, చిడుము, దంతరోగములు నివృత్తి యగును. పేలు చచ్చును.

కొబ్బరిచెట్టునీడ:— త్రిదోషశమనమైనది. తేలిక నిచ్చును. చల్లగా మనోహరముగా నుండును.

కొబ్బరిచెట్టుపువ్వు:— దీనిరసము లోపలికిచ్చిన రక్తపైత్యము, రక్తాతిసారము, మేహపైత్యము, వీనిని హరించును. రక్తవిరేచనములు, నీళ్లవిరేచనములు, ఋతురక్తస్రావము వీనిని కట్టును. (మోతాదు 3, 4 తులముల యెత్తు) ఈ రసమును పుక్కిలించిన నోటిపూత, పుండు మానును. దీనిలో పటిక, పంచదార, మంచి గంధము కలిపి యిచ్చిన పైత్యజ్వరము, వాంతి కట్టును. మేహశాంతి, చలువజేయును. (రసము తీయునపుడు కొద్దిగపోసి తీయవచ్చును.)

కొబ్బరిదూది:—(లేక బొంతపువ్వు) ఇది లేతఆకు అనగా మొవ్వలోని యాకు నంటియుండును. దీనిని గాయములకు, జలగ కాటునకు నంటించిన వెంటనే రక్తము కారకుండా కట్టును; గాయము ను వేగముగా మాన్పును.

కొబ్బరినూనె:— దీనిని కొబ్బరినేయి యనియందరు. రుచిగానుండును. పైత్యవాతములు హరించును. దేహపుష్టిని బలమును. యిచ్చు ను. దంతరోగములను క్షయరోగమును బోగొట్టును. మెదడుకు మేలుజేయును. శరీరమునకుబూసిన కంతులుకంతులుగా లేచెడి చర్మరోగమును నివర్తిజేయును. తలకుబూసిన వెంట్రుకలకు బలముజేయును. మృదుత్వమునిచ్చును. వెంట్రుకల నెదుగజేసి నలుపెక్కజేయును. పుండును మాన్పును. మేహాకారకశరీరులు దీనితో తలయంటుకొనిన చాలా మేలుజేయును. పచ్చికొబ్బరిలో నుండి తీసిననూనె లోపలికిచ్చిన దేహస్థితిని బాగుజేయును. దేహకార్శ్యము, క్షయరోగము, మొదలగు వానికి చేపనూనెకు (Cod liver oil కాడ్ లివరు ఆయిల్) బదులుగా వాడ తగియుండును. (మోతాదు 20 మొదలు 30 చుక్కల చొ॥ ప్రారంభించి 60 చుక్కలవరకు హెచ్చించి యాప్రకారము దిన మునకు మూడుసారు లీయవలెను).

కొబ్బరికల్లు:— ఇది చిక్కగా రుచిగానుండును. చలువ, మేహశాంతిజే యును. జఠరదీప్తి, వీర్యపుష్టి, బలము వీనినిచ్చును. గ్రహణీరోగ మును బోగొట్టును. మూత్రముగావించును. విరేచనముజేయు ను. తీయనికొబ్బరికల్లు మిక్కిలి తాజాపరచును. (Refreshing శ్రమమును బోగొట్టును. స్త్రీలు గర్భవతులుగా నున్నపుడు వారమునకు రెండుమూడుతడవలు పుచ్చుకొనుచుండిన తల్లిదం డ్రులు నల్లనివారైనను కలిగెడు బిడ్డలు తెల్లరంగుగలవారుగా పుట్టుదురు. కొబ్బరికల్లు వాతపైత్యములజేయును. (దీనికి విరు గుళ్లు. కలి నిమ్మకాయలరసము.)

కొబ్బరికాయ:—పచ్చికొబ్బరి కాకజేసి యార్చును. చమురుగలిగి రుచిగానుండును. వాతమును హరించును. వీర్యవృద్ధిజేయును. శ్రమను బోగొట్టును. శోషనణచును. ఎండదెబ్బవలన గలిగిన త్రిప్పను హరించును. పచ్చికొబ్బరి యెండుకొబ్బరికంటె మంచిది. సహజమైన దేహపుకాకకు బలమిచ్చును. దేహపుష్టిజేయును. శరీరమున మంచి ద్రవముల బుట్టించును. శిరస్సునందు కఫమును, ద్వంద్వరోగమును, హరించును. నోటికి సుంగధముదెచ్చును. ముంతగుండె (Heart) యొక్క నీరసమును బోగొట్టును. మూలవ్యాధిని బోగొట్టును. కడుపులో నయ్యెడు వ్రణమును మాన్పును. గురజాలకు (Kidneys) వేడిజేయును. నరములకు సత్తువజేయును. మూత్రము గావించును. మూత్రపుసంచి (Bladder) లోనివాతమును, నొప్పిని హరించును. పంచదారతో తినిన మంచిరక్తమును బుట్టించును. కొబ్బరికోరు (Scrapings) కట్టిన గుదస్థానమందయ్యెడు ఱసికారు పొక్కులు నయమగును. కొబ్బరికోరులో పసపుగుండ కలిపి బుడ్డకు కట్టుగట్టిన దానివాపును, నొప్పిని హరించును. పచ్చికొబ్బరి యధికముగాతినిన నీక్రిందిరోగముల దెచ్చును:— సుద్దపుట్టును. ఆలస్యముగా జీర్ణమగును. గుండెలకు జబ్బుచేయును. గురుత్వము, పైత్యము, శ్లేష్మముజేయును. దగ్గుదెచ్చును. దీనికివిరుగుళ్ళు 1. బియ్యము, 2. కడుగు, 3. పంచదార 4. సముద్రపునురుగు, 5. నిమ్మకాయ, 6. తర్బూజాపండు, కొబ్బరికాల్చి చేసినమసిగాని, కొబ్బరితోతీసిన సారము (extract) గాని పుల్లతేన్పులను కట్టును. జీర్ణముజేయును.

పైదుర్గుణములు, యితరాహారమును భుజించుచు కొబ్బరిని యధికముగా తినువారలకే కలుగునుగాని కేవల నారికేళఫలాహారులకేమాత్రమును కలుగనేరవు.

లేతకొబ్బరికాయ:—రుచిగానుండును. వీర్యపుష్టి, మేహశాంతిజేయును. వాతపైత్యము నడచును. పైత్యము, శ్లేష్మముజేయును. దీనికి

విరుగుళ్ళు కొబ్బరికాయచూడుడు.

కొబ్బరికాయలోనినీరు:—స్వాదుగా మనోహరముగానుండును. త్రిదోషహారమైనది. చలువజేయును. తేలిగానుండును. దాహమణచును. జఠరదీప్తినిచ్చును. పొత్తికడుపును శుభ్రపరచును. వీర్యవృద్ధి, బలముజేయును. మూత్రముగావించును. ప్రసూతివలన గలిగిన కాసరోగము, తరుణజ్వరము, వాతము, పైత్యము, క్రిమిరోగము, వాతపైత్యము, వీనిని హరించును. స్త్రీసంభోగమువలన గలిగిన యాయాసమును బోగొట్టును. స్త్రీలకు ఋతువును బుట్టించును. అనేకరోగములను శాంతింపజేయును; మరియు క్షయరోగులకును, ఉపవాసమున్నప్పుడును, మార్గాయాసమునందును, ప్రసంగము మొదలగు వానియందు నమితసంభాషణముజేసినప్పుడును, యెండకాక చేత సొక్కియున్నప్పుడును, దేహాయాసము నొందియున్నప్పును, వ్యాయామముచేత నలసియున్నప్పుడును, సొలమూరినప్పుడును, నారికేళోదకము మిక్కిలి యనుకూలముగా నుండును. "లేతకాయ'లోని నీళ్ళు వాంతిని కట్టును. వాతపైత్యముల నడచును. క్రిమిని బోగొట్టును. "కొంచెము ముదిరినకాయ"లోని నీరు కఫమును జేయును. వీర్యవృద్ధిజేయును. క్రిమిని చంపును. బలము జేయును. మేహము నడచును. "మిక్కిలి ముదిరినకాయ" నీరు శ్లేష్మమును, దగ్గునుదెచ్చును. చలువ, జలుబు జేయును. దీనికివిరుగుళ్ళు 1. బెల్లము 2. తేనెగలిపిన పిప్పళ్ళచూర్ణము 3. వేడిచేయు ఔషధములు.

కొబ్బరి కురిడి:—ఎండుకొబ్బరి, చమురుగలిగి రుచిగానుండును. పొత్తికడుపును శుభ్రపరచును. వాతమును గొట్టును. దేహపుష్టినిచ్చును. శరీరతత్వమును మార్చును. వీర్యపుష్టి నిచ్చును. నాలుకపూతను బొగొట్టును. క్షయరోగమును హరించును. పైత్యము, గురుత్వము చేయును. దీనికి విరుగుడు బియ్యము.

కొబ్బరికాయలోనిపువ్వు:—అనగా మొక్క మొలచిన కొబ్బరికాయ లోని గుంజు, జిడ్డుగా మధురముగా నుండును. చలువజేయును. రక్తపైత్యము, మేహము వీని నణచును. శ్లేష్మము జేయును. దీనికి విరుగుళ్లు 1. తేనె. 2. చక్కెర.

కొబ్బరిపాలు:—(అనగా కొబ్బరిరుబ్బి తీసిన పాలు) పైత్యము కాక జేయును. రుచిగా నుండును. గురుత్వము చేయును. ఎక్కిళ్లు కఫశూలలు, వాతగుల్మములు, కాస, శ్వాసలు, యుత్కృష్టము లైన దంతరోగములు, నోటి దుర్గంధము వీనిని బోగొట్టును. విదాహము బుట్టించును. వీర్యపుష్టి జేయును.

లేతకొబ్బరికాయపాలు:—మిక్కిలి వృద్ధులకిచ్చిన వారి మూత్రమును పల్చన చేయును. (Dirltic Diluent) పచ్చికొబ్బరికాయ పాలు, చలువ జేయును. తాజాపరచును. అలసట తీర్చును. (Refrigerent) దేహపుష్టి బలము జేయును. మరిడీ జాడ్యము (Cholera) లోని వాంతిని కట్టును. పైత్యము జ్వరములోని వాంతిని కూడా కట్టును.

కొబ్బరియాకు విసనకర్ర:—మనోహరముగా నుండును. దేహపుష్టి నిచ్చును. శ్లేష్మము, రక్తపైత్యము, చెమట, శ్రమ వీని నణచును.

కొబ్బరియాకులోభోజనము:—సౌఖ్యముగా నుండును. అనేక దోషము లనుబోగొట్టును.

కొబ్బరిసారాయి:-(Colombs or Cocoanut liquor) మత్తు జేయును. ద్వంద్వరోగములను, శిరోరోగములను, పిచ్చిని మాన్చును. పుంస్త్వమును హెచ్చించును. హృదయమునకు బలమిచ్చును.

కొబ్బరిసిరకా:—(Cocoanut vinegar) కొబ్బరికల్లుతో చేసినది. కడుపులో పురుగులను చంపును. కడుపును శుభ్రపరచును. జీర్ణశక్తి నిచ్చును.

డాక్టరు లిండ్లహారు (Dr. Lindlahr. M. D.) తన (Natuarl Therapentics vol. III. (Cook Book) Page 286, under the heading of *Nuts.* Writes as follows· "The cocoanut differs from other nuts in that it contains less fats & proteids & more organie salts. The meat of the Coccanut together with its milk comes nearer to the chemical composition of human milk than any food product in existense."

(అర్థము) "నారికేళము" చమురుగల యితర పదార్థములనుండి మిక్కిలి భేదించుచున్నది. దీనియందు క్రొవ్వుపదార్థములు, మాంస కృత్తులు మిగతవానికంటె తక్కువగాను, లవణములు యెక్కువగా నున్నవి. కొబ్బరియును కాయలోని నీరును కలిపి మొత్తముగా చూచినయెడల సృష్టిలోని యితరాహారపదార్థము లన్నిటికంటెను "రాసాయనిక మిశ్రమమున" తల్లిపాలను మిక్కిలి పోలియుండును.

2 వస్త్రము, 3 నివాసము.

ఆహారసమస్య యెప్పుడుతీరినదో యివియు దానితోడనే తీరిపో యినవి. వస్త్రముయొక్క యావశ్యకత నించుక విచారించుదము. చలి గాలినుండి దేహమును గాపాడుటకును, సిగ్గును కప్పుకొనుటకును లౌకి కవ్యవహారములయందు గౌరవార్థముగాను మనము దుస్తుల నుపయో గించు చున్నాము. చలిదేశములు మానవుని స్వాభావికనివాసములు కావు. మానవుని స్వాభావికాహారమగు నారికేళమున కేదేశము నివా సయోగ్యమో, యదియే మానవునికి యోగ్యమగు నివాసము. సూర్య రశ్మి యధికముగా బ్రకాశించుచోటనే సర్వసస్యములు పెరుగును. సూర్యుడు జీవులకు ప్రాణదాతయను సిద్ధాంతము నేడన్నిదేశముల యందును విశ్వసింపబడుచున్నది.

సూర్యకిరణప్రసారములేనిచోట తృణమైనను జీవింపదు కనుక భూమియందు సమస్తమును జీవవంతముగా జేయునది సూర్య భగవానులే. సత్త్వముగలిన సింహము యేనుగు మొదలైన మృగ

ములకును నారికేళ, పనస, మామిడి, మొదలైన ఫలరాజములకును, మఱ్ఱి జువ్వి మొదలైన వృక్షరాజములకును, హంస, కోకిల చక్రవాక, శుక శారిక మొదలైన పక్షులకును నాలవాలమైనవి యుష్ణదేశములేగాని వేరుకావు. మానవునిబోలిన వానరములు యుష్ణదేశములలోనే గాని చలిదేశములయందు గానరావు. స్వాభావికముగా మానవు డుష్ణదేశ వాసిగాని శీతలదేశనివాసి కాడు. సాంఘిక రాజకీయావసరములను గల్పించుకొని ప్రాణదాతయగు సూర్యభగవానులకు దూరమై తనకృత్రిమ యస్వాభావిక మార్గములవలన నివాసయోగ్యముకాని శీతలదేశము లయందు నివసించుచున్నాడు. ప్రాణదాతయగు సూర్యభగవానుడు నారికేళఫలమును పక్వపరిచి మానవునకు శ్రేష్టమగు నాహారముగా నిచ్చినటుల పవిత్రమగు తనకిరణప్రసారముచే వస్త్రమునుగూడ నిర్మించుచున్నాడు. తనకు స్వాభావికాహారమగు యుష్ణదేశమునందు స్వాభావికాహారముమీద జీవించుమానవునియొక్క చర్మము శీతగాలినోర్చుకొన గలిగియుండును. ఓర్చుకొనుటకాదు. శీతగాలియొక్క యావశ్యకతను గూడ గలిగియుండును. అస్వాభావికాహారమున కలవాటుబడుటచేతనే శరీరము, మనస్సు బలహీనమై శీతగాలికోర్వలేక బోవుటచే శరీరము ప్రాణములతోడనే దుస్తులయందు పూడ్చబడుచున్నది.

పరమేశ్వరునిచే సృష్టింపబడిన మానవశరీరమందు కొన్నియవయవములు పవిత్రముగాను కొన్ని యపవిత్రముగాను సృష్టింపబడునా? అందునను సృష్టికాధారభూతమగు జననేంద్రియము లేల యపవిత్రములుగా భావింపవలయును. “పవిత్రభావముగలవానికి లోకమంతయు పవిత్రమే” “నీచభావమే నీచత్వమును వెల్లడిజేయును.” పవిత్రహృదయులగు శుకాది యవధూతలు సిగ్గునెరుగక సర్వమును పవిత్రముగా భావించి దిగంబరులుగా లోకమునందు సంచరించియు గౌరవస్థానము నలంకరించిరి. ఈశ్వరాంశాసంభూతుడగు జీవునకీ యపవిత్రతానీచత్వము లెచ్చటనుండి వచ్చినవి? పురుషునకు జన్మకారణమేది?

శ్రుతి॥ "ఆత్మన ఆకాశస్సంభూతః । ఆకాశాద్వాయుః । వాయో రగ్నిః । అగ్నేరాపః । అద్భ్యః పృథివీ । పృథివ్యా ఓషధయః। ఓషధీభ్యోన్నం । అన్నాత్పురుషః । సవాఏషపురుషోన్నరస మయః ॥

తా॥ ఆత్మనుండి యాకాశము, యాకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని, యందుండి జలము, దానివలన పృథ్వి, అందు నోషధులు, ఓషధులవల్ల నన్నము, అన్నమునుంచి పురుషుడును బుట్టిరి. ఈ పురుషుడు అన్నరసస్వరూపుడు. కనుక నీచత్వాదులు శరీరమునకు స్వాభావికమని చెప్పుటకు వీలులేదు.

శ్రుతి॥ "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అనుటవల్ల నన‌గా సృష్టించి దానియందు తాను (పరమేశ్వరుడు) ప్రవేశించెననుటవలన జీవునికిన్ని చెప్పుటకు వీలులేదు. ఇకనేమన నన్నరసస్వరూపమైన శరీము దైవదత్తమైన స్వాభావికాహారముచేగాక కృత్రిమపద్ధతుల ననుసరించి తయారు చేయబడిన యస్వాభావికాహారమువలన వృద్ధి పొందింపబడుటచే మానవుడు యపవిత్రతను, నీచత్వమును బొందుచున్నాడు. అస్వాభావికముగా జీవించుటచేతనే రాజసతామసోద్రేకములను బొంది పశుధర్మావలంబుడై యింద్రియలోలత్వముచే నీచకార్యములకు లోబడి తనయవయవముల నపవిత్రముగా నెంచి సిగ్గును జెంది తనమానమును గప్పుకొనుచున్నాడు.

1 Mos (Genesis) 2-25. "And they were both (Adam ffi Eve) naked, the manand his wife, and were not ashamed."

ఆదికాండము 2-25. "అప్పుడు వారిద్దరు, అనగా ఆదామును అతని భార్యయును దిగంబరులై ఉండిరి. అయితేవారు సిగ్గుపడలేదు."

2. 16-17. " And the Lord God commanded the man, saying, of every tree of the garden thou mayest freely eat. But of the tree of the knowledge of good and evil, thou shalt not eat of it: for in the day that thou eatest thereof thou shalt surely die."

3. 6 to 12th. verse. "..............................She took of the fruit thereof, and did eat and gave also unto her husband with her; and he did eat. And the eyes of them both were opened, and they knew that they were naked; and they sewed fig leaves to-geather, and made themselves aprous (things to gird about) ....................and they hid themselves from the presence of the Lord God amongst the trees of the garden...............................she gave me of the tree, and I did eat.

2, 16, 17. "మరియు యెహోవా దేవుడు - ఈ తోటలో నున్న ప్రతివృక్షఫలములును తినవచ్చును. అయితే మేలుకీడుల తెలివి వృక్షములను తినరాదు. నీవు వాటిని తినేదినమున చావనే చచ్చెద వని నరునికి ఆజ్ఞాపించెను." — 3,6 మొదలు 12 వచనములవరకు "...............ఆమె దానిఫలములలో కొన్ని తీసుకొని తిని, తనతోవున్న తన పెనిమిటికి నిచ్చెను. అతడు కూడా తినెను. అప్పుడు వారిద్దరికన్నులు తెరువబడెను. అప్పుడు వారు దిగంబరులైవుండుట తెలిసి కొని, అంజూరపుఆకులనుకుట్టి తమకు కచ్చడములను చేసుకొనిరి. ... ..................వారు దేవుని సమ్ముఖమునుంచిదాగిరి. అప్పుడు యెహోవాదేవుడు ఆదామును పిలిచి నీవు యెక్కడఉన్నావనెను. అందుకు అతడు నేను తోటలో నీశబ్దము వినినప్పుడు, దిగంబరినై వున్నాను. కనుక భయపడి దాగి వున్నాననెను. అందుకు ఆయన నీవు దిగంబరివని నీకు తెలిపినవాడు ఎవడు? నీవు తినకూడదని నేను నీకు ఆజ్ఞాపించిన వృక్షఫలములు తిన్నావా? అని పలికెను. అందుకు ఆదాము .........................నేను తిన్నానని పలికెను."

సృష్ట్యాదియందు స్త్రీపురుషులు దిగంబరులుగా నుండిరనియు, వారు సిగ్గునెరుగరనియు, దేవుడుయిచ్చిన స్వాభావికాహారమును వదిలి ఆయన తినవలదనిచెప్పినదానిని కృత్రిమముచే తిని తాము, దిగంబరులమని తెలిసికొని సిగ్గునుచెంది తమ మానమును కప్పుకొని రనియు, వారు దేవునియెదుటకు వెళుటకు సిగ్గును చెందిరనియు అందు

మూలమున వారును, వారిసంతతివారును దైవోపహతులై కష్టపరం పరలలో జిక్కిరనియు పైన నుదహరించినవిధముగా బైబిలుకూడను సాక్ష్యమిచ్చుచున్నది.

స్వాభావికాహారియగు నారికేళభక్షకుడు నీశ్వరునిమీదనే యాధారపడి తన యాహారమును, వస్త్రమును దైవస్వరూపుడగు సూర్యభగవానునిలనుండియే బొందుచున్నాడు. నారికేళఫలాహారి తన పోషణకొరకితరుల నాశ్రయింపవలసిన పనిలేదు. వానికి లౌకికవ్యవహారములేదు. కనుక వ్యావహారిక గౌరవముకొరకు వానికి దుస్తులను ధరించవలసినపని గలుగదు. వానికి వ్యవసాయకులతోగాని, వంటవారితోగాని, సాలీలు కుట్టుపనివారితోగాని భవనములను నిర్మించు శిల్పకారులతోగాని పని గలుగదు. నారికేళభక్షకుడు దిగంబరుడు. వానికి నారికేళవనమే పవిత్రమగు నివాసము. సూర్యభగవానులే వాని యిష్టదైవము. నిరంతరము "ఆత్మవిచారణ" యే వాని వ్యాపారము. మానవుడు తనను తాను మరచుటచేతనే మితాహారవిహారములను విడిచి యమితాహారవిహారుడై యనేకసంకల్ప వికల్పములకులోనై తనజీవితమును రోగభూయిష్టము, దుఃఖవంతము, దురాశాపరత్వము, పరహింసాపరాపవాదనిరతత్వము, పరద్రవ్యపరదారాపహారత్వము మొదలగు లోకసంతాపహేతువులగు దుష్కార్యపరంపరలకు జిక్కి యన్యోన్యపీడాకరులై భూతలనరకములను సృష్టించినారు. సృష్టించుచున్నారు. సృష్టింపనున్నారు. ప్రస్తుతస్థితిగతులలో భూమియందు రాక్షసత్త్వమేగాని, మానవత్త్వము గానరాదు. ఇంక నీశ్వరత్వ మెచ్చటనుండి వచ్చును.

ఆత్మ తనను తాను మరచుటచే కించిజ్జత్వహేయత్వములను బొంది క్రమముగా జీవభావగతుడై భోగాపేక్షచే తనకు ధనాదులు గలుగుగాకయను తీవ్రేచ్ఛవలన కర్మబాహుళ్యమునందు జిక్కి జన్మాదిపరంపరలను బొందుచున్నాడనియు తా నాత్మస్వరూపుడనని తెలిసికొనినయెడల భోగాపేక్ష తొలగి తనస్వాభావిక స్థితిని బొందు

ననియు వేదాంతము లుద్ఘోషించుచున్నవి. అజ్ఞానమువలన ఆత్మ తనను నితరునిగా భావించి జన్మాదిదుఃఖములను బొందుచున్నటులనే మానవుడు తనస్వాభావికాహారమును మరచి కృత్రిమాహారవిధానమునందు పడరానిపాట్లు పడుచున్నాడు. ఎటుల ఆత్మజ్ఞానమువలన జీవుడు జన్మాదిదుఃఖములనుండి తరించునో యటులనె మానవుడు తన శరీరేంద్రియములు స్వాభావికాన్నరసమయములను జ్ఞానమును బొందినయెడల కృత్రిమాహారదుఃఖపరంపరలనుండి తరించుచున్నాడు. ఇట్లు చెప్పుటచే నాత్మజ్ఞానము స్వాభావికాహార జ్ఞానము భేదరూపములుగా నెంచతగదు. ఇదియు నాత్మజ్ఞానమునం దంతర్భూతమే.

ఆత్మ తన యజ్ఞానముచే స్వరూపమును మరచి శరీరపోషణాది కర్మలయందు కృత్రిమమార్గ ప్రవర్తకుడై యస్వాభావికాహార సేవనము వలన శరీరధాతువులు మానసేంద్రియములు విషమమార్గమునుబొంది తన కస్వాధీన మగుటవలన అస్వాభావిక జిహ్వోపస్థాది సుఖలేశంబులకొరకు కర్మబాహుళ్యమున జిక్కి జన్మపరంపరలను బొందుచున్నాడు. ఆత్మ జ్ఞానోదయమైన వెంటనే తనను కృత్రిమమార్గములయందు ద్రిప్పుచుండిన నింద్రియశత్రువులను స్వాభావికాహార సేవనమువలన జయించి లోబరచుకొని కర్మోపరతిని బొంది జన్మాదిదుఃఖపరంపరల నుండి ముక్తుడగుచున్నాడు.

భర్తృహరిసుభాషితం – వైరాగ్యశతకమందు.

శ్లో॥ ఫలం స్వేచ్ఛాలభ్యం ప్రతివనమఖేదం క్షితిరుహాం। పయస్థానే
స్థానేశిశిరమధురం పుణ్యసరితాం। మృదుస్పర్శాశయ్యా సుల
లిత లతాపల్లవమయీ। సహన్తే సంతాపం తదపి ధనినాం
ద్వారికృపణాః॥

ఇందుకు తెలుగుపద్యము.

చ॥ కలవు పచేళిమంబులయి ♦ కానలలోపల పండ్లుమ్రాకులం

గలవు. చివుళ్ల పాన్పులవి ♦ గైకొనసేరక దీనులై ధనా
ఢ్యులుగవనిఁ వసించి నరు ♦ లోలిసహింతురు తీవ్రతాపముల్ ॥

శ్లో॥ ఫలమలమశనాయ స్వాదుపానాయతోయం। క్షితిరపి శయ
నార్థం వాససే వల్కలంచ। నవధనమధుపాన భ్రాన్త సర్వేం
ద్రియాణా। మవినయమనుమన్తుం నోత్సహేదుర్జనానాం॥

చ॥ ఫలములు చాలు జీవికకు, ♦ బానము సేయ జలంబుజాలు, వ
ల్కలములు చాలు గట్టుట, కి ♦ లాతలముల్ శయనింపజాలు, ని
ష్ఫల నవవిత్తశీధురస ♦ పాన విజృంభిత మోహలీన చి
త్తులగు నికృష్ట భూపతుల ♦ దుర్ణయమించుక యుర్ సహింతునే ॥

తా॥ తినుటకు బండ్లును, త్రాగుటకు నీరును, కట్టుటకు నారచీరలును, శయనింప నేలయును మొదలగునవి మాకు జాలును.

శ్లో॥ అశ్నీమహీవయం భిక్షా మాశావాసోవసీమహి। శయీమహి
మహీ పృష్ఠే కుర్వీమహి కిమీశ్వరైః॥

తే॥ చేరి భిక్షాన్నమారగిం ♦ చెదము మేము
కట్టెదము దిక్కులనిరెండి ♦ కలితశాటి
బవ్వళించెద మిలయను ♦ పాన్పుమీద
నేమికార్యము మాకు న♦ రేంద్రులందు॥

తా॥ భిక్షాన్నము భుజింతుము. దిగంబరులుగా నుందుము. నేలబరుందుము. ఐశ్వర్యవంతులతో మాకేమిపనిగలదు.

శ్లో॥ ఏకాకీ నిస్పృహశ్శాంతః పాణిపాత్రో దిగంబరః।
కదాశమ్భో భవిష్యామి కర్మనిర్మూలనక్షమః॥

తా॥ సదాశివా! ఒంటరిని, నిష్కాముడను, శాంతుడను, దిగంబరుడను, అరచేతబిచ్చమెత్తువాడనుగానుండి కర్మలను నిర్మూలము జేయగలవాడ నెన్నటికగుదునో.

శ్లో॥ హింసా శూన్యమయత్న లభ్యమశనం ధాత్రామరుత్కల్పితం।
వ్యాళానాం పశవస్తృణాంకుర భుజస్సృష్టా స్థలీశాయినః।
సంసారార్ణవ లఙ్ఘన క్షమధియాం వృత్తిః కృతాసాన్నృణాం।
యామన్వేషయతాంప్రయాన్తి సతతం సర్వేసమాప్తిం గుణాః॥

తా॥ బ్రహ్మదేవుడు హింసకావింపనక్కరలేక యప్రయత్నముగా జేకురునట్లు గాలిని సర్పములకాహారము గావించెను. పశువులకు నేలపడుకగను, గడ్డిపరకల నాహారముగాను గావించెను. సంసారసముద్రమును దాటజాలు బుద్ధియుండిన నరులకును దగునాహారము నాలాటి దాని జేసియేయున్నాడు. ఆయాహారము జేకొనువారికి రజస్తమోజనిత దోషములెల్ల నశించును.

పైశ్లోకము ప్రత్యేకము స్వాభావికఫలాహారమును గురించియే ప్రవర్తించుచున్నది. అందునను ముఖ్యముగా నారికేళమొక్కటియే మనయాహారమునకుగాను బ్రహ్మదేవునిచే సృష్టింపబడినదనుట స్పష్టము. నారికేళవృక్షమాకాల మీకాలమను నియమములేక సంవత్సరము పొడుగునను పుష్కలముగా ఫలములనిచ్చుచునే యుండును. దీనినిబట్టియే నీఫలము మానవునకాహారముగా నుద్దేశింపబడినటుల స్పష్టము. ఈఫలముయొక్క మానవజాతితప్ప తదితరజాతి జంతువులుపయోగించుకొనకుండునట్లు కూడను సృష్టింపబడినది. దయామయుడగు సర్వేశ్వరుడు మానవుని యాహారము నెంతజాగ్రతగా భద్రపరచియున్నాడో బరీక్షింపుము.

ఆహారమునకు ఫలములు, పానమున కుదకము, కట్టుటకు వల్కలములు లేక దిగంబరత్వము, భూమి పండుకొనుటకు నిట్టిస్వాభావికజీవనమునకు మానవుడు మళ్లినయెడల యనేకావసరములను గల్పించుకొని ధనసంపాదనవిషయమైన క్లేశమున నేల యనుభవింపవలెనే?

నిర్విచారజీవనము మానవకోటికి బ్రసాదింపబడినది.

1 ఆహారము:—నారికేళఫలము.

2 వస్త్రము:—నారికేళపర్ణము లేక దిగంబరత్వము.

3 నివాసము:—నారికేళవనము లేక అందు నారికేళపర్ణములతో వేయుబడిన పర్ణశాల.

ఈసమస్యాత్రియ మీావిధముగా బరిష్కరింపబడినది. ఇప్పుడు కాదు. యుగములకిందటనే ఆర్యులవలన బరిష్కరింపబడి యనుభవింపబడినది. తిరిగి యిప్పుడు మానవకోటికి జ్ఞాపకము చేయుబడుచున్నది.

ఈశ్వరునిచే బ్రసాదింపబడిన నీస్వాభావికజీవన విధానమును నడపుము. అమూల్యమై పవిత్రమైన మీాజ్ఞానమును జిహ్వోపస్థాది కాంక్షలను తృప్తిపరుచుట కుపయోగింపకుము. మీాకాలమంతయు నాత్మవిచారణయందు గడపుడు. మీాజ్ఞానము నాత్మాన్వేషణమున కుపయోగింపుడు. అందువలన మీారు తరించుటయేగాక లోకమునంతను తరింపజేయుదురు. అణిమాది సిద్ధులన్నియు మీాకు సంప్రాప్తముగును. శాపానుగ్రహములు మీాసొత్తగును. దుష్టజనశిక్షణంబును శిష్టజనరక్షణంబును జేసి ధర్మసంస్థాపనకు మీారు సమర్థులగుదురు. ఆహారమైధునములు పశుధర్మములు. అవి మానవునకును స్వాభావికముగా నెటులనో జరిగిపోవుచుండును. ఈస్వల్పమునకు మీాజ్ఞానమును మీాజీవితమును వ్యర్థముగా పాడుజేయకుము. విషయచింతలను విడిచి అన్యచింతలులేని చిత్తముతో నీశ్వరోపాసనమును జేయుడు.

పైనవివరింపబడిన యాహారవిధానమునందు నవుకరులు లేరు. అందరును ప్రభువులే. ఒకరిమీాద నొకరాధారపడి యుండనక్కరలేదు. అందరు నీశ్వరునిమీాద యాధారపడియుండువారె యగుదురు.

సాత్త్వికి, రాజస, తామసాహారములనుగురించి భగవద్గీతలయందు శ్రీకృష్ణభగవానులచే నీవిధముగా నిరూపింపబడియున్నది.

శ్లో॥ ఆయుస్సత్త్వబలారోగ్యసుఖప్రీతివివర్ధనాః। రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్వికప్రియాః ॥గీత౧౭-౮.

తా॥ సత్త్వగుణవంతులు రసయుక్తములైనట్టియు, చమురుతోఁగూడియున్నట్టియు, చిరకాలస్థాయులైనట్టియు, ప్రియములైనట్టియు, ఆయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము, ప్రీతి వీనినివృద్ధిచెందించునట్టి భోజనపదార్థములను నిష్టముతో నంగీకరింతురు.

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥ ౧౭-౯.

తా॥ దుఃఖము, శోకము, రోగము గలుగజేయునట్టియుఁ మిక్కిలి చేదు, ఉప్పు, పులుసు గలసి కారమైన వేడిపదార్థంబుల రజోగుణ ప్రధానులిష్టముతో నంగీకరింతురు.

శ్లో॥ యాతయామం గతరసం పూతిపర్యుషితంచ యత్।
ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియం॥ ౧౭-౧౦.

తా॥ వంటచేసినపిదప జాముకాలమై చల్లారినదియు, సారములేనిదియు దుర్గంధమైనదియు, చద్దియైనదియు, భుజింపగామిగిలినదియు, అపవిత్రమైనదియునగు పదార్థములను తమోగుణవంతులు వాంఛింతురు.

ప్రస్తుతము మనము భుజించు పదార్థమంతయు రాజసతామసకోటిలో జేరుచున్నది. కేవలసాత్త్వికాహారసేవనము జేయువారెవరును లేరని జెప్పినను జెప్పవచ్చును. ఇప్పటికాలమున యోగాభ్యాసముకు జేయుచు ఆహారనియమమును బాటించువారైనను విదాహమును బుట్టించు రాజసకోటిలో జేరిన మధురపదార్థముల నుపయోగించుచున్నారు. పైనసుదహరించిన భగవద్గీతా యుపదేశానుసారముగా మనము సాత్త్వికాహారులమై యుండుట శ్రేయము. సాత్త్వి

కాహారమును వివరించుటలో శ్రీగీతాభిప్రాయమును విమర్శింపుదము.

"ఆయువు, సత్త్వము, బలము, ఆరోగ్యము సుఖప్రీతుల నిచ్చునవియు, చమురుతో గూడియున్నవియు, చిరకాలము నిలువయుండునవియు, హృదయమున కింపును గలిగించునవియునగు పదార్థములు కేవలము "సాత్త్వికములు." పైసాత్త్విక లక్షణములు గలపదార్థము లేవియో విచారించుదము. మనకు ముఖ్యాహారమగు బియ్యము, గోధుములు, పప్పుపదార్థములు శాకములు మొదలైనవి రసయుక్తములుగాని, చమురుగలవిగాని కావు. కృత్రిమమార్గములచేత మార్చిననేగాని వాని వాని స్వాభావికస్థితిలో నాహారముగా నుపయోగపడవు. ఇకను ఫలకోటిలో కొన్ని రసయుక్తములుగా నున్నప్పటికిని, ఆయుస్సత్త్వబలారోగ్యకరములుగాని చమురుతో గూడినవిగాని కావు. చమురుతో గూడియున్న బాదం, చార, వేరుశనగ, జీడిపప్పు మొదలగున వతిపైత్యోద్రేకములుగాన ప్రత్యేకాహారముగా నుపయోగపడవు ఇకను కేవలము సాత్త్విక పదార్థములలో నతిసాత్త్వికమై, రసయుక్తముగానుండి, మనకు సులభముగా జీర్ణమగు చమురు, క్రొవ్వుపదార్థములతో నిండి సజీవియై, చిరకాలస్థాయియై మానవకోటికి "ఆయుస్సత్త్వ బలారోగ్యకరమై మానవులకేగాక దేవతలకును ప్రియమై, భుజించుటతోడనే తుష్టిపుష్టులనిచ్చి శరీరములోని సర్వావయవములను బోషింపగలిగినదై, మానసిక, శారీరకసంబంధమైన బాధవ్యాధుల నడచి· యింద్రియనిగ్రహమును బ్రహ్మచర్యమునందు స్థైర్యమును గలిగించి "దీనతలేని జీవనమును. "అనాయాసమరణము"ల నొసగి జీవుని దేవునిగా జేయులిగినది "దైవస్వరూపమగు నారికేళఫలము" గాక మరియేది? దీనినుద్దేశించియే పైగీతాశ్లోకము బ్రవర్తించుచున్నది.

సాత్త్వికాహారసేవనమువలన శరీరములోని సర్వావయవములును కొద్దిపదార్థములో నెక్కువబలమును అనాయాసముగా బొందుచున్నవి. కృత్రిమ యస్వాభావిక రాజస తామసాహారములవలన శరీరమెక్కువ యాయాసముతో సత్త్వశూన్యములగు పదార్థములను పచనముచేసి త

క్కువబలమును, రోగమును, మానసికవికారములను బొందుచున్నది.

"నారికేళఫలముయొక్క ప్రకృతిశాస్త్రసిద్ధమైన యుత్కృష్టత"

ప్రకృతిశాస్త్రవేత్తలవలన నవీనముగా "రేడియం" అను నొక పదార్థము కనిపెట్టబడినది. ఇది తయారుచేయుటలో ఎక్కువధనము కావలసియుండును. ఒకయౌన్సు రేడియమును తయారుజేయుటకు సుమారు నాలుగుకోట్లరూపాయలును మూడుసంవత్సరముల కాలమున్ను ఖర్చుఅయినది. సెంటుపీటర్సు ర్గులోని యొకపుట్టుగ్రుడ్డియగు పిల్లవానికన్నుల కీ "రేడియం" నుపయోగించినవెంటనే వానికన్నుల కద్భుతముగా చూపుకలిగినది. రేడియంవలన శరీరముయొక్క సర్వావయవములలోని రోగములున్నూ నివారణ కాబడును. ఆయువు వృద్ధియగును. ముసలితనముఃబోయి యౌవనముగలుగును. గ్రుడ్డి, చెవుడు, గూను, కుంటి, మూగమొదలైన వైకల్యములు కుదురును. ఇంక రోగములసంగతి జెప్పనేల. "రేడియం" అను పదార్థమును విరివిగా తయారుచేసి విక్రయించుటకు లండనులో నొకకంపెనీవారివలన యొక యంత్రశాల నిర్మింపబడి పనిజేయుచున్నది. అనేక సుప్రసిద్ధ వైద్యశాస్త్రవేత్తలు తమజ్ఞానమునంతను వినియోగపరిచి రేడియమును తక్కువ కిమ్మతులో తయారుచేయుటకు దీర్ఘాలోచనలు జేయమొదలిడిరి. వీరు సృష్టిలోని పదార్థముల నన్నిటిని బరిశోధించిరి. కాని వీరి కెందును రేడియం చాలినంత దొరుకలేదు. తుదకు వీరు మనపవిత్రమైన "నారికేళము" వైపునకు తమదృష్టి నిగుడించి యాశ్చర్యనిమగ్నులైరి. నారికేళమునందు "రేడియం" అను పదార్థము నిండియున్నది. దానినుండి వీరు రేడియమును తయారుచేసిరి. సుమారొకమాసము దినములలో అయిదు లక్షలరూపాయలతో ఒకఔన్సు రేడియమునువీరు తయారుజేయగలిగిరి. అయినను యిది జనులకందుబాటులో లేదు.దీనినింకను చవుకలో తయారుజేయుటకు విశ్వప్రయత్నములు జరుగుచున్నవి. ఇట్టిస్థితిలో జర్మనుదేశీయుడగు "వాన్ ఎంజిల్ హార్డు" అను నొకప్రకృతిశాస్త్రవేత్త మానవజీవనమున కావశ్యములగు "స్వాభావికాహార, వస్త్ర, నివాసముల నొసగుటయేగాక సర్వరోగహారియగు

రేడియమునుగూడ యేకపదార్థమందు సులభముగా లోకమున కను గ్రహించియున్నాడు. అది యేది? మనపవిత్రమైన "నారికేళఫలమే."

బహుప్రయాసలభ్యమగు కృత్రిమాహార విధానమువలన నేర్పడిన రోగముల కతిప్రయప్రయాసములతో నారికేళమునుండి రేడియము నేలసాధింపవలెను? పవిత్రమగు నారికేళమునే యాహార ముగా స్వీకరించినయెడల బహుతర ప్రయాసగమ్యములగు నాహార వస్త్ర నివాసారోగ్య విధానములన్నియు సులభసాధ్యములై మానవుని యాధ్యాత్మి కాధిభౌతిక శక్తులు విజృంభించును. కనుక ప్రపంచమందు రోగులను బాగుజేయుటకు <u>రేడియం</u> యంత్రశాలల నెలకొల్పుట కంటె నారికేళవనముల నభివృద్ధిపరచి ప్రజలను నారికేళఫలాహారు లుగా మార్చినయెడల ప్రజలలోని దారిద్ర్యము, రోగము, హింస, వ్యభిచారము, అన్యదేశాక్రమణము, యుద్ధము మొదలగు ప్రజాపీడా కరములగు విషయములన్నియు మాయమై పోవును.

నారికేళము నాహారముగా స్వీకరింపుడు. ప్రకృతిచే సమర్ప బడిన మీలోపలి యంత్రశాల వ్యయప్రయాసలులేక నే "రేడియం"ను తయారుచేసి మీశరీరముల నాపాదమస్తకము నింపును.

## ప్రకృతిశాస్త్ర పరిశోధనము.

### శరీరమున కెట్టియాహారము కావలయును?

మనయాహారవిధానమునందు 1 నత్రజనముతో (నైట్రజన్) కూడిన ప్రొటీన్సు (మాంసకృత్తులు) 2 నత్రజనములేని కర్బను హైడ్రజనములు (అనగా పిండిపదార్థములు. ఉదాహరణ, బియ్యము, చక్కెర) 3 క్రొవ్వుపదార్థములును ముఖ్యములై యున్నవి. అందు నత్రజనముతోగూడిన ప్రొటీన్సు అనుద్రవ్యము మానవుని శరీరపోషణ కనవసరమను విషయమును గురించి లామన్, బర్చరుబర్నరు, పీట ర్సన్, రబ్నరు, యూంగవీటన్, మొదలైన శాస్త్రవేత్తలచే నిర్ధారణ చేయబడినది. బాగుగా పెరిగినమనుష్యుడు తానాహారములో పుచ్చు

కొనెడి నత్రిజనమునంతయు నారోజునగాని మరునాడుగాని బయటకు వదలివేయును. అట్లు వదిలివేయుటవలన శరీరపోషణకు నత్రిజన మనావశ్యక మనుసంగతి బాగుగా ఋజువగుచున్నది. అది శరీరమునకు విష రూపముగా నుండుటవలననే శరీరము దానిని వెంటనే బయటకు త్రోసివేయుచున్నది. మనము భుజించు నత్రిజనోపేతములైన మాంస కృత్తుల (ప్రొటీన్సు) నుంచి స్వల్పముగు క్రొవ్వును చక్కెరను వేరుపరచి స్వీకరించుచున్నది.

స్వల్పమైన క్రొవ్వు, చక్కెరకొరకు నత్రిజనోపేతములైన మాంసకృత్తులను పచనముచేయుభారమును శరీరమున కిచ్చుటకంటె కేవలము నత్రిజనములేని క్రొవ్వు చక్కెరగలపదార్థమును పుచ్చు కొనుటయే వేయిమడుంగులు శ్రేష్ఠముగానుండును. ఇందువన శరీరల మునకు వ్యర్థమగు ప్రయాసములేకుండ జేయవచ్చును. అయితే వృద్ధిపొందవలసిన పసిబిడ్డకు నవయవములు పెరుగుటకు ప్రొటీన్సు (మాంసకృత్తులు) యవసరము. కాని యవయవములు పూర్తిగాబెరి గిన మానవుని శరీరపోషణ కనావశ్యకము.

బిడ్డయొక్క యవయవనిర్మాణమునకు తల్లిపాలయందుండెడి పదార్థముల ప్రమాణము.

| | | |
|---|---|---|
| మాంసకృత్తులు (ప్రొటీన్సు) | 1 6 | 1 |
| క్రొవ్వు | 3 4 | 2 |
| కర్బను హైడ్రజములు లేక పిండిపదార్థములు | 6.1 | 4 |

అనగా 1: 2: 4 వ్యత్యాసమును గలిగియున్నవి.

క్రొవ్వు 1 భాగము = పిండిపదార్థములు 2 భాగములకు సమానము. అనగా క్రొవ్వు కర్బనుహైడ్రజములకు రెట్టింపు వేడి నిచ్చును.

మాంసకృత్తులు 1 భాగము = హైడ్రొకార్బరేట్సు (2×2+4) = 8 అనగా ప్రొటీన్సు 1 భాగము క్రొవ్వు పిండిపదార్థములు 8 భాగములకు సమానము.

పసిబిడ్డకు 8 భాగములు హైడ్రోకార్బొరేట్సుకు 1 భాగము మాంసకృత్తులు సరిపోవునెడల బిడ్డపెరిగినకొలదియు మాంసకృత్తుల భాగము తగ్గుచు అవయవములు పూర్తిగా నెదిగినతరువాత శరీరపోషణకు మాంసకృత్తు లనావశ్యకమవును. కావలసియున్నను బహుస్వల్పము. అనగా మాంసకృత్తులు శరీరనిర్మాణమునకును, యెదుగుటకును కావలసియుండును. అవయవములు కొంత యీడువరకును పెరుగును. కనుక పెరుగుట కుపయోగించెడి యాహార మావశ్యకము. పిమ్మట నవయవములెదుగవు. వానిని కాపాడుటకు అనగా పోషించుట కాహారము కావలయునుగాని పెంచుటకు కాదు. ఎట్లులనగా?

ఇనుముతో చేయబడిన యంత్రమును, వేడియెక్కుట, రాపిడి, తుప్పు మొదలైన వానినుంచి కాపాడుటకు యినుము నుపయోగింపబడక చమురు నుపయోగించి కాపాడుచున్నటుల నత్రజనోపేతములగు మాంసకృత్తులవలన తయారుచేయబడిన మానవుని యవయవనిర్మాణయంత్రము నైట్రజనుసంబంధమైన పదార్థమువలన పోషింపబడదు.

శరీరపోషణకు క్రొవ్వు, కర్బనుహైద్రజములలో నెద్ది యావశ్యకము?

మనశరీరమును బరిశుద్ధపరచుటకును, అత్యుష్ణము, అవయవములరాపిడి మొదలగు వానినుండి కాపాడుటకును క్రొవ్వుపదార్థ మెక్కువ యావశ్యకమను విషయమును మనమునందుంచుకొనిన యెడల నీవిషయమును సులభముగా బరిష్కరింపవచ్చును.

కర్బనుహైద్రజములు లేక పిండిపదార్థములు } ఉ॥ బియ్యము, చక్కెర.

ఇవి శరీరమునకు ముఖ్యావసరములుకావు. ఎందువలన ననగా—

1 శరీరము మనము భుజించు అన్నము (పిండిపదార్థములను) చక్కెరగా మార్చును.

2, శరీర మేవిధమున జూచినను ప్రత్యేకముగా చక్కెరను కోరదు. విషముగా జూచును. అది క్రొవ్వును జీర్ణింపజేసికొను నటుల చక్కెరను జీర్ణింపజేసికొనలేదు. కనుక శరీరము తనశక్తిలో నెక్కువభాగమును మనముభుజించు నాహారమును చక్కెరగా మార్చి యందుండి క్రొవ్వుపదార్థమును తయారుచేసికొనుట కుపయోగించును. కనుక-

మనమేల క్రొవ్వుపదార్థము నాహారముగా నుపయోగింపకూడదు? శరీరము తనకు కావలసిన క్రొవ్వుపదార్థమును తయారుచేసికొనుట కధికశ్రమమును గలిగించెడి యాహారమును మనమేల యుపయోగింపవలెను? కొద్ది ప్రయత్నప్రయాసములతో నెక్కువ ప్రయోజనమును గలిగించెడి యాహారమును శరీరము గోరును. ఇట్టి స్థితిలో శరీరమున కావశ్యకమగు క్రొవ్వుపదార్థమును తయారుచేసికొనుట కధికప్రయాసమును గలిగించునదియు క్రొవ్వుపదార్థమువలన గలిగెడి శక్తిలో సగముకంటె తక్కువశక్తి నిచ్చునదియు పచనము చేయుటకు క్రొవ్వుపదార్థముకంటెను రెట్టింపు టాయాసమును గలుగజేయునదియు నగుపదార్థమును మనమేల యాహారముగా నుపయోగింపవలయును?

కాబట్టి మాంసకృత్తులు (ప్రొటీన్సు) వలెనే పిండిపదార్థములును (కర్బనుహైడ్రజములు) ఆహారయోగ్యములు కావు. రక్తమునం దుష్ణమును గలిగించుటకు కొంచెముగా చక్కెర కావలసియున్నది. చక్కెరను ప్రత్యేకముగా నాహారపదార్థములలో తినుటచేత హానిగలుగును. అది రక్తమును పాడుజేయును. చక్కెరలో కొంతభాగము "గ్లికోజన్" అను నొకపదార్థముగా మార్చబడి యవసరము గలిగినప్పుడు శరీర ముపయోగించుటకుగాను నిలువయుంచబడును. మిగతా భాగము క్రొవ్వుపదార్థముగా మార్చబడును. ప్రత్యేకము క్రొవ్వుపదార్థమే యాహారముగా నివ్వబడినయెడల శరీర మనాయాసముగా నెట్టిమార్పును గలిగించ నవసరములేకనే యాక్రొవ్వుపదార్థమును శేం

టనే యుపయోగించుకొని కణములమధ్య (Cells) నిలువయుంచు కొనును. కనుక క్రొవ్వు శరీరమునకు వ్యతిరేకముగాని పోషక పదార్థము.

ఈవిధముగా క్రొవ్వుపదార్థము నరములకు బుష్టినిచ్చును. మాంసకృత్తులు, కర్బనుహైడ్రొజనులు, రక్తమునకును, కణసంహాతులకును (Tissues) బుష్టినిచ్చును. కనుక మాంసము, రొట్టె, పప్పు మొదలైన యాహారములను బుచ్చుకొనువారు "మనము కోరుచున్నను శరీరము బలహీనముగా నున్నదని" నుడువుటకు కారణమైనది. వారు నరములకు సరియైన బుష్టినొసంగుట లేదు. అట్టివారు శరీరమునకు బానిసలై యుందురు. ఇంద్రియములు వారికి వశపడవు. వారి బలమంతయు భుజించు నాహారము నధికముగా బచనముచేయుటకు వ్యర్థముగా బాడుచేయుబడుచున్నది. వారు తమజీర్ణకోశము, శ్వాసకోశములు, నరములు, చర్మము మొదలైన యవయవముల కనుదినము నధికయొత్తిడిని గలిగించుచున్నారు. అయితే క్రొవ్వుపదార్థమును భుజించువారు తమశరీరమందు—

1 ఏమార్పును జేయనక్కరలేక నే క్రొవ్వుపదార్థమును నిలువయుంచుకొన గలుగుచున్నారు.

2 తగినంత వేడిమిని గలిగియుంచుటవల్ల శరీరమున కెక్కువ బలదాయకమగు నిధిని జేర్చుచున్నారు.

3 ఆల్బుమెన్ (మాంసకృత్తులు) మొదలైన వస్తువులను విభజించి యందుండి నైట్రొజను సంబంధమైన పదార్థములను విసర్జింపజేయు నావశ్యకమును గలిగింపదు

4 తనయందు ప్రాణవాయువును, జలమును మిక్కిలి తక్కువగా గలిగియుండుటచేత ప్రాణవాయువును పొగొట్టుకొనుటకు వలయు మార్పును బొందనవసరములేదు.

5 నరములలోనికి తిన్నగా బ్రవేశించి వాటికి బలము నొసంగును.

6 దగ్ధము నొందదగిన కార్బను (బొగ్గుపదార్థమును) నేగాక హైడ్రిజనునుగూడ నెక్కువగా గలిగియున్నది.

ఇందు చివరను చెప్పబడిన క్రొవ్వుయొక్క గుణము మిక్కిలి ముఖ్యమైనది. మాంసకృత్తులయందు నైట్రిజను యెక్కువగా నుండుటవలన పైత్యోద్రేకము, మత్తు, బుద్ధిమాంద్యము ను గలిగించును. క్రొవ్వుపదార్థముునందు నైట్రిజను లేకపోవుటవలన సమశీతోష్ణము గలిగి శరీరము తేలికగాను, బుద్ధి చురుకుగా నుండును. దానియందలి హైద్రిజనము దగ్ధమగుటవలన యత్యధికమగు శారీరక మానసిక శక్తులు విజృంభించును.

మానవునియందుండెడి యాధ్యాత్మికశక్తుల నుద్బోధించి స్వాతంత్ర్యశక్తిని, స్థైర్యమును, నాత్మవిశ్వాసమును గలిగించుటకు హైద్రిజనము ముఖ్యావసరము. ఎక్కువగా బియ్యము, గోధుమ మొదలైన పిండిపదార్థములను భుజించువారు తమ యాహారవిధానమునందు దగ్ధముకాదగిన హైద్రిజనము లేకపోవుటవలననే వారియందు స్వాతంత్ర్యాభిలాషయు, నాత్మవిశ్వాసమును గానవచ్చుటలేదు.

మనశరీరమును బోషించుటకును, నాధ్యాత్మికశక్తులను విజృంభింపజేయుటకును, సరియైన యుష్ణము నొసంగుటకును, అవయవచలనమును గలిగించుటకును క్రొవ్వుపదార్థమే శ్రేష్ఠమైనదని ఋజువగుచున్నది. వేయేల క్రొవ్వు, చమురుపదార్థములు, మాంసకృత్తులు (ఆల్బుమెన్) కర్బనుహైద్రిజములు (పిండిపదార్థములు) కంటె వేయిమడుంగులధిక ప్రయోజనము గలిగినవియై యున్నవి. సృష్టిలోని యేపదార్థమును దీనితో సరిపోలనేరదు. ఆచరణమునందు మన యాహారవిధాన మెట్లుండవలయును ? దీనికి సమాధానము సులభమే.

1 మాంసకృత్తులు (ప్రొటీన్సు లేక ఆల్బ్యుమెన్) గల యే యాహారమును మనము భుజింపగూడదు, మాంసకృత్తులెక్కువగా కలిగియున్నటువంటి పప్పులు, మాంసము, గుడ్లు, పాలు, సీమబాదంకాయలు మొదలైనవి మనకాహారయోగ్యములు కావు. శరీరమునకెక్కువగా నివ్వబడిన నేమాత్రము మాంసకృత్తులైనను విషతుల్యముగా నుండును. కనుక మాంసకృత్తు లెక్కువగా గలిగియుండెడి యెట్టియాహారమైనను మనశరీరములకు విషతుల్యము.

2 మనము పిండిపదార్థములనుగాని, చక్కెరను గలిగియుండెడి మధురపదార్థములనుగాని భుజింపగూడదు. కాయధాన్యములు, దుంపలు, కూరగాయలు, దాడిమ, నారింజమొదలైన పుల్లనిఫలములు, మధురఫలములు మొదలైనవానినుండి వచ్చు పిండి, చక్కెరగాని, లేక ప్రత్యేకముగా నుపయోగింపబడిన చక్కెరగాని శరీరమునకు విషతుల్యము. కర్బనుహైద్రిజములు (పిండి, చక్కెర) విషతుల్యములు. కనుక సాధారణముగా మనముపయోగించెడి పదార్థములన్నియు రక్తమును పాడుచేసి శరీరమున కనేకరుగ్మతలను గలిగించుచున్నవి. కాబట్టి—

3 మనము క్రొవ్వుపదార్థము నెక్కువగాను, మాంసకృత్తులు, పిండి చక్కెరలను తక్కువగాను గలిగియుండెడి యాహారపదార్థములను మాత్రమే భుజింపవలెను.

ఇట్టి పదార్థమేది?

మాంసము, పాలు:—క్రొవ్వుపదార్థము నెక్కువగా కలిగియున్నను మాంసకృత్తుల నధికముగా కలిగియున్నవి.

వేరుశనగ, బాదం, చారం, జీడిమామిడి, నువ్వు మొదలైనవి. క్రొవ్వుపదార్థము నెక్కువగా కలిగియున్నను మాంసకృత్తుల నత్యధికముగా కలిగియుండుటవలన నాహారయోగ్యములు కావు.

ప్రకృతిశాస్త్రవేత్త లనేకులచే బహుజాగరూకతతో బరీక్షింపబడి పదార్థసముదాయములో నెల్ల "నారికేళఫలము" మాంసకృత్తులు, పిండి, చక్కెర భాగములను తక్కువగా కలిగి శరీరమున కావశ్యకమగు క్రొవ్వుపదార్థముతో నిండినదియై మానవున కాహారయోగ్యముగా కనుగొనబడినది.

నారికేళమునందుండెడి పదార్థములు వివరణము.

నూరు వంతులలో

| | |
|---|---|
| మాంసకృత్తులు (Protieds) | 6·6 |
| క్రొవ్వుపదార్థములు (Fats) | 56·2 |
| పిండిపదార్థములు (Carbon Hydrates) | 13·7 |
| లవణములు (Mineral salts) | 1·6 |
| పిప్పి (Crude Fibre) | 8·9 |
| నీరు(Water) | 13·0 |
| | 100·0 |

నారికేళ ఫలాహారము - అభ్యాసము.

మన మనాదినుండియు కృత్రిమాహారావలంబులమై యున్నాము. కనుక దీనిని క్రమముగా నభ్యసించుట శ్రేయము. కొబ్బరిని తినినయెడల కొందరికి దగ్గువచ్చును; అధికమైన వేడిజేయును; అజీర్ణమును గలుగజేయును. ఇది బహుమంది కనుభవము. కొందరికి కొబ్బరి శరీరమునకు బొత్తిగా సరిపడదు. ఇట్టివారీయాహారము విషయమై తప్పక వ్యతిరేకాభిప్రాయులై యుందురు. కాని కొబ్బరియందుండెడి గుణములను బరీక్షించి చక్కగా విమర్శించినచో వీరి కీయభిప్రాయము దూరమగును.

కొబ్బరి ముఖ్యముగా "ఊపిరితిత్తులను" (Lungs) బాగు చేయును. దగ్గు యూపిరితిత్తులలోబుట్టును. ఊపిరితిత్తులయం దెట్టి వ్యత్యాస మున్నను వానిని సమరసపరచి చెడుపదార్థములను బయటకు నెట్టి వేయును. అందువలననే కొబ్బరి తినుటతోడనే మనకు దగ్గు వచ్చుచున్నది.

ఈచిహ్న మగుపడుటవలననే యూపిరితిత్తులలో నుండెడి రోగ మును (కల్లె మొదలగువానిరూపముగా) బయటకునెట్టి వానిని బరిశుద్ధి పరచుచున్నటుల మనకు స్పష్టముగా దెలియుచున్నది. దగ్గువచ్చుట వలన యూపిరితిత్తులు బాగుచేయబడుచుండినటుల తెలిసికొనవల యును. ప్రథమములో వేడిచేయును. కాని వారమురోజులలో సరి పోవును. ఇతరాహారమును భుజించుచు కొబ్బరిని ఫలాహారముగా బుచ్చుకొనినయెడల నజీర్ణమును గలుగజేయును. కాని ప్రత్యేకాహార ముగా బుచ్చుకొనినయెడల శరీరమునందుండు సర్వరోగములను హరించి రక్తమును బరిశుభ్రపరచి సర్వావయవములకును బుష్టినొ సంగును. కనుక నారికేళాహారము నభ్యసించువా రీక్రిందివిధుల ననుసరింపవలెను.

౧ కొబ్బరి శరీరమునకు పడనివారును, కొబ్బరియం దయిష్టము గలవారును క్రమాభ్యాసమును జేయవలయును.

1 వారుభుజించు నాహారములో నిత్యమును తురిమినకొబ్బరి నన్నివిధములైన కూరలలోను కలిపి యుపయోగించవలయును.

2 కొబ్బరితురుమును పప్పులోవేసి వండి యుపయోగించ వచ్చును.

౩ పెరుగులో వేసి పచ్చడి చేయవచ్చును.

4 అన్నివిధములైన పిండివంటలలోను కొబ్బరి నుపయోగించ వచ్చును.

5 నిత్యమును నారికేళమును నీశ్వరునకు నివేదించి భోజనములో నొకభాగముగా నుపయోగపరచుటవలన శరీరమునకు పడని వారికి క్రమముగా సరిపడును.

ఇటు లారుమాసము లభ్యాసమైన తరువాతను రాత్రిపూట భోజనమును మాని కొబ్బరిని రాత్రిభోజనముగా నుపయోగింపవలెను. అవసరమైనయెడల రెండుమూడుఅరటిపండ్లను కూడ నుపయోగింప వచ్చును కాని ఏయితరపదార్థము నుపయోగింపకూడదు. ఇటుల మూడుమాసము లభ్యసించవలయును. అటుపిమ్మట రెండవపూట కూడను కొబ్బరిని పుచ్చుకొనవలయును. ఈవిధానమునందు రెండు పూటల భోజనమునే యభ్యసించవలయును. పగలు 10 లేక 11 గంటలకును రాత్రి 7, 8 గంటలకును రెండుపర్యాయము లాహారమును భుజించవలయును. అవసరమగునెడల మధ్యాహ్నభోజనమునందు 3, 4 అరటిపండ్ల నుపయోగించవచ్చును. ఇటుల రెండుమాసము లభ్యాసమైన తరువాతను అరటిపళ్లనుగూడను క్రమముగా తగ్గించవచ్చును. ఈవిధముగా నొకసంవత్సరములో కేవల నారికేళాహారము మీాదనే జీవించవచ్చును.

౨ కొబ్బరి నప్పుడప్పు డుపయోగించుట పరిచితను కలిగియుండిన వారు ప్రారంభములోనే రెండవపూట భోజనమును మాని కొబ్బరి నుపయోగించవచ్చును. మూడు మాసములైన తరువాత రెండవపూట భోజనమును మాని కొబ్బరినే యుపయోగించవచ్చును.

3 నివృత్తి నిష్టగలిగి ధీరులుగా నుండువారీక్రిందివిధమున నభ్యసించవచ్చును

ఒకపగలును యొకరాత్రియు నెట్టియాహారమును బుచ్చుకొనక యుపవసింపవలెను. అవసరమైనయెడల జలభక్షణము జేయవచ్చును. మరునటిదినము రెండుజాములవరకును వారి వారి సాధన భజనలయందు కాలమును గడిపినపిమ్మట నారికేళమును బూజించి

భగవానునకు సమర్పింపవలెను. తదనంతరము యీశ్వరప్రసాదమును సేవించవలయును. ఆరోజునంతటితో విరమించి యవసరమైనయెడల జలములతో గడుపును నింపవలయును. మూడవరోజునుండియు రెండు పూటలును నీశ్వరసమర్పణానంతరము నారికేళప్రసాదమును సేవించ వచ్చును. క్రమక్రమముగా రెండుపూటలుమాని యొంటిపూట యభ్యసించవచ్చును.

అభ్యాసకులు ముఖ్యముగా గమనించవలసిన విషయములు.

1. అభ్యాసకాలమందు దగ్గు కనుపడును.

2. విశారముగా నుండును.

3. కొందరికి 15, 20 రోజులవరకు వాంతులు వెళ్లును.

4. ఆమ విరేచనములు, నీళ్లవిరేచనములు వెళ్లును.

5. ఎక్కువమందికి విరేచనబద్ధకము జేయును.

6. సుమారు 1, 2 నెలలవరకును శరీరము బలహీనముగా నుండును.

7. తలనొప్పి, కడుపునొప్పి మొదలైనవి కలుగును.

8. కన్నులు మెరబడును.

9. మూత్రము 1, 2 వారములవరకు నెర్రగా వెళ్లును.

10. జ్వరము తగులును.

ప్రతివానికిని పైగుణములన్నియు కనుపడవు. వారి వారి శరీరతత్వముల ననుసరించి యొకటి రెండు గుణములు గలుగును. ఒకదాని తరువాత నొకటిగా నాలుగైదు గుణములు వరుసను గనుబ డుటయు గలదు. కాని వీనికి భయపడి యభ్యాసమును మానదగదు. పట్టుదలతో నభ్యసించుచుండిన యెడల క్రమక్రమముగా నన్ని యును బోయి శరీరము పరిశుద్ధమగును. సంపూర్ణారోగ్యముగల

వాని కే గుణమును కనుపడదు. శరీరమందు లోగడజీరించిన లేక సంస్కారముగానుండిన గుణములను బయటవేసి శరీరమును శుద్ధిజేయును. కాయశుద్ధి జేయుటలో "నారికేళ "మమూల్యమైనది. "నారికేళయోగ" మను పేరుతో నొకయోగమార్గేయసాంప్రదాయసిద్ధమైన యోగసాధనలయందు గలదు. నారికేళము నాహారముగాను అందుండెడి జలమును పానీయముగాను సేవించుచు యోగము నభ్యసించినయెడల నితరసాధనలన్నిటికంటెను నీయోగము శీఘ్రముగా సిద్ధిని గలిగించును. దీనికి "నారికేళయోగ" మని ప్రసిద్ధిగలదు. ఈయోగ మతిపవిత్రమైనది. నారికేళాహారము కాయసిద్ధినేగాక మన యాధ్యాత్మికశక్తులను గూడను విజృంభింపజేయును. కనుక అభ్యాసకులు పైశరీరతాపాదులకు భయపడనక్కర లేదు. ఈశరీరతాపములన్నియు తా మిదివరకలవాటు పడిన కృత్రిమాహారఫలితములు గాని పవిత్రమగు నారికేళఫలాహార ఫలితములుకావు. కృత్రిమాహారవిధానము శరీరమందు కూడబెట్టిన చెడుపదార్థమునంతను స్వాభావికాహారమైన నారికేళము బలాత్కారముగా బయటకు నెట్టివేయునప్పుడు గలిగెడి సంఘర్షణమువలననే శరీరతాపములు గలుగుచున్నవి. కాబట్టి సాధకులు నిర్భయముగా వీని నెదుర్కొని తమశరీరములను బాహ్యాంతరింద్రియములను బరిశుద్ధపరచుకొందురు గాక.

## ఆహార విధానము.

1. నారికేళములు బాగుగా పెరిగినవిగా నుండవలయును.

2. వృక్షమున పక్వమై క్రిందరాలిన లేక రాలుటకు సిద్ధముగానుండిన నారికేళములనే సాధ్యమైనంతవర కుపయోగించవలెను.

3. కొబ్బరిని చిన్నముక్కలుగాజేసి యుమ్మినీటితో కలియునటుల బాగుగా నమలవలయును. ముక్కలు నమలుటకు కష్టముగానుండువారు తురిమి యుపయోగింపవచ్చును.

4. నారికేళములోని జలమును తప్పక పుచ్చుకొనవలయును. అప్పుడప్పుడు గంగాబొండములోని జలము నుపయోగించిన హృద్యముగా నుండును. నారికేళమును కొట్టినతోడనే జలమును బుచ్చుకొనవలయును. కాని నిలువయుంచి పుచ్చుకొనగూడదు.

5. చక్కెర నేమాత్రము నుపయోగించకూడదు.

6. ప్రారంభములో నితరఫలముల నుపయోగించినను క్రమక్రమముగా మానవలయును.

7. శరీరతాపములు (జ్వరము మొదలైనవి) కలిగినపుడు లేతకొబ్బరికాయలోని నీరును త్రాగి అందుండెడి మీగడవంటి లేతకొబ్బరిని తినవలయును. ఇది బహుసులభముగా జీర్ణమగును. లఘ్వాహారమని పాలు, జావ మొదలైన యితరపదార్థములను బుచ్చుకొనగూడదు.

8. అభ్యాసమునందు గలిగెడి శరీరతాపములకు మందుల నుపయోగించకూడదు. క్రమముగా దానంతనదియే గుణమునిచ్చును. ఆహారమునందయిష్టముగలిగినయెడల లేతకొబ్బరినీటిని మాత్రము పుచ్చుకొనవలయును. కాని కలవరపడి మందులనుగాని యితర లఘ్వాహారములనుగాని యుపయోగించకూడదు. ఇట్టి సందర్భములలో శరీరతత్త్వములకును వారి వారి స్వభావములకును తగినటువంటి మార్పులను నాయాస్థితిగతుల ననుసరించి చేసికొనవలయును.

9. ఆత్మనిశ్చయముతో దీక్షను వహించి యొకసంవత్సరమభ్యాసము నడిపినయెడల సాధకులకే నారికేళాహారవిధానము యొక్క శ్రేష్ఠత్వము వెల్లడికాగలదు.

10. ఈవిధానమంతయు స్వానుభవముమీద చెప్పినది కాని యుక్తులవలన సాధించి చెప్పినదికాదు. సుమారెనిమిది సంవత్సరముల నుండియు నాహారవిధానమునందనేక మార్పులనుజేసి సాధనజేయుచు

తుదకు స్వాభావికాహారములలో శ్రేష్ఠమైనది నారికేళముగా ననుభవ. మువిూద వెల్లడిజేయబడినది.

నారికేళము సర్వరోగములను కుదుర్చును. కనుక రోగుల కైనను నారికేళము నౌషధముగాను నాహారముగాను నొసగుడు. ఆరుమాసములలోపల సర్వరోగములు ఆశ్చర్యముగా కుదురును. పిమ్మట యిష్టముండినయెడల నారికేళాహారమును సాగించపచ్చును. లేకున్న కృత్రిమాహారమునకు మరలవచ్చును. నారికేళము నాహారముగా స్వీకరించునప్పు డితరాహారములను పూర్తిగా వర్జింపవలయును. బాల్యమునుండియు నారికేళాహారము విూద జీవించినవారికి దంతములు గట్టిపడి మరణపర్యంతము నిలిచియుండునుగాని యూడిపోవు. అట్టి వారికి చెవుకుగుడ్డి మొదలైన యింద్రియవైకల్యములు గలుగవు.

తల్లిపాలులేని పిల్లలకు ఆవుపాలను డబ్బీపాలను వాడకుడు. పశుక్షీరములు పశుధర్మములను బెంచును. బిడ్డలకు రోగులకు నారికేళక్షీరముల నుపయోగింపుడు. (కొబ్బరిని, కొబ్బరికాయలోని నీరును చేర్చి బాగుగా రుబ్బి అందుండి పాలను పిండుకొని ఆపాలు తల్లిపాల వలె నుండునట్లు స్వచ్ఛమైనజలమును జేర్చి యుపయోగింపవలయును.) కొందరి తల్లులపాలైనను చిక్కగానుండి బిడ్డలయొక్క యారోగ్యమును పాడుజేయునుగాని నారికేళక్షీరములు బహుసులభముగా జీర్ణమై బిడ్డలను పుష్టిగలవారినిగాను నారోగ్యవంతులనుగాను జేయును. బాల్యమునుండియు నారికేళక్షీరములతోను ఫలాహారముతోను పెరిగిన బిడ్డలకు ధర్మబోధ యనవసరము. వారియింద్రియములు శుద్ధియై స్వాభావికముగా ధర్మబోధానుష్ఠానమును గలిగియుండును.

"నీవు జీవన్ముక్తసుఖమును బొందవలయుననిన నారికేళమును భక్షింపుము. నారికేళవనసంచారమును జేయుము. దిగంబరుడవగుము."

మనముపయోగించు పదార్థములలో కొన్ని రక్తమాంసరూపముగా శరీరమును బోషించునవిగాను, కొన్ని మలినపదార్థములను కరగించి బయటకు త్రోసివేయునవిగాను నున్నవి. అయితే నారికేళమునం దీరెండును జేరియున్నవి.

"కొబ్బరి శరీరమును బోషించునదిగాను" (Upbuilding property) "కొబ్బరినీరు మలినములను గరగించునదిగాను" (Dissolving property) నున్నవి.

ఈరెండును శరీరమున కారోగ్యమును, బలమును గలుగజేయును. ఈరెండు పదార్థములను పూర్తిగ గలిగియున్నదియే మానవునకు సంపూర్ణమైన స్వాభావికాహారము.

"స్వాభావికాహారావలంబులై మానవులు విచారములేని జీవనమును జరిపి యనాయాసమరణమును బొందుదురుగాక.

శ్లో॥ "అనాయాసేన మరణం వినా దైన్యేనజీవనం।
అనారాధితగోవింద చరణస్య కుతోభవేత్"॥

జ్ఞానముచేతను, వైరాగ్యముచేతను గాకపోయినను ప్రస్తుతకాలమున దేశముయొక్క దుస్థితిని స్మరించుకొనియైనను బ్రాహ్మణులు "స్వాభావికాహారసేవనము"చే వ్యవహారమునుండి విరమించి సనాతనమగు తమ యార్షేయసాంప్రదాయావలంబులై లోకోపకారముగా బ్రవర్తింపుదురుగాక

---

## ౪౭ “సద్గురు సేవ.”

శ్రుతి॥ ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్య వరాన్నిబోధత క్షురస్యధారా నిశితా
దురత్యయా దుర్గం పథస్తత్కవయోవదన్తి॥

కఠోపనిషత్ ౩-౧౪॥

తా॥ విద్వాంసులు ఆత్మతత్త్వమును సానపెట్టబడిన మంగలకత్తి యొక్క వాడిమివలె పొందనలవికాదని చెప్పుచున్నారు. కనుక అనాద్యవిద్యాప్రసుప్తులగు ఓజనులారా మీరులేచి యజ్ఞాననిద్రనుండి మేల్కొని సద్గురువులనుపొంది యాత్మతత్త్వమును తెలిసికొనుడని జనులకు శ్రుతి తల్లివలెనే మిక్కిలిదయచేత బోధించుచున్నది.

శ్రుతి॥ యస్యదేవేపరాభక్తి ర్యథాదేవే తథాగురౌ । తస్యైతేకథితా
హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః । ప్రకాశన్తే మహాత్మనః॥

శ్వేతాశ్వతరం ౬-౨౩॥

తా॥ ఎవనికి పరమాత్మయందు ఉత్కృష్టమైన భక్తిగలదో పరమాత్మయం దేప్రకారమో ఆప్రకారము గురువునందు భక్తిగలిగి యుండిన మహాత్మునికి ఈ యుపదేశింపబడిన యర్థములు ప్రకాశించుచున్నవి (అనగా గురుభక్తిలేనివాని హృదయమునందు పరమాత్మసంబంధమైన జ్ఞానము నిలువదు. అని తాత్పర్యము.)

శ్లో॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యంతి తేజ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥

శ్రీభగవద్గీత ౪-౩౪॥

తా॥ బ్రహ్మజ్ఞానమును తత్త్వవిదులైన జ్ఞాననిష్ఠుల నాశ్రయించి వారికి సాష్టాంగనమస్కారపూర్వకమైన యుపచారములు చేసి ప్రార్థించి తెలిసికొనుము. వార లుపదేశము జేయుదురు.

శ్లో॥ ఇదంతే నాతపస్కాయ నాభక్తాయ కదాచన ।
నచా శుశ్రూషవే వాచ్యం నచమాం యోఽభ్యసూయతి॥
౧౮-౬౭॥

తా॥ ఈ జ్ఞానమును తపస్సుచేయనివానికిని, భక్తిలేనివానికిని, శ్రద్ధలేనివానికిని, గురుశుశ్రూష జేయనివానికిని నాయందు అసూయా పరునకును ఉపదేశింపదగినది కాదు.

మూ॥ చిత్తస్య భోగై ర్ద్వౌభాగౌ శాస్త్రైకం ప్రపూరయేత్ ।
గురుశుశ్రూషయా భాగ మవ్యుత్పన్నస్య సత్క్రమే॥

౩౬. జ్ఞానవాశిష్ఠము. ఉపశమప్రకరణము, బల్యుపాఖ్యానం॥

మూ॥ కించిద్వ్యుత్పత్తియుక్తస్య భాగంభోగైః ప్రపూరయేత్ ।
గురుశుశ్రూషయా భాగౌ భాగం శాస్త్రార్థచింతయా॥ ౩౭॥

మూ॥ వ్యుత్పత్తి మనుయాతస్య పూరయేచ్చేతసోఽన్వహం।
ద్వౌభాగౌ శాస్త్రవైరాగ్యై ర్ద్వౌ ధ్యానగురుపూజయా ॥౩౮॥

తా॥ మనస్సుయొక్క వ్యవహారకాలమును నాలుగుభాగములుచేసి, మనస్సు బొత్తుగ జ్ఞానములేనిదగునేని విషయభోగంబులచేత రెండుభాగంబులును, అధ్యాత్మశాస్త్రవిచారముచేత నొకభాగంబును, గురుశుశ్రూషచేత నొకభాగంబును, ఇట్లు నాలుగుభాగంబులును పూరింపవలయు. మనస్సు కొంచెము జ్ఞానమునొందినది యగునేని విషయభోగంబులచేత నొకభాగంబును, గురుశుశ్రూషచేత రెండు భాగంబులును, శాస్త్రచింతచేత నొకభాగంబును, ఇట్లు నాలుగుభాగంబులను నిండింపవలయును. మఱి చిత్తము లెస్సగ జ్ఞానమునొందియుండెనేని అధ్యాత్మశాస్త్రవిచారముచేత రెండుభాగంబులును, విషయభోగంబులు విడువదగినవి కావున గురుశుశ్రూషచేత తక్క రెండుభాగంబులును ఇట్లు నాల్గుభాగంబులును బూరింపవలయు.

సీ॥ బోధమక్షీణ పా ♦ పునకుఁ గల్గదు సద్గు
రుండు సెప్పంగ సం ♦ శ్రితములైన
పనులఁ బాపంబులు ♦ వాసిన నిర్మల
జ్ఞానోదయంబగు ♦ దానగర్వ
ముదయింప వచ్చిన ♦ నుడుపంగవలయు గ
ర్వంబున గురుసమా ♦ రాధనంబు
వదలిన నాబోధ ♦ వైభవ మెడలిన,
యంతటబోక గీ ♦ డావహిల్లుఁ

ఆ॥ బరమబోధమునకు ♦ ఫల ముపశాంతిగా
నెఱిఁగి యెంతబోధ ♦ మెక్కుడయ్యె
నంత శాంతుఁడగుచు ♦ ననవరతంబును
గురునిఁగొలిచి మేలు ♦ పురుషుఁడొందు ॥౪.౩౨౯. అనుశా.

క॥ ఇది సాంఖ్యానము దీనిని
మదితెలవడఁ జేసికొనుచు ♦ మఱవక గురుని
ర్మదుఁడై గొలువఁగఁ సేవల
పడము నతనికరుణ పెంపు ♦ ప్రకటము సేయున్ ॥
అనుశా, ౩- ౩౨౩

క॥ పరమజ్ఞానులయొద్దను
బరగినయజ్ఞుఁడును బోధ ♦ భరితుఁడగు నిరం
తర మేరుసమీపస్థితి,
హిరణ్యరుచిఁగాక మెనక ♦ మొనగిన పగిదిన్ ॥౩. ౩౨౪॥

క॥ గురుశుశ్రూషామహిమం
గరుణఁ జతుర్వర్గహితము ♦ గా నిమ్మాడ్యం
బరివర్ణితంబు సేసెం,
బరాశరమునీశ్వరుండు ♦ పౌరవముఖ్యా ॥౩. ౩౨౬॥

చ॥ గురుపదపంకజాతములు ♦ గొల్వనివారలు ఘోరమహాబ్ధిని
స్తరణముఁ గర్ణధారరహి ♦ తంబగు నావను సంగ్రహించుచే
హరిగతి భూరిదుస్తర భ ♦ వాంబుధిలోన మునుంగుచుందు రం
బురుహదళాక్ష నీవు పరి ♦ పూర్ణుడవై తనరారఁగా నొగిన్॥

భాగవతము. ఉత్తర ౧౦-౧౨౭౯

తే॥ పుత్త్రదారగృహక్షేత్ర ♦ భూరివిషయ
ఘనసుఖాసక్తుఁడగుచు ♦ నేమనుజుఁడేని
నర్థిఁ జరియించువాఁడు భ ♦ వాబ్ధిలోనఁ
జెంది యెన్నాళ్లకును దరిఁ ♦ జేరలేఁడు॥ ౧౦-౧౨౭౮.

సీ॥ జగతిపై పుణ్యతీర్థ ♦ సదనంబులనఁగల్గి
బుణ్యానువర్తన ♦ స్ఫురితులగుచుఁ
బాటించి నీయందు ♦ బద్ధమత్సరములు
లేక భక్తామరా ♦ నోకహంబఁ
వగు భవత్పాదాబ్జ ♦ యుగళంబు సేవించి
భవపాశములనెల్లఁ ♦ బాఱఁద్రోలి
సమమతులై యదృ ♦ చ్ఛాలాభతుష్టమేరు
సమముగాఁగైకొని ♦ సాధులగుచుఁ
తే॥ బాదతీర్థంబుగల మహా భాగవతజ
నోత్తమోత్తములైనట్టి ♦ యోగివరుల
వార కెప్పుడు సేవించు ♦ వాఁడు పొందుఁ
బ్రవిమలానందమయమోక్ష ♦ పదము మఱియు॥ ౧౦-౧౨౭౯.

మ॥ అవివేకానుగతస్వకార్యజలవే ♦ లాకీర్ణమై మిత్రబం
ధువధూపుత్రజలగ్రహాగ్రయుతమై ♦ దుర్దాంతమైనట్టి దు
ర్భవపాథోధిఁ దరించువారె హరిసం ♦ బంధక్రియాలోల భా
గవతానుగ్రహనావ లేనియధముల్ ♦ గారుణ్యసంధాయకా॥

౩-౧౮౩.

మహాభక్తాగ్రేసరుండగు నారదుండు తానుజేసిన గురుసేవ నిట్లు జెప్పుచున్నాడు.

క॥ ఓటమితో నెల్లప్పుడుఁ
బాటవమునఁ బనులు సేసి ♦ బాలుర కడకే
యాటలకుఁబోక యొకజం
జాటంబును లేక భక్తి ♦ సలుపుదు ననఘా॥ భాగ ౧-౧౦౪.

క॥ మంగళమనుచును వారల
యెంగిలిభక్షింతు వాన ♦ కెండకు నోర్తున్
ముంగల నిలుతును నియతిని
వెంగలిక్రియఁజనుదు నురువి ♦ వేకముతోడన్॥ ౧౦౫.

వ॥ ఇట్లేను వర్షాకాల శరత్కాలంబులు సేవించితి వారును నాయందు గృపసేసిరంత॥ ౧౦౬.

మ॥ అపచారంబులు లేక నిత్యపరిచ ♦ర్యా భక్తియుక్తుండనై
చపలత్వంబునుమాని నేఁ గొలువఁగా ♦ సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున దీనవత్సలతతోఁ ♦ గారుణ్యసంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహ ♦ స్యోదారవిజ్ఞానమున్॥
౧-౧౦౯.

క॥ గురుధనముఁ గూర్పనేటికి
గురుశిక్షందగిలి మంత్రి ♦ కోవిదులై స
ద్గురుధర్మనిరతులేనియు
గురువులకును శిష్యవరులె ♦ కూర్చినధనముల్॥
భాగ, ౬-౨౯౮॥

క॥ హరిమహిమఁ దనకుఁ జెప్పిన
గురువున్ నరుఁడనుచుఁ దలచి ♦ కుత్సితభక్తిన్
దిరుగు బుధుశ్రమమెల్లను
కరిశౌచముక్రియ నిరర్థకంబగు నధిపా ॥భాగ ౭-౪౫౮॥

## గురుగీతావాక్యములు.

శ్లో॥ గురోఃప్రసాదతః స్వాత్మ న్యాత్మారామ నిరీక్షణాత్ ।
సమత్వం ముక్తిమార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే ॥

తా ॥ సద్గురుని కటాక్షమువలన తన యాత్మయందు (అనగా జీవాత్మయందు) పరమాత్మదర్శనమును, మోక్షణమును, ఆత్మజ్ఞానమును కలుగును.

శ్లో॥ గురువక్త్రే స్థితావిద్యా గురుభక్త్యాచ లభ్యతే
త్రైలోక్యస్ఫుట వక్తారో దేవాద్య స్సురపన్నగాః॥

తా॥ గురునియొద్దనుండు బ్రహ్మవిద్యను గురుభక్తివల్లనే సంపాదింపవలయును. అట్లు గురుభక్తివలన బ్రహ్మజ్ఞానమును పొందిన వారు త్రిలోకములయందును దేవతలతోడ సమానులగుచు పూజింపబడుదురు.

శ్లో॥ కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకం ।
గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్ తారకం బ్రహ్మనిశ్చితం॥

తా॥ తనకు జ్ఞానోపదేశమును చేయునట్టి గురువే కాశీలోనుండు విశ్వనాథుడుగాను, ఆ గురుపాదతీర్థమే కాశీగంగాతీర్థముగాను, ఆగురువుచే నుపదేశింపబడిన నిశ్చయమైన బ్రహ్మజ్ఞానమే తారకోపదేశముగాను అగుచున్నది.

శ్లో॥ సర్వతీర్థావ గాహస్య సంప్రాప్నోతి ఫలంనరః
గురోః పాదోదకంపీత్వా శేషం శిరసిధారయేత్॥
శోషణం పాపపంకస్య దీపనం జ్ఞానతేజసః
గురోః పాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకం॥
అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారణం।
జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్ ॥

శ్లో॥ గురుపాదోదకం పానం గురోరుచ్ఛిష్టభోజనం।
గురుమూర్తే స్సదాధ్యానం గురుస్తోత్రం సదాజపః॥
గురుమూర్తిం స్మరేన్నిత్యం గురోర్నామ సదాజపేత్।
గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యం నభావయేత్॥
అనన్యాశ్చింతయంతో యే సులభం పరమంసుఖం।
తస్మాత్సర్వప్రయత్నేన గురోరారాధనం కురు॥

తా॥ తనకు జ్ఞానోపదేశముచేయు సద్గురుపాదతీర్థమును త్రాగి మిగిలినజలమును శిరస్సున ప్రోక్షించుకొనుటవలన ఈజగములో గలిగిన సమస్తపుణ్యతీర్థస్నానఫలము గలుగును. పాపమును బోగొట్టి బ్రహ్మజ్ఞానమును ప్రకాశింపజేయుచు సంసారసాగరమును దాటింపజేయునది గురుపాదతీర్థమే. అజ్ఞానమును పోగొట్టి సకలకర్మలను నాశముచేసి జ్ఞానవైరాగ్యములను గలుగజేయునది గురుపాదతీర్థమే గాన, అట్టి మహాత్మ్యముగల గురుపాదతీర్థమును త్రికరణశుద్ధిగా పుచ్చుకొనవలయును. గురుపాదతీర్థమును త్రాగుట, గురువుయొక్క యెంగిలియన్నము తినుట, సదా గురుస్తుతిచేయుట ఇవిముఖ్యముగా చేయుచుండవలయును. గురునామమును జపించుచుండవలయును. సదా గురుని యాజ్ఞమీఱకుండవలయును. గురువుకంటెను అన్యమైనవాటిని తలంచగూడదు. గురుధ్యానముకంటెను గురుపూజకంటెను సుఖమైన మార్గము ఈజగత్తునందు యేదిన్ని లేదు. కనుక సర్వప్రయత్నముల చేతను సద్గురు నారాధింపవలయును.

శ్లో॥ గుకారంచ గుణాతీతం, రుకారం రూపవర్జితం।
గుణాతీతమరూపంచ యో దద్యాత్ సగురుస్స్మృతః॥

తా॥ "గురు" అనెడి రెండక్షరములలో "గు"అనెడి యక్షరము శుద్ధనిర్గుణస్వరూపమును "రు" అనెడి యక్షరము కేవల నిరాకారమును అగుచున్నది. కాన అట్టి శుద్ధనిర్గుణ నిరాకారపరబ్రహ్మమును బోధించువాడే "గురు"డనబడును.

శ్లో॥ గుకారః ప్రథమోవర్ణో మాయాది గుణభాసకం।
రుకారోస్తి పరంబ్రహ్మ మాయాభ్రాంతి విమోచకం॥
గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః।
గుణరూపవిహీనత్వా ద్గురురిత్యభిధీయతే॥
గుకారశ్చాంధకారస్తు, రుకార స్తన్నిరోధకృత్।
అంధకార వినాశిత్వా ద్గురురిత్యభిధీయతే॥

శ్లో॥ గుకారశ్చాంధకారోహి రుకార స్తేజ ఉచ్యతే।
అజ్ఞానగ్రాసకంబ్రహ్మ గురురేవ నసంశయః॥
మంత్రరాజమిదం దేవి గురురిత్యక్షరద్వయం।
స్మృతివేదార్థ వాక్యానాం గురుస్సాక్షాత్పరంపదం॥
సప్తకోటి మహామంత్రాః చిత్తవిభ్రమకారకాః।
ఏకఏవ పరోమంత్రో గురురిత్యక్షరద్వయం॥

తా॥ 'గు' అనగా మాయయనబడును. 'రు' అనగా మాయను నాశనముచేయు పరబ్రహ్మమనబడును. 'గు' అనగా గాఢాంధకారము, 'రు' అనగా దానిని నాశనము చేయునది. కాబట్టి 'గురు' అనగా గాఢాంధకారమును నాశనము చేయువా డనబడును. 'గు' అనగా అజ్ఞానము 'రు' అనగా దానిని బోగొట్టు జ్ఞానజ్యోతి. కాబట్టి 'గురు' అనగా అజ్ఞానమును నాశనము చేసి జ్ఞానజ్యోతిని బ్రకాశింప జేయువాడు. సప్తకోటిమహామంత్రము లన్నియు చిత్తమును భ్రమింపజేయునవియై యున్నవి. 'గురు' వనెడి రెండక్షరములు గల యీ మంత్రమే యన్నిటిలోపల యుత్తమమైనది.

శ్లో॥ గురుశ్శివో గురుర్దేవో గురుర్బంధుః శరీరిణాం।
గురురాత్మా గురుర్జీవో గురోరన్యం నవిద్యతే॥
నగురోరధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం।
శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥

తా॥ సద్గురుడే ఈశ్వరుడు, గురుడే దేవుడు, గురుడేబంధువు, గురుడే యాత్మ, గురుడే జీవుడు, గురువుకంటెను అన్యమైనది యేదియు

లేదు. గురుడే మంగళకరమైన పరబ్రహ్మము. గురునికంటెను శ్రేష్ఠమైనది యేదియు లేదు. ఇట్లని హరి హరాది దేవతలు సత్యము చేసి యున్నారు.

శ్లో॥ నసుఖం వేదశాస్త్రేషు నసుఖం మంత్రయంత్రకే॥
గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే॥

తా॥ వేదశాస్త్రములయందును మంత్ర యంత్రములయందును బ్రహ్మనందమనెడి సుఖము కలుగ జాలదు. సద్గురు కటాక్షము వల్లనే మోక్షసుఖము కలుగును. అంతకంటె భూమియం దెచ్చటను సుఖములేదు.

## శ్రీ సీతారామాంజనేయ సంవాదము.

సీ॥ గురుపదాంభోజముల్ ♦ గొలువక కల్గునే
ప్రవిమల వైరాగ్య ♦ భాగ్యమహిమ
గురుపాద తీర్థంబు ♦ గ్రోలక కల్గునే
జ్ఞానవిజ్ఞాన యో ♦ గానుభవము
గురు సుప్రసాదంబుఁ ♦ గొనకున్నఁ గల్గునే
ప్రీతిలేని చిత్తోప ♦ రతిసుఖంబు
గురుతత్త్వమాత్మఁగ ♦ న్గొనకున్న గల్గునే
నిరతిశయంబైన ♦ పరమపదము
తే॥ అట్లుగావున విద్యార్థి ♦ యైనయోగి
వినయ భయ భక్తి లెదలోనఁ ♦ బెనఁగొనంగ
నల చతుర్విధ శుశ్రూష ♦ లాచరించి
కొనుచు ననిశంబు గురువుఁ ♦ గొల్చు ననఘ॥ 3-౧౨౬

## చతుర్విధ శుశ్రూషలు.

1. స్థానశుశ్రూష:—గురుని గృహారామక్షేత్ర పశుధనధాన్యాదుల రక్షించుట.

2. అంగశుశ్రూష:—దేశికునకు అభ్యంగనస్నాన పాదసంవాహనాదుల జేయుట.

3. భావశుశ్రూష:—గురుడే తల్లి, తండ్రి, చుట్టము, స్నేహితుడు, విద్య, ధనము, దాత, దైవము, రక్షకుడని తలచుట.

4. ఆత్మశుశ్రూష:—గురువున కిష్టములగు పదార్థము లడుగకమునుపే తుష్టిగ దెచ్చి యిచ్చుట.

విచార సాగరము తృతీయతరంగమునందు

౧౧౫ —గురుసేవ:—బ్రహ్మవేత్తయొక్క వాక్కు వేదవచనమునకు సమానముగనున్నదో, ఆబ్రహ్మవేత్తయైన యాచార్యుని జిజ్ఞాసువైనవాడు సేవింపవలయును. ఏలనన సేవవలన గురువులు ప్రసన్నులగునప్పుడు జిజ్ఞాసువు తన నిజరూపమునే తెలిసికొనుచున్నాడు. దీనివలన గలియనగిన దేమనగా, గురుసేవ ఈశ్వర సేవకంటె నధికమని తెలియదగినది. ఏలయన ఈశ్వరసేవ అదృష్టఫలమునకు మాత్రమే హేతువుగా నున్నది. గురుసేవ అదృష్ట దృష్టఫలమునకును హేతువుగానున్నది. ధర్మాధర్మములను ఉత్పత్తిచేయు మూలకముగా ఫలమునకు హేతువుగా నుండునది. అదృష్టఫలమునకు హేతువనియును, ధర్మాధర్మములను ఉత్పత్తిచేయక సాక్షాత్ఫలమునకు హేతువుగానుండునది దృష్టఫలమునకు హేతువనియును చెప్పబడును. ఈశ్వర సేవధర్మమును ఉత్పత్తిచేయు మూలకముగా అంతఃకరణశుద్ధి యగుఫలమునకు హేతువగుచున్నది. కావున ఈశ్వరసేవఅదృష్టఫలమునకు హేతువుగనున్నది. గురుసేవ ధర్మాపేక్షలేకయే ఆచార్యులయొక్క ప్రసన్నతవలన ఉపదేశరూపఫలమునకు హేతువుగనున్నది. కాబట్టి దృష్టఫలమునకు హేతువుగనున్నది. మఱియు గురుసేవధర్మమును ఉత్పత్తిచేయు మూలకముగా అంతఃకరణశుద్ధి ఫలమునకు హేతువగుచున్నది. దీనివలన అదృష్టఫలమునకు హేతువగుచున్నది. ఇట్లు ఆచార్యసేవ ఈశ్వ

రసేవకంటె ఉత్తమమై యున్నది. కావున జిజ్ఞాసువు ఏవిధముచే నైనను బ్రహ్మవేత్తయైన గురువును సేవింపవలయును.

౧౧౬ గురువు ప్రాప్తముకాగానే సాష్టాంగముగా నమస్కరించి వారి యుత్కృష్ట పాదారవిందముల ధూళిని శిరమునదాల్పవలయును. గురువుయొద్ద వసించి బంధనివృత్తికాంగోరువాడు తన శరీర మును ధనవాక్కులను గురువున కర్పణము చేయవలయును.

౧౧౭ శరీరార్పణము:— శరీరముచేత గురువునకు కావలసిన యనేక విధములైన సేవలను చేయుటయును వారియొక్క యాజ్ఞలను కించిత్తైనను మీరక నడచుకొనుటయును శరీరార్పణమనం బడును.

౧౧౮ మనోర్పణము:—మనస్సునందు గురునామమును స్మరించుట యు, వారియందు భక్తినుంచి తనయందు వారికి ప్రీతికల్గున ట్లు చేయుటయు స్వప్నమునందు సైతము వారియందు దోష దృష్టినుంచకయు, హరిహరబ్రహ్మగంగాసూర్యులను భా వించునట్లు వారిని పూజ్యులుగ భావించుటయు మనోర్పణమన బడును.

౧౧౯ ధనార్పణము:—పత్ని, సుత, భూమి, పశు, దాస, దాసి, ద్రవ్య, గృహ, ధాన్యములను వీనికి ధనమనినామము. వీనినన్నిటిని త్యజించి గురువును శరణుజొచ్చుటయే ధనార్పణ మనబడును. ఏలన, గురువు సర్వపరిత్యాగముచేసిన వాడై యుండినయెడల వారేదియు గ్రహింపరు. వారిని బొందుటకై వీనినన్నిటిని త్యజించవలసినదిగా నుండుటచేత, ఈ త్యాగము గురునిమిత్త మై ధనార్పణమగుచున్నది. గురువు గృహస్థాశ్రమమున నుండి నయెడల వారికి సర్వమును అర్పింపవలయును. ఇది యొకవిధ మైన ధనార్పణము. బ్రహ్మవేత్తయైన గురువు గృహస్థాశ్రమ మున నుండరని చెప్పుట సరికాదు. ఏలన, యాజ్ఞవల్క్య

ఉద్దాలకాది గురువర్యులు గృహస్థాశ్రమమునందుండినట్లు వేదమునందు చెప్పఁబడియున్నది. కావున గృహస్థాశ్రమమునందుండువారును గురువులుకావచ్చును.

౧౨౦ వాగర్పణము:— గురువాక్యమునందు గుణము కలదని నమ్మి దానిని శ్లాఘించి దోషమును చూడకుండుటయే వాగర్పణము.

౧౨౧ గురువును బొందినమీఁద శిష్యుఁడు నడుచుకొనవలసిన విధము:— తనక్షేమమును గోరువాఁడు మున్నుచెప్పినట్లు శరీరాదులనర్పణముచేసి, గురువున్నచోటఁగాని, లేక సమీపమునందుఁగాని బహుకాలము వసించి భిక్షాన్నమును గ్రహించి, తాను భుజింపక గురువునకు ముందుగా నిడి మౌనముతో నుండవలయును. మఱియు ఆదిన మేభిక్షమునకు బోఁగూడదు. గురువు దయచేసి యిప్పించినయెడల భుజింపవలయును. శిష్యుని భక్తిని పరీక్షించి తెలిసికొను నిమిత్తము గురు వీయనియెడల ఉపవాసముగానుండి నియమానుసారముగా మరుదినము భిక్షమునకు బోవవలయును. వీనివలన ఏవిధమైన మనోవ్యాకులత్వమును బొందఁగూడదు. ఇట్లు వసించుచుండు కాలంబునందు ఎప్పుడు గురువు సావకాశముగను, ప్రసన్నముగను నుండునో, యప్పుడు చేతులు జోడించుకొని వారిని స్తుతించి వినయముతో నడుగవలసినదేమనఁగా, స్వామిన్ "దాసుఁడు విజ్ఞాపనచేసికొనుటకు ఇచ్ఛయించుచున్నాడు" అని చెప్పవలయును. అనంతరము అడుగుటకాజ్ఞాపించినయెడల నడుగవచ్చును. జన్మాంతర ఉత్తమకర్మమువలన గురువులైనవారు కృపచేసి శిష్యుని యొద్ద ధనమును గ్రహింపక ఉపదేశముచేసినయెడల ఉత్తమాధికారికి క్షేమము కలుగును. ఏలయన, గురుసేవకు ఫలము ద్వివిధము. ౧ ప్రసన్నత, ౨ అంతఃకరణశుద్ధి, వీని కీరెండును సిద్ధించుచున్నవి. ఎవఁడు మనోవాక్కాయములను అర్పణముచేసి గురుసేవచేయునో వాఁడు బ్రహ్మస్వరూపమే యగు

చున్నాఁడు. శ్రీసద్గురువులైనవారు ఎప్పుడును వానికి సహాయము చేయుచున్నారు.

సనాతనధర్మములయందు దత్యుత్తమమై, చతుర్విధపురుషార్థ సాధకమైనది గురుసేవయేయై యున్నది. సనాతనధర్మావలంబులైన వారందరును తమ బిడ్డలకు ౮॥ సంవత్సరముల యీడునను ఉపనయనాది సంస్కారంబులొనర్చి "భిక్షాచర్యం చర;" "ఆచార్యాధీనోభవ" (భిక్షాటనముచే జీవించి ఆచార్యుని యధీనము నందుండుమా) యని యుపదేశించి వారిని గురుల యధీనమ్మును జేయుచున్నారు. ఉపనయనాది సంస్కారములు గల ద్విజులకందరకీవిషయ మనుభవవేద్యమే. కాని ప్రస్తుతకాలమందీయాచారము మంత్రరూపముగానేయుండి క్రియాకారిగాకయున్నది. గురువువల్ల గ్రహింపబడనిది విద్యకాదు. అందులో పరమపురుషార్థమగు మోక్షవిద్య గురునియధీనమేగాని గ్రంథాధీనము కాదు. గ్రంధములన్నియు కాలక్షేపకరములేగాని విద్యానుభవము నొసంగలేవు. ఇందుకు శ్రీ వివేకానందస్వామి వారి వాక్యములు.

[,,The quickening impulse cannot be derived from books. The soul can only receive impulses from another soul, and from nothing else. We may study books all our lives, we may become intellectual. But in the end we find that we have not developed at all spiritually.........................

To quicken the spirit the impulse must come from another soul. The person from whose soul such impulse comes is called the cure. (or The Teacher.)]

(తా॥ ఆత్మాభివృద్ధికరమగు సాత్త్వికభావము గ్రంథములవలన పొందబడదు. ఆత్మ (జీవాత్మ) వేరొక ఆత్మనుండి (పరమాత్మ) సత్త్వమును బొందును. మరిదేనివలనను బొందలేదు. మనము జీవితకాల

మంతయు గ్రంథావలోకనము చేసి బుద్ధినభివృద్ధి జేసికొనవచ్చును. కాని ఆధ్యాత్మికాభివృద్ధి నెంతమాత్రము పొందలేదని మనము చివరకు తెలిసికొందుము. ఆత్మాభివృద్ధికరమగు సత్త్వము వేరొక యాత్మనుండి యే రావలసియున్నది. ఏవ్యక్తినుండి మనకు సత్త్వ మనుగ్రహింపబడు చున్నదియో యావ్యక్తియె సద్గురువు )

సాధకుని హృదయమందుండెడి భావముల ననుసరించియే గ్రంథములయందు భావద్యోతకమగును. సాధకునియందు విచారణ సామర్థ్యమెంతయుండునో అంతయే యర్థమగును. అధికారి తారతమ్యము ననుసరించి గ్రంథానుభవము గలుగుచున్నది. పూర్ణాధికారికి సంపూర్ణానుభవము కలుగును. మధ్యమాధమాధికారులకు వారి జ్ఞానము ననుసరించియే గ్రంథములు సమన్వయ మగును. కనుక గ్రంథపరిశోధన జేయుటకు ముందు మనము పూర్ణాధికారులము కావలయును. ఇందుకు సద్గురువులను సేవించి వారివల్ల శిక్షింపబడవలయును. సనాతన ధర్మమందు గురుసేవ జేయనివా డధముడుగా నెంచబడుచున్నాడు. ఇందుకు శ్రీ జగద్గురు శంకరాచార్యస్వాములవారు.

## గురు పాదాష్టకం.

శ్లో॥ ౧ కళత్రం ధనం పుత్రమిత్రాది సర్వం
గృహంబాంధవం సర్వమేతద్ధిజాతం
గురోరంఘ్రిపద్మే మనశ్చేనదత్తం
తతః కిం తతః కిం తతః కిం తతః కిం॥

తా॥ భార్యా, ధనము, మిత్రులు, గృహము, బంధువులు మొదలుగాగల సమస్తైశ్వర్యము కలిగియుండినప్పటికిని సద్గురు పాదపద్మములయందు మనస్సు సమర్పింపక పోయినటులాయెనేని పుత్రమిత్రాది సమస్తమైనవానితో నేమిప్రయోజనము. వానితో నేమి ప్రయోజనము. వానితో నేమిప్రయోజనము. వానితో నేమి ప్రయో

జనము. (వేనితోడను వెట్టిప్రయోజనంబును లేదనుట.) ఆదరణార్థము నాలుగుసార్లు చెప్పబడినది.

౨ షడంగాదివేదాః, ముఖేశాస్త్రవిద్యాః,
కవిత్వాదిగద్యం సుపద్యం కరోతి ॥గురో॥

౩. క్షమామండలే భూప భూపాలబృందై
స్సదా సేవితం యస్సపాదారవిందం ॥గురో॥

౪ యశోమే గతం దిక్షుదానుప్రభావం
జగద్వస్తుసర్వం కరేయత్ప్రసాదాత్ గురో॥

౫ విదేశేషు మాన్య స్వదేశేషు ధన్య
స్సదాచారవృత్తోస్మి మత్తోనచాన్యః ॥గురో॥

౬ నభోగే నయోగే నవావా చిరాజ్యే.
నకాంతాముఖేనైవ విత్తేచచిత్తం ॥గురో॥

౭ అరణ్యేనవా సస్వగేహేనకార్యం।
నదేశే మనోవర్తతేఽనార్యః ॥గురో॥

౮ అనర్ఘ్యాణిముక్తాస్య సమ్యాక్స
మాలింగితా కామినీ యామినీషు ॥గురో॥

గురోరష్టకం యఃపఠేత్పుణ్యదేహీ।
యతిర్భూపతి ర్బ్రహ్మచారీ గృహీవ
లభేద్వాంఛితార్థం పరబ్రహ్మసంజ్ఞం।
గురోరుక్తవాక్యం మనోయస్యలగ్నం॥

తా॥ షడంగాదివేదములు, శాస్త్రములు, కవిత్వము మొదలైన ప్రజ్ఞలెన్నికలిగియున్నను, సామంతరాజులచేతను సేవింపబడుచునట్టి చక్రవర్తియైనను, కీర్తివంతుడైనను, సర్వవస్తువులకు ప్రభువైనను స్వదేశము, విదేశమను భేదములేక అంతటను గౌరవింపబడు వాడైనను, సదాచారవంతుడైనను, భోగము, యోగము, రాజ్యము,

కాంత మొదలగు వెన్నికలిగియుండినను, స్వగృహమందుగాని, యరణ్య
మందుగాని వాసము జేయువాడైనను, అమూల్యపదార్థములు గలిగి
యుండినను, అనేక భోగములుగలవాడైనను సద్గురుని పాదారవిందముల
యందు మనస్సును సమర్పింపని వాడయ్యెనేని అవియన్నియు, నిష్ప్ర
యోజనములని తాత్పర్యము.

పూర్వపుణ్యమువల్ల నొకానొకనికి పూర్ణబోధకలిగినను లోకా
చారము ననుసరించుటకైనను వానికి గురుసేవ చేయవలసినదిగా విధిం
పబడుచున్నది. అవతారపురుషులగు శ్రీ బలరామ కృష్ణాదులు సైత
ము సద్గురుని సేవించి వారికరుణ బడసిరి.

శా॥ ఉర్విన్ మానవులెవ్వరైన గురు ♦ వాక్యోద్యుక్తులై కాని త
త్త్వారంభము సేయబోల దనుచున్ ♦ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై ♦ సంపూర్ణులై యుండియున్
గుర్వంగీకరణంబు సేయఁ జనిరా ♦ గోవిందుడున్ రాముడున్॥
[శ్రీభాగ, పూర్వ ౧౦, ౧౪౧౧

క॥ గురువులకు నెల్లగురులై
గురులఘుభావములులేక ♦ కొమరొందుజగ
ద్గురులు త్రిలోకహితార్థము
గురుశిష్యన్యాయలీల ♦ గొలిచిరి వేడ్కన్॥ ౧౪౧౨

మూ॥ కథం బంధః కథం మోక్షయితి ప్రశ్నానుదాహరన్
పారావారవిదాం పాదాన్కస్మాద్రాజన్న సేవసే॥౧౧౦॥
నిర్వాణప్రకరణం-శిఖిధ్వజోపాఖ్యానం-

మూ॥ సాధూనాం సమదృష్టీనాం పరిప్రశ్నేన సేవయా।
సంగమేనచ సాయుక్తిర్లభ్యతే ముచ్యతేయయా ॥౧౧౧॥

తా॥ ఓ రాజా! బంధంబెట్లు వచ్చెను? మోక్షంబెట్లు కలు
గునని ప్రశ్నంబుల నడుగుచు బ్రహ్మవిదుల పాదంబుల సేవింప
కున్నాడవేమి? ఏ యుపాయముచే ముక్తినొందనగునో యట్టి యుపా

యమును, సజ్జనుల సాంగత్యముచేతను, వారి నడఁగుటచేతను, వారిని సేవించుటచేతను లభించుచున్నది.

౪౯ శ్రీజగద్గురు శంకరాచార్యకృత "గురుపాదుకా స్తవము"

శ్లో॥ ౧ శ్రీసమంచిత మవ్యయం పరమప్రకాశమగోచరం।
భేదవర్జితమప్రమేయ మనంతమాద్య మకల్మషం।
నిర్మలం నిగమాంతమద్వయ మప్రతర్క్య మబోధకం।
ప్రాత రేవహి మానసాంతర్భావయే గురుపాదుకం॥

౨ నాదుబిందుకళాత్మకం దశనాదభేద వినోదకం।
మంత్రరాజవిరాజితం నిజమండలాంతర్భాసితం।
పంచవర్ణమఖండ మద్భుతమాదికారణ మచ్యుతం॥ ప్రాతరేవహి॥

౩ వ్యోమవద్బహిరంతరస్థిత మక్షరం నిఖిలాత్మకం।
కేవలం పరిశుద్ధమేక మజమ్మహి ప్రతిరూపకం।
బ్రహ్మతత్త్వ వినిశ్చయం నిరతానుమోక్ష సుబోధకం॥
ప్రాతరేవహి॥

౪ బుద్ధిరూప మబుద్ధికం త్రితయైకకూటనివాసినం।
నిశ్చలం నిరతప్రకాశకనిర్మలం నిజమూలకం।
పశ్యమాంతరఖేలనం నిజశుద్ధమాయవిగోచరం॥ ప్రాతరేవహి॥

౫ హృద్గతం విమలం మనోజ్ఞ విభాసితం పరమాణుకం।
నీలమధ్యసునీలసన్నిభ మాది బిందునిజాంశుకం।
సూక్ష్మకర్ణికమధ్యమస్థిత విద్యుతాది విభాసితం॥ ప్రాతరేవహి॥

౬ పంచపంచహృషీకదేహ మనశ్చతుష్క పరస్పరం।
పంచభూతక కామషట్క సమీరశబ్దముఖేతరం।
పంచకోశగుణత్రయాది సమస్తధర్మవిలక్షణం॥ ప్రాతరేవహి॥

౭ పంచముద్ర సులక్షదర్శనభావమాత్ర నిరూపణం।
విద్యుతాది ధగద్ధగిత రుచిర్వినోదవివర్ధనం।
చిన్మఖాంతరవర్తినం విలసద్విలాస మమాయకం॥ ప్రాతరేవహి॥

౮ పంచవర్ణ సుచిర్వ్యచిత్రి విశుద్ధతత్త్వవిచారిణం।
చంద్రిసూర్య చిదాగ్నిమండలమండితం ఘనచిన్మయం।
చిత్కళాపరిపూర్ణమంతర చిత్సమాధినిరీక్షణం॥ ప్రీతరేవహి॥

౯ హంసచారమఖండనాద మనేకవర్ణమ రూపకం।
శబ్దజాలమయం చరాచరజంతుదేహ నివాసినం।
చక్రిరాజ మనాహతోద్భవ మేకవర్ణమతఃపరం॥ ప్రీతరేవహి॥

౧౦ జన్మకర్మవిలీనకారణ హేతుభూతమభూతకం।
జన్మకర్మనివారకం రుచిపూరకం భవతారకం।
నామరూపవివర్జితం నిజనాయకం శుభదాయకం॥ ప్రీతరేవహి॥

౧౧ తప్తకాంచన దీప్యమాన మహాణుమాత్రి మరూపకం।
చంద్రికాంతరతారకై రసముజ్వలం పరమస్పదం।
నీలనీరదమధ్యమస్థిత విద్యుతాది విభాసితం॥ ప్రీతరేవహి॥

౧౨ స్థూలసూక్ష్మ సకారణాంతర ఖేలనం పరిపాలనం।
విశ్వతైజసప్రాజ్ఞచేత సమంతరాత్మనిజాంశుకం।
సర్వకారణ మీశ్వరం నిటలాంతరాళవిహారకం॥ ప్రీతరేవహి॥

భాగవతము దశమస్కంధము. ఉత్తరభాగము (కుచేలోపాఖ్యానములో) శ్రీకృష్ణభగవానులు కుచేలునితో జరపిన సంవాదమందు.

వ॥ అమ్మహాత్మునివలన సకల వర్ణాశ్రమంబుల వారికి నేను విజ్ఞానప్రదుండనగు గురుండనై యుండియు గురుభజనంబు పరమధర్మంబని యాచరించితి..............౯౯౫.

వ॥ అదియునుంగాక సకలభూతాత్మకుండనైన యేను దపోవ్రత యజ్ఞ దానశమదమాదులచేత సంతసింపను. గురుజనంబులఁ బరమ భక్తి సేవించు వారలం బరిణమింతునని చెప్పి మఱియు మనము గురు మందిరంబున నున్నయెడ నొక్కనాఁడు గురుపత్నీ నియుక్తులమై యింధ నార్థంబడవికిం జనిన నయ్యవసరంబున ౯౯౮.

క॥ గురుని వచనంబుఁ దెలిగునఁ
బరమార్థనిరూపణంబు ♦ పని నిలుపుదీ ద
త్పరుఁడై నడపంజాలిన
పురుషునిఁ దడయక ప్రశాంతి ♦ పొందునరేంద్రా॥
[శాంతి౫-౬౨౧.

## ౫౦ ఉ ప సం హా ర ము.

శ్లో॥ కింజ్యోతి స్తవ భానుమానహని మే, రాత్రౌ ప్రదీపాదికం
స్యాదేవం రవిదీపదర్శనవిధౌ కింజ్యోతి రాఖ్యాహి మే
చక్షుః తస్య నిమీలనాది సమయే కిం తత్ప్రహం
ఉతో భవాన్ పరమకం జ్యోతి స్తదస్మిప్రభో॥

తా॥ ప్రశ్న నీకు ప్రకాశ మేది?

ఉత్త. పగలు సూర్యుడును, రాత్రియందు దీపములును.

ప్రశ్న. అవుగాక. సూర్యుని, దీపములను ఏది ప్రకాశింపజేయుచున్నదో చెప్పుము.

ఉత్త. నేత్రములు.

ప్రశ్న. వానిని మూసినప్పుడు ఏది?

ఉత్త. నేను.

ప్రశ్న. నిన్ను ప్రకాశించున దేది?

ఉత్త. జ్యోతిస్స్వరూపమైన పరమాత్మ. హేప్రభో! అదియే నేనైతినని శిష్యుడు తన యనుభవమును జెప్పుచున్నాడు.

ఇటుల ప్రశ్నోత్తరరూపముగా శ్రీ మచ్ఛంకరాచార్యుల వారు యొక శిష్యుని కాత్మసాక్షాత్కారమును గలిగించిరి.

ఆత్మసాక్షాత్కారమును బొందుటకు సద్గురునియొద్ద జేయుబడు శ్రవణాదులు సాధనములు. శ్రుతి "ఆత్మావారేద్రష్టవ్యః, శ్రోత

వ్యో, మంతవ్యో, నిధిధ్యాసితవ్యః"॥. ఆత్మను దర్శించవలసినది. శ్రవణముచేయవలసినది. మననము చేయవలసినది. నిధిధ్యాసనము చేయవలసినది. శ్రవణాదులకు సాధనచతుష్టయ సంపత్తిగలవాడే యర్హుడు. సాధనసంపత్తిని బొందుట కనేకు లనేకవిధములైన శుభవాసనలతో బ్రవర్తించుచున్నారు. ఈశుభవాసనలు వారి పూర్వజన్మ సంస్కారములై యున్నవి. సద్భావముతోగూడి పరులకు పీడాకరములుగాని క్రియలన్నియు నాత్మోన్నత్యమునకు హేతువులగును.

సాధకుడు ముఖ్యముగా గమనింపవలసిన విషయములు.

క॥ పాణి యుపస్థం బుదరము
వాణియనంగ మూఁడుఁ రాని ♦ వాకిండ్లివి గీ
ర్వాణులకు వీనిబుధుఁడు పు
రాణపురుషరక్షకై తి ♦ రంబుగమూయుఁగ॥

భార, శాంతి ౫-౩౧౭.

తే॥ పుచ్చికొనఁడు ముందటఁ బైఁడి ♦ పోకయున్న
నలుకవోడమియుఁ బొడువను ♦ నడువఁదొడఁగఁ
డట్టి యానైష్ఠికునిచేత ♦ నడఁగకున్నె
పాణియనియెడి వాకిలి ♦ బంధురముగ॥ ౩౧౯.

క॥ ఏవిధము కాంతనైనం
దావిహారణమునకు నెపుడుఁ ♦ దార్పఁడు తనయం
దావిష్టము భార్యావ్రత
మానెరవడ్డం బుపస్థ ♦ మను వాకిటికిఁ॥ ౩౨౦.

క॥ తనుయాత్రకుఁగా నశనము
గొనుఁ బూర్ణముగాఁగొనండు ♦ కోరఁడుకాల్యం
బునరాని దానినమ్మోయి
ఘని యుదరద్వారమోపి ♦ మూసెనకాదే॥ ౩౨౧.

క॥ పలుకఁడసత్యము దూఱం
బలుకఁడు. బెట్టిదముగాఁగఁ ♦ బలుకఁడువాదం
బులకుఁజొరఁడు వాణియనం
గలవాకిలి యట్టిబుధుఁడు ♦ గప్పంజాలున్॥ ౩౨౨.

తే॥ ద్వారములు నాల్గు మూయంగ ♦ దక్షుఁడైన
వాఁడచూవె బ్రాహ్మణుఁ డట్టి ♦ వానికేల
తపములును యజనంబులు ♦ దానములును
వ్రతములును వేదకింకర ♦ త్వంబు వొడఁకు॥ ౩౨౩.

తే॥ ద్వంద్వములు లేక పేర్మికి ♦ వ్రస్సపథక
ప్రకృతివికృతులఁ గనుచుండు ♦ బ్రాహ్మణత్వ
శాలి యాసదాచారంబు ♦ సలుపలేని
వాఁడు ఫలకాంక్షియై కర్మ ♦ వశతఁ బొందు॥ ౩౨౪.

పునరావృత్తిరహితమైన ముక్తియే ప్రతివానికిని గమ్యస్థానమైయున్నది. ముక్తి త్యాగమువలననెకలుగును. శ్రుతి॥ "నకర్మణాన ప్రజయాధనేన త్యాగేనైకే నమృతత్వమానసః" ముక్తినిబొందుటకొఱకు త్యాగముతప్ప, కర్మగాని, సంతానముగాని, ధనముగాని యుపయోగపడవు. దీనిని బొందుటకు వలయుసాధనలను తనయధికారానుసారముగా సద్గురుని యనుగ్రహమువలన బొందవలసినదియేగాని వాటిక్రమమును సాధారణముగా నిదమిద్ధమని యేకరీతిగా నిర్ణయించుటకు వీలులేదు. అధికారానుసారముగా సాధనలును మారుచుండును.

*క॥ యోగంబుఁ దపంబుఁబరి
త్యాగంబును గాక యొండు ♦ లగునె హితంబుల్
రాగము సరిదుఃఖంబును
ద్యాగము బోలెడిసుఖంబు ♦ నరయంగలవే॥ శాంతి ౨-౩౮౬.

క॥ త్యాగ మొక నెలవు శమసం
యోగంబుత్తమము దాని ♦ కూర్ధ్వముసంతో
షాగమము మోక్షలాభో
ద్యోగికి నివి గమ్యభూము ♦ లుత్తమధిషణా॥ శాంతి ౫-౩౮౩.

క॥ పునరావర్తన రహితుం
డనఘా పరమాత్ముఁజెంది ♦ నట్టి పురుషుఁ డ
వ్విను తావస్థను మోక్షం
బని చెప్పుదు రంతకంటె ♦ నధికము గలదే॥ శాంతి ౫-౬౧౯

క॥ గురుని వచనంబు తెలఁగునఁ
బరమార్థనిరూపణంబు ♦ పని నియతింద
త్పరుఁడై నడువం జాలిన
పురుషునిఁ దడయక ప్రశాంతి ♦ పొందునరేంద్రా॥ ౫-౬౨౧.

చ॥ జనవర సాంఖ్యమిట్టిది ప్ర ♦ జాపతి పూజ్యము బ్రహ్మభావభా
జనతఘటింప దీనిసరి ♦ సమ్యగుపాయము లెందులేవు ని
మ్మనమున సంశయింపక స ♦ మాహితచిత్తత దీనినూఁదు వి
స్తనుఁడగు నమ్మహేశునకుఁ ♦ దాఁదను వింకిట వేయునేటికిఁ॥
౬౨౨.

తే॥ వేదశాస్త్రపురాణ సం ♦ వేదితంబు
లైన బహువిధసంపరి ♦ జ్ఞానములకు
నెల్లనిది సేరుగడసూవె ♦ యేరులకు స
ముద్రమునుబోలె నుపశాంతి ♦ భద్రచిత్త॥ ౬౨౩.

## ౫౧ శ్రీ శంకరాచార్య విరచిత "అద్వైతోపదేశపంచరత్నమ్."

శ్లో॥ వేదోనిత్యమధీయతాం తదుదితం కర్మస్వనుష్ఠీయతాం
తేనేశస్య విధీయతా మపచితిః కామ్యేమతిస్త్యజ్యతాం
పాపౌఘః పరిధూయతాం భవసుఖే దోషోనుసంధీయతా
మాత్మేచ్ఛావ్యవసీయతా న్నిజగృహాత్తూర్ణం-రవినిర్గమ్యతాం॥౧

తా॥ (ఇందు ముముక్షువు ముక్తుడగువరకు క్రమాభ్యాసము ననుగ్రహించుచున్నారు). నిత్యమును వేదాధ్యయనము చేయుచు నందు చెప్పబడిన కర్మలను ప్రతిఫలాపేక్షనువిడిచి ఈశ్వరార్పణముగా జేయుచు కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములవలన పాపములను బోగొట్టుకొని సంసారసుఖమునందు దోషదర్శనమునుచేయుచు ఆత్మవిచారణయందు బుద్ధిని నిలిపి శీఘ్రముగా స్వగృహమును విడిచి పోవలయును.

శ్లో॥ సంగస్సత్సు విధీయతాం భగవతో భక్తిర్దృఢాధీయతాం|
శాంత్యాదిః పరిచీయతాం దృఢతరం కర్మాసు సంత్యజ్యతాం|
సద్విద్వానుపసేవ్యతా మనుదినం తత్పాదుకే సేవ్యతాం|
బ్రహ్మైకాక్షరమర్థ్యతాం శ్రుతిశిరోవాక్యం సమాకర్ణ్యతాం॥
[౨॥

తా॥ సత్పురుషుల సాంగత్యముచే భగవంతునియందు దృఢమైన భక్తినిగలిగి శమదమాదిసంపదను పొంది సంపూర్ణముగా కర్మలను బరిత్యజింపవలయును. (అనగా కర్మసన్యాసమును జేయవలయుననుట.) అనంతరము బ్రహ్మజ్ఞుడగు యతినిబొంది నిత్యమును వారి పాదసేవ జేయుచు బ్రహ్మపదార్థమును గురించి వారినిప్రార్థించి వేదాంతవాక్యములను వినుచుండవలయును.

శ్లో॥ వాక్యార్థశ్చ విచార్యతాం శ్రుతిశిరః పక్షస్సమాశ్రీయతాం|
దుస్తర్కాత్సువిరమ్యతాం శ్రుతిమతస్తర్కోఽనుసంధీయతాం|
బ్రహ్మాస్మీతి విభావ్యతా మహరహర్గర్వః పరిత్యజ్యతాం|
దేహేఽహంమతిరుజ్ఝ్యతాం బుధజనైర్వాదస్సముత్సృజ్యతాం॥౩॥

తా॥ కుతర్కములలోనుంచి విరమించి శ్రుతిసమ్మతమైన తర్కము ననుసరించి మహావాక్యార్థములను విచారించుచు "బ్రహ్మాస్మీ" త్యాది మహావాక్యానుసంధానముచే బ్రహ్మభావమును జేయుచు ప్రతిక్షణమునను గలిగెడిగర్వమును విడిచి దేహమే నేననుభావమును పోగొట్టుకొని పెద్దలతో వివాదమును పూర్తిగా వదలవలయును.

శ్లో॥ క్షుద్వ్యాధిశ్చ చికిత్స్యతా మనుదినం భిక్షౌషధంభుజ్యతాం।
స్వాద్వన్నం నతుయాచ్యతాం విధివశాత్ప్రాప్తేన సంతుష్యతాం।
ఔదాసీన్యమభీప్స్యతాం జనకృపానైష్ఠుర్య ముత్సృజ్యతాం।
శీతోష్ణాది విషహ్యతాం నతువృథావాక్యం సముచ్చార్యతాం॥
॥౪

తా॥ భిక్షాటనముచే ప్రాప్తించిన యన్నముతో నాకలిని బోగొట్టుకొనుచు, రుచ్యమగు నాహారముకొరకు యత్నింపక విధివశముచేత ప్రాప్తించినదానితో సంతృప్తినిబొంది జనులయెడ నిగ్రహానుగ్రహములు జూపక యుపేక్షించి శీతోష్ణాది ద్వంద్వసహిష్ణుత గలిగి వృథా వాక్యముల నుచ్చరింపక మౌనమును బొందవలయును.

శ్లో॥ ఏకాంతే సుఖమాస్యతాం పరతరే చేతస్సమాధీయతాం
పూర్ణాత్మా సుసమీక్ష్యతాం జగదిదం తద్బాధితం దృశ్యతాం
ప్రాక్కర్మాపి విలాప్యతాం చితిబలా న్నాప్యుత్తరై శ్లిష్యతాం
ప్రారబ్ధం త్విహభుజ్యతా మథపరబ్రహ్మాత్మ నాస్థీయతాం
॥ ౫॥.

తా॥ ఏకాంతమందు (చిత్తవిక్షేపములేక) సుఖముగానుండి పరమాత్మయందు మనస్సును నిలుపవలయును. (సమాధి నభ్యసించవలయును.) ఈ జగమును పరిపూర్ణమగు నాత్మస్వరూపముగా చూచి నామరూపములయొక్క బాధను (అనగా మిథ్యాత్వమును) చూడవలయును. సంచిత, ఆగామికర్మలు జ్ఞానాగ్నిచే దహింపబడగా ప్రారబ్ధానుభవమును బొందుచు పరమాత్మయందు యునికిని (నిత్యసమాధిని) బొందవలయును.

## ౫౨. శ్రీశంకరాచార్యకృత కౌపీనపంచరత్నమ్.

శ్లో॥ వేదాంతవాక్యేషు సదారమంతః।
భిక్షాన్నమాత్రేణచ తుష్టిమంతః।
విశోకమంతః కరణేరమంతః।
కౌపీనవంతః ఖలుభాగ్యవంతః॥ ౧॥

మూలంతరోః కేవలమాశ్రియన్తః।
పాణిద్వయం భోక్తు మమంత్రయన్తః।
శ్రియఞ్చ కన్థామివ కుత్సయన్తః।
కౌపీనవన్తః ఖలుభాగ్యవంతః॥౨॥

దేహాదిభావం పరిమార్జయన్తః।
ఆత్మానమాత్మన్యవలోకయన్తః।
నాంతం నమధ్యం నబహిస్మరంతః।
కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః॥ ౩॥

శ్లో॥ స్వానందభావే పరితుష్టిమన్తః।
సశాంతసర్వేంద్రియ తృప్తిమన్తః।
అహర్నిశం బ్రహ్మణియేరమన్తః।
కౌపీనవంతః ఖలుభాగ్యవన్తః ॥౪॥

శ్లో॥ పఞ్చాక్షరం పావనముచ్చరన్తః।
పతింపశూనాం హృదిభావయన్తః।
భిక్షాశనాదిక్షుపరిభ్రమన్తః।
కౌపీనవన్తః ఖలుభాగ్యవన్తః॥౫॥

శ్లో॥ కౌపీనపంచరత్నస్య మననం యాతియోనరః।
విరక్తిధర్మవిజ్ఞానం లభతే నాత్రసంశయః॥౬॥

తా॥ వేదాంతవాక్యములయందు ఎప్పుడును రమించువాడును, భిక్షాన్నమాత్రముచేతనే సంతుష్టినొందువాడును, శోకములేక యంతఃకరణమందు రమించువాడును, కేవలవృక్షమూలము నాశ్రయించువాడును, ఆమంత్రితత్తుగా దోసిలితో భుజించువాడును, దిగంబరుడును, దేహభావమును బోగొట్టికొనినవాడును తనను (జీవాత్మను) పరమాత్మయందు దర్శించువాడును, ఆదిమధ్యాంతములయందు (త్రికాలములయందు) బాహ్యమందలి విషయరూపజగమ్మును స్మరించని

వాడును, ఆత్మానందమునందు తృప్తినొందినవాడును, శాంతుడును, సర్వేంద్రియతృప్తిగలవాడును, రాత్రింబవళ్లు పరమాత్మయందు రమించువాడును, పావనమగు పంచాక్షరీమంత్రము నుచ్చరించువాడును, పశుపతియైన పరమశివుని హృదయమందు భావించువాడును, భిక్షాన్నముకొరకు దిక్కులయందు (అనగా ఏకస్థలనివాసియై గృహస్థులను భిక్షకొరకు బాధించువాడుగాక) తిరుగువాడుననగు సర్వసంగపరిత్యాగియైన బ్రహ్మనిష్ఠుడే ధన్యుడు. ఈకౌపీనపంచరత్నము నెవరైతే మననముచేయుచున్నారో వారికివైరాగ్యము, ధర్మము, అనుభవజ్ఞానము, సంశయములేకుండా లభించును.

## ౫౩ బ్రహ్మవిదా శీర్వాదపద్ధతి.

౧. హిరణ్యగర్భాది స్థావరాంతేషు శరీరేషు యదేకంచైతన్యమస్తి తదేవాహమస్మీతి దృఢజ్ఞానసిద్ధి ర్భూయాత్ ॥

తా॥ చతుర్ముఖబ్రహ్మమొదలు స్థావరమువరకుగల శరీరములయం దేచైతన్యమున్నదో యదే నే ననెడి దృఢజ్ఞానసిద్ధి కలుగునుగాక.

౨. లయవిక్షేప కషాయరసాస్వాదేభ్యో రక్షితం మేచిత్తమవిఘ్నేన బ్రహ్మణ్యవస్థితం భూయాత్ ॥

తా॥ లయవిక్షేపకషాయరసాస్వాదనములవలన రక్షింపబడిన నాచిత్తము విఘ్నములేనిదిగా బ్రహ్మమునందు నెలకొనునట్లగుగాక.

[లయము=అనగా ఆలస్యము (సోమరితనము) చేగాని, నిద్రచేగాని వృత్తిరహితమైనది.
విక్షేపము=వృత్తి బహిర్ముఖమగుట.
కషాయము=రాగాదిదోషములవలన బహిర్ముఖమైన సంస్కారము.
రసాస్వాదనము=యోగికి సమాధియందు విక్షేపమువలన గలిగినదుఃఖనివృత్తిచే నే యానందము కలుగుచున్నదో దానియనుభవము.
ఈ నాలుగును నిర్వికల్పసమాధికి ప్రతిబంధకములు.

౩. నిత్యనిర్వికారాసంగాద్వితీయ పరిపూర్ణసచ్చిదానన్ద స్వప్రకాశ చిదేకరస బ్రహ్మానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ నిత్యమై, నిర్వికారమై, అసంగమై, అద్వితీయమై, పరిపూర్ణమై, సచ్చిదానందమై, స్వప్రకాశమై, చిదేకరసమై, యొప్పు బ్రహ్మానుభవసిద్ధికలుగునుగాక.

౪. అహమాది దృశ్యవిలక్షణాస్మ త్ప్రత్య యానుభూతప్రత్యక్ చిన్మాత్రానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ నేను మొదలగు దృశ్యములకు వేరుగా నేను అనెడి జ్ఞానముచేత ననుభవింపబడు ప్రత్యక్ చిన్మాత్రానుభవసిద్ధి కలుగును గాక.

౫. సజాతీయ విజాతీయ, స్వగతభేద రహితాఖండ సచ్చిదానందానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ సజాతీయ, విజాతీయ స్వగతభేదములేని అఖండసచ్చిదానందానుభవసిద్ధి కలుగునుగాక.

నిత్యశుద్ధ బుద్ధముక్త సత్యపరమానన్దాఽద్వితీయబ్రహ్మానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమై, సత్యమై, పరమానందమై, అద్వితీయమై యుండునట్టి బ్రహ్మానుభవసిద్ధి కలుగునుగాక.

౭. స్వగతాదిభేదరహిత సచ్చిదానందలక్షణ బ్రహ్మాభిన్నకూటస్థ ప్రత్యక్ స్వరూప సర్వసాక్షి చిద్రూపానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ స్వగతాదిభేదములేని సచ్చిదానందలక్షణ బ్రహ్మాభిన్నకూటస్థ ప్రత్యక్స్వరూప సర్వసాక్షియైన చిద్రూపానుభవసిద్ధి కలుగునుగాక.

౮. స్వాత్మనోఽన్యత్వేన ప్రతిభాతం సకలం సాక్ష్యం జగత్ స్వాఽవిద్యావిలసితత్వేన స్వాఽనన్యత్వాత్ స్వాత్మమాత్ర మిత్యద్వితీయ బ్రహ్మాత్మానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ తనయొక్క యాత్మకు వేఱుగా సకల సాక్ష్యమైన జగమును, తనయొక్క యవిద్యచేత ప్రవేసించునట్టి స్థితివలన తనకన్యము గాకుండు తన యాత్మమాత్రమే యనెడి యద్వితీయ బ్రహ్మానుభవసిద్ధి కల్గునుగాక.

౯. అసంభావనా విపరీతభావనా రహితత్వేన కరతలామలకవ దహంబ్రహ్మాఽస్మీ త్యప్రతిబన్ధాఽపరోక్ష బ్రహ్మాత్మ సాక్షాత్కారో దృఢీభూయాత్॥

తా॥ అసంభావనయు విపరీతభావనయు లేని స్థితిగా కరతలామలకమువలె నేను బ్రహ్మమనెడి ప్రతిబంధములేని యపరోక్ష బ్రహ్మాత్మసాక్షాత్కారము దృఢమగునుగాక.

౧౦॥ యా బ్రహ్మాది స్తంబపర్యంతానాం సర్వేషాం ప్రాణినాం దేహమధ్యే తత్తద్దేహసాక్షిత్వేన భాసమానః పరిపూర్ణాత్మాస్తి సోఽయం పరమాత్మా కేవలం ముముక్షోః పురుషస్య మేస్వరూప మిత్యేవంరూపాత్మ సాక్షాత్కారోదృఢీభూయాత్॥

తా॥ బ్రహ్మమొదలు స్థావరమువరకుగల సకలజీవులయొక్క దేహమధ్యమునందు నాయా దేహసాక్షిత్వముగా ప్రకాశించు పరిపూర్ణాత్మగలదో, యట్టియీ పరమాత్మ కేవలము ముముక్షుపురుషుడైన నాయొక్క స్వరూపమే యనెడి యాత్మసాక్షాత్కారస్థితి నాకు దృఢమగునుగాక.

౧౧. ఇదంసర్వమాత్మైవ ప్రతీయ మానంతు రూపరసాదికం జగన్మాయామయం నత్వేతద్వస్తుతోఽస్తీతి తత్త్వనిశ్చయో మే దృఢీభూయాత్॥

తా॥ ఈ సకల ప్రపంచమును ఆత్మయే! కనబడునట్టి రూప రసాదిజగము మాయయే! వాస్తవముగాలేదు. అనెడి తత్త్వనిశ్చ యము నాకు దృఢమగునుగాక.

౧౨. వాసనాక్షయ మనోనాశ తత్త్వజ్ఞానాభ్యాస వశాత్॥
జ్ఞానరక్షాతపస్సిద్ధిః సర్వసమత్వం దుఃఖనివృత్తిః
సుఖావిర్భావ ఇత్యేతత్పఞ్చప్రయోజనసిద్ధి ర్భూయాత్.

తా॥ వాసనానాశమువలనను, మనోనాశమువలనను, తత్త్వ జ్ఞానాభ్యాసమువలనను, (కలిగిన) జ్ఞానరక్ష, తపస్సిద్ధి, సర్వసమ త్వము, దుఃఖనివృత్తి, సుఖావిర్భావము, అనునీ యయిదు ప్రయోజన ములయొక్క సిద్ధి కలుగునుగాక.

౧౩. మైత్రీ కరుణాముదితోపేక్షేతి సద్వాసనాపాటవేన
రాగాది దుర్వాసనాక్షయః సమ్యగ్భూయాత్॥

తా॥ మైత్రీ కరుణ, ముదిత,ఉపేక్ష, అనెడి శుభవాసన యొక్క దృఢాభ్యాసమువలన రాగాది మలినవాసనానాశముచక్కగా గలుగునుగాక.

మైత్రి= సత్పురుషులయందు గలుగు స్నేహము;
కరుణ= దీనులయందు గలదయ;
ముదిత= సత్కార్యములు చేయువారియందు గలసంతోషము;
ఉపేక్ష= దుర్మార్గులయందు తృణమువలెప్రియాప్రియములు లేకుండుట;

౧౪. నిరంతరాత్మానుసంధానవశాన్మనసో వృత్తిరూపపరిణామ
పరిత్యాగేన నిరుద్ధతాకారే ణాత్మపరిణామో దృఢీభూయాత్॥

తా॥ సదా ఆత్మానుసంధానము జేయుటవలన మనస్సు నకు వృత్తిరూపపరిణామము నివృత్తియగుటచే నిరోధింపబడినట్టి స్థితిస్వరూపమైన ఆత్మపరిణామము దృఢమగునుగాక.

౧౫. శమాదిపూర్వక శ్రవణమననదిధ్యాసనాభ్యాస బలాద్వి షయాసక్తిః ప్రజ్ఞామాన్ద్యం కుతర్కో విపర్యయ దురాగ్రహశ్చేతి వర్తమానప్రతిబంధ చతుష్టయనివృత్తిద్వారా అప్రతిబన్ధాప రోక్షబ్రహ్మసాక్షాత్కారో దృఢీభూయాత్.

తా॥ శమాదిషట్కసంపత్తిని మున్నుగాగల్గిన శ్రవణము, మననము నిధి ధ్యాసనములయొక్క అభ్యాసబలమువలన విషయా సక్తి ప్రజ్ఞామాంద్యము కుతర్కము విపర్యయదురాగ్రహము అను నీవర్తమాన ప్రతిబంధము నాలుగింటి యొక్క నివృత్తివలన ప్రతిబం ధములేని యపరోక్షబ్రహ్మసాక్షాత్కారము దృఢమగునుగాక.

౧౬. ఉపక్రమాది బహువిధలిఙ్గైరశేషవేదాన్తానామద్వైతేబ్రహ్మ ణి తాత్పర్యావధారణం దృఢీభూయాత్.

తా॥ ఉపక్రమము మొదలగు ఆఱులింగములచేత సకలమైన యుపనిషత్తులకును అద్వైతబ్రహ్మమునందు తాత్పర్యనిశ్చయముచేయు ట దృఢముగా కలుగునుగాక.

౧౭. శ్రీ గురుముఖాచ్ఛ్రుతస్యాఽద్వితీయవస్తునో వేదాన్తానుగుణ యుక్తిభి రనవరతమనుచిన్తనం భూయాత్॥

తా॥ శ్రీగురుముఖముగా వినినట్టి అద్వైతవస్తువును వేదాంత మున కనుగుణమైన యుక్తులచేత సదాచింతించుట కలుగునుగాక.

౧౮. విజాతీయదేహాది ప్రత్యయాన న్తరిత సజాతీయ సచ్చిదానందా త్మ ప్రత్యయప్రవాహో నిరంతరం భూయాత్.

తా॥ విజాతీయదేహాది ప్రత్యయము (జ్ఞానము) యొక్క యాంతరితమైన సజాతీయ సచ్చిదానందాత్మయొక్క జ్ఞానము సర్వకాల సర్వావస్థలయందును కలుగునుగాక.

అంతరితము=తనకంటె వేఱైనవస్తువు కలదనెడి జ్ఞానము లేకుండుట అనగా తనకంటె వేఱైనవస్తువు కలదని మధ్యకాలమందు తోపకుండుట.

౧౯. అసంగోహం చిదాత్మాహమితి ప్రత్యగాత్మని నివేశితే వృత్తిర హితే సంస్కారభేదమాత్రతయా సూక్ష్మరూపేణావస్థితేచిత్తే ఆత్మనః స్వరూపభూత పరమానందో నిరంతరం సమ్యగావి ర్భూయాత్ ॥

తా॥ నేను అసంగుడను, నేనుచిదాత్మ యనెడి. ప్రత్యగా త్మయం దుంపబడిన వృత్తిరహితసంస్కారభేదమాత్రముగను సూక్ష్మ స్వరూపముగను, నెలకొనియుండు చిత్తమునందు ఆత్మయొక్క స్వరూ పభూతమైన పరమానందము, నిరంతరమును చక్కగా ప్రకాశించును గాక.

అవిర్భావము=మొదట తెలియకూడనిదిగా మరుగైయున్న ఒక వస్తు వు తర్వాత తెలియబడుట.

౨౦. అహమాత్మా సాక్షి కేవలచిన్మాత్రస్వరూపో నాజ్ఞానం తత్కార్యంచ కింతునిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానందా ద్వయం బ్రహ్మైవాహమస్మీత్యభేదేనావస్థాన స్సమాధిర న్తస్స మాధినా దృగ్దృశ్యవివేకే బహిస్సమాధినా బ్రహ్మసర్గవివేకేచ దృఢేజ్ఞాతే తేన వివేకద్వయేనాయం విగాహితదేహాభిమానో విజ్ఞాతమాత్మ తత్త్వశ్చ సదాభూయాత్ ॥

తా॥ నేను ఆత్మ, నేను సాక్షి, నేను కేవలచిన్మాత్రుడను, అజ్ఞానమును దానికార్యమును (నాకు) లేదు. మఱియు నిత్యమై, శుద్ధమై, బుద్ధమై, ముక్తమై, పరమానన్దాఽద్వయ పరబ్రహ్మమై నేనున్నాడను; అనెడి అభేదముగా (మనస్సు) నెలకొనుట సమాధి. అంతరసమాధిచేత దృగ్దృశ్యవివేకమును, బాహ్యసమాధిచేత బ్రహ్మ

సర్గవివేకమును, దృఢముగా తెలియబడినప్పుడు ఆ రెండువివేకముల చేతను వీడు దేహాభిమానము లేనివాడుగను, ఆత్మతత్త్వమును దెలిసి కొనినవాడుగను నిరంతరముండుఁగాక.

౨౧. దేహాద్బహిః సకలనామరూపాత్మకేషు వస్తుష్వపి సర్పధారాదిషు రజ్జురివవ్యాప్తః | సచ్చిదానందలక్షణోయః పరమాత్మా సఏవ పరశబ్దేనోచ్యతే. అన్తరహమాది దృశ్యవిలక్షణోఽస్మత్ప్రత్యయాలంబనభూతః ప్రత్యక్చిన్మాత్రరూపః సాక్ష్యాఖ్యోయోజీవాత్మా సఏవాఽపరశబ్దో నోచ్యతే. పరశ్చాసావవరశ్చేతి పరావరః ప్రత్యగభిన్నః పరమాత్మా సఏవ మన్తర్బహిః పరరూపేణాఽపరరూపేణ చావస్థితే పరమార్థతః పరావర విభాగరహితే ప్రత్యగభిన్నే పరావరే బ్రహ్మణిత్వం వాహ మస్మి భగవోదేవతేఽహం వాత్వమసీతి శ్రుత్యనుసారేణాహం బ్రహ్మాస్మి బ్రహ్మైవాహమస్మీతి వ్యతిహారేణాఽఖణ్డైకరసత్వేన సాక్షాత్కృతే సతి తేనపరావరబ్రహ్మ సాక్షాత్కారేణాస్య పరావరబ్రహ్మ సాక్షాత్కృతవతో మమమహ్యాదయుగ్రన్థిభేదః సర్వసంశయ నివృత్తిః సర్వకర్మక్షయరూపః పరమపురుషార్థః సమ్యగావిర్భాయాత్ ॥

తా॥ శరీరమునకు బయట సకలమైన నామరూపాత్మక వస్తువులయందును, సర్పము ధార మొదలగువానియందు దారమువలె వ్యాపించియున్నట్టి సచ్చిదానందపరమాత్మ యేదియో, అదే పర మనిచెప్పబడుచున్నది. లోపల నేను మొదలగు దృశ్యవిలక్షణమై, నేనుఅనెడి ప్రత్యయముయొక్క సంబంధముతో గూడినట్టి ప్రత్యక్ చిన్మాత్రస్వరూపమైన సాక్షియనెడి పేరుగల జీవాత్మ యేదియో, అది అవరము, అనిచెప్పబడుచున్నది పరమే అవరమనుటచేత పరావరమనునది ప్రత్యగభిన్నపరమాత్మయని యెఱుంగునది. అదియే లోపలను బయటను, పరరూపముగను అవరరూపముగను నుండునదియును.

పరమార్థముగా పరావరవిభాగములేనిదిగ నుండునట్టి ప్రత్యగభిన్న పరావరబ్రహ్మము. "భగవంతుడా! దేవుడా! నీవేనేను, నేనే నీవు" అనెడి ఉపాధ్యుక్తమైన నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేను అనెడి వ్యతిహారముచేత, అఖండైకరసముగా సాక్షాత్కరింపబడినప్పుడు అపరావర బ్రహ్మసాక్షాత్కారముచేత ఈపరావరబ్రహ్మ సాక్షాత్కారముచే యించెడి నాకు హృదయగ్రంథిభేదమును సర్వసంశయనివృత్తియును, సకలకర్మక్షయరూపమును, అయిన పరమపురుషార్థము చక్కగా ప్రకాశమగునుగాక.

వ్యతిహారము = ఓతప్రోతభావము.

౨౨. అహఙ్కారాత్మనో రేకత్వ భ్రమనివృత్తిరూపో౽యం గ్రంథి భేదో దృఢీభూయాత్ ॥

తా॥ అహంకారము, ఆత్మయను నీరెండును, ఒక్కటే యనెడి భ్రమను నివృత్తిజేయునట్టి ఈ గ్రంధిభేదనము దృఢమగునుగాక.

౨౩. ఆత్మా దేహాది వ్యతిరిక్తో నవా; వ్యతిరిక్తత్వే౽పి కర్తృత్వాది ధర్మయోగీనవా! అకర్తృత్వే౽పి తస్యబ్రహ్మణో౽భేదో౽స్తివా నవా; అభేదే౽పి తత్ జ్ఞానం కర్మాదిసహితం ముక్తిసాధనం కేవ లంవా; కేవలే౽పి ఆత్మా సాక్షీవా కర్తావా; సాక్షిత్వేప్యస్య బ్రహ్మత్వమస్తివానవా; బ్రహ్మత్వేపితద్బుద్ధ్యా వేదితుం శక్యం వానవా; శక్యత్వే౽పి తద్వేదన మాత్రేణ ముక్తిరస్తి వానవా; మమపరమార్థతో బ్రహ్మత్వమస్తివానవా; బ్రహ్మత్వే౽పితా దృగ్రూపం మమసాక్షాత్కృతంవానవా; సాక్షాత్కృతే౽పి ఇతఃపరం కర్తవ్యమస్తివానవా; కర్తవ్యాభావే౽పిఇదానీం మమ జీవన్ముక్తత్వమస్తివానవా; జీవన్ముక్తత్వే౽పి వర్తమాన దేహాపా తానంతరంవిదేహముక్తిర్భవిష్యతివానవా,తత్ప్రాప్తావపికాలాం తరేషు పునర్జన్మభవిష్యతివానవా;ఇత్యాది సర్వసంశయనివృత్తి ర్భూయాత్ ॥

తా॥ ఆత్మ, దేహాదులకంటె వేఱైనదా? కాదా? వేఱైనది గానుండునెడల కర్తృత్వాది ధర్మసంబంధము కలదా? కాదా? కర్తృత్వములేనిదిగా నుండినను దానికిని బ్రహ్మమునకును అభేదమున్నదా? లేదా? అభేదముండినను దానియొక్క జ్ఞానము కర్మాదులతోఁగూడిన నదై ముక్తికిసాధనమైనదా! అట్లుగాక ప్రత్యేకముగానైనను ముక్తికి సాధనమా? ప్రత్యేకముగానైనను ఆత్మసాక్షియా? కర్తయా? సాక్షిత్వముండినను దీనికి బ్రహ్మత్వము కలదా? లేదా? బ్రహ్మత్వముండినను అజ్ఞానము చేతనే తెలిసికొన దగినదా? తెలిసికొనుటకు సాధ్యముకానిదా? తెలిసికొనుటకు సాధ్యమైనను ఆ తెలివిమాత్రము చేతనే ముక్తికలదా? లేదా? నాకు పరమార్థముగా బ్రహ్మత్వము కలదా? లేదా? బ్రహ్మత్వము కలదియైనను తత్స్వరూపము నాకు సాక్షాత్కారమగునా? కాదా? సాక్షాత్కారమైనను దీనికంటె వేరేకర్తవ్యము కలదా! లేదా? కర్తవ్యములేకపోయినను ఇప్పుడునాకు జీవన్ముక్తి కలదా? లేదా! జీవన్ముక్తి కలదైనను వర్తమానశరీరము పోయినమీద విదేహముక్తి కలుగునా? కలుగదా? అదిలభించినను కాలాంతరముల యందు మఱల జన్మము కలుగునా? కలుగదా? అనునీ మొదలగు సకల సంశయములయొక్క నివృత్తి కలుగునుగాక.

౨౮. అనారబ్ధానా మాగామి జన్మహేతునా మనేకకోటి జన్మార్జితానాం ప్రారబ్ధవ్యతిరిక్తానాం సఞ్చితకర్మణాం నివృత్తిరూపః పరమపురుషార్థః సమ్యగ్భూయాత్ ।

తా॥ ఆరంభింపనిదియు, రాగల జన్మములకు కారణమైనవియును, అనేకకోటి జన్మములయందు సంపాదింపబడినవియును, ప్రారబ్ధకర్మములకు వేఱైనవియును అగుసంచితకర్మములయొక్క నివృత్తి రూపపరమపురుషార్థము చక్కగా గలుగునుగాక.

౨౯. యత్పూర్ణానందైకబోధస్య బ్రహ్మాహమస్మీతి బ్రహ్మాత్మానుభవమాత్ర పర్యవసానే బుద్ధి ర్నిరంతరం భూయాత్,

॥ ఏది పూర్ణానందైకబోధమో ఆబ్రహ్మము నేననెడి బ్రహ్మాత్మానుభవమాత్రనిశ్చయమునందు బుద్ధియెల్లప్పుడు నుండునుగాక.

౨౬. యస్మిన్కాలే ద్వైతభానం నాస్తి. నిద్రాపి నాగచ్ఛతి. తస్మిన్కాలే ఉపలభ్యమానం యత్సుఖమస్తి. సబ్రహ్మానంద ఇతి బ్రహ్మానందానుభవ సిద్ధి ర్నిరంతరం భూయాత్॥

తా॥ఏకాలమునందు ద్వైతము గోచరించుటలేదో, నిద్రయు రాదో, ఆకాలమునందు తెలియబడునట్టి సుఖమేదికలదో అదిబ్రహ్మానందము అనెడి బ్రహ్మానందానుభవసిద్ధి సర్వదా కలుగునుగాక.

౨౭. మనోవ్యాపారభావసమయే యత్సుఖం భాసతే తత్సుఖమాత్మస్వరూప మిత్యాత్మనిశ్చయః సమ్యగ్భూయాత్॥

తా॥ మనోవ్యాపారములేని సమయమునందు ఏసుఖము గోచరించునో యాసుఖమాత్మస్వరూపమనెడి యాత్మనిశ్చయము లెస్సగా గలుగునుగాక.

౨౮. స్వస్వప్నః స్వాతిరేకేణ యథానాస్తి తథైవ జాగ్రదపి స్వాతిరేకేణ నాస్తీత్యాద్వయాత్మానుభవః సమ్యగ్భూయాత్॥

తా॥ తనయొక్కస్వప్నము తనకు వేరుగా నెట్లులేదో అట్లే జాగ్రమును తనకు వేఱుగాలేదనెడి అద్వయాత్మానుభవము చక్కగా గల్గునుగాక.

౨౯. వాసనాక్షయ మనోనాశాభ్యాం నిర్వాసనే వృత్తిశూన్యేచిత్తే సంశయవిపర్యయ దోషద్వయాభావేన ప్రతిబన్ధాదుత్పన్నం తత్త్వజ్ఞాన మబాధితత్వేన సురక్షితం భూయాత్॥

తా॥ వాసనాక్షయము, మనోనాశము అనునీరెంటిచేతను వాసనలేని వృత్తిశూన్యమైన చిత్తమునందు సంశయము విపర్యయము,

అనుశోకములు రెండును లేనందువలన ప్రతిబంధము కలుగమిచే బుట్టి నతత్త్వజ్ఞానము బాధింపబడకుండునట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక.

౩౦. పంచమ్యాది భూమిత్రయరూపాయాం జీవన్ముక్తౌ సంపాద్యమానాయాం ద్వైతాభాసాభావేన సంశయ విపర్యయ ప్రసంగాభావా దుత్పన్నం తత్త్వజ్ఞాన మబాధితత్వేన సురక్షితం భూయాత్ ॥

తా॥ అయిదు మొదలు మూడుభూమికలయొక్క స్వరూపమైన జీవన్ముక్తి లభించునప్పుడు ద్వైతము గోచరింపమిచే సంశయవిపర్యయ ప్రసంగము లేనందువలన కలిగినట్టి తత్త్వజ్ఞానము బాధింపబడనియట్లు చక్కగా రక్షింపబడినది యగుగాక.

౩౧. స్వప్నే స్థూలశరీరాభావేపి యస్మిన్ జాగ్రదాద్యవస్థా చతుష్టయే యశ్చిద్రూపాత్మా మణిసూత్రమివానుస్యూతతయా నిరన్తరం భాసతే సచ్చిద్రూపాత్మైవాహమస్మీతి. శరీరత్రయం నాహమస్మీత్యన్వయవ్యతిరేకాభ్యాం శరీరత్రయస్య వ్యావృత్తిం తత్సాక్షిచైతన్యస్యానువృత్తించ పశ్యతోమమ శరీరత్రయ వ్యతిరిక్తత్వానుభవః సమ్యగావిర్భూయాత్ ॥

తా॥ స్వప్నమునందు స్థూలశరీరము కనబడకపోయినను ఈజాగ్రము మొదలగు నాలుగవస్థలలో ఏచిత్స్వరూపమైన ఆత్మ మణులయందు దారమువలె ఎల్లప్పుడును కనబడుచున్నదో, ఆచిత్స్వరూపమైన ఆత్మయే నేను; శరీరత్రయములు నేనుకాను; అనెడి అన్వయవ్యతిరేకములచేత త్రివిధశరీరములయొక్క వ్యావృత్తి (లేకుండుట) యును, దానిసాక్షి చైతన్యముయొక్క అనువృత్తియును (నిశ్చయము) చూచుచుండువాడ, శరీరత్రయములయొక్క వ్యతిరేక (వేఱుపడిన) స్థితియొక్క అనుభవము చక్కగా బయలుపడునుగాక.

౩౨. భగవన్తం పరమేశ్వరం ప్రీతిపూర్వకం భజతో మమోపర్యను
గ్రహార్థం భగవాన్ వాసుదేవ ఆత్మభావస్థః సన్ వివేకరూపే
ణ భక్తప్రసాద స్నేహాసిక్తేన మద్భావనాది నివేశ వాతేరితేన
బ్రహ్మచర్యాది సాధనసంస్కారవత్ప్రజ్ఞావర్తినా విరక్తాంతః
కరణాది కరణేన విషయవ్యావృత్త చిత్త రాగద్వేషా కలుషిత
నివాతాపవరకస్థేన నిత్యప్రవృత్తైకాగ్ర్యధ్యానజనిత సమ్య
గ్దర్శన భాస్వతాజ్ఞాన దీపేన అజ్ఞానజమవివేకతో జాతం మిథ్యా
ప్రత్యయరూపః మోహాంధకారం తమోనాశయ త్విత్యాశీర్ని
రంతరం భూయాత్॥

తా॥ భగవంతుడైన పరమేశ్వరుని ప్రీతిపూర్వకముగా భజించునట్టివాడైన నాయందు అనుగ్రహించునిమిత్తము భగవంతుడైన వాసుదేవుడు ఆత్మస్థితిగా నుండునట్టి వివేకస్వరూపమైన భక్తప్రసాదస్నేహము (తైలము)వలన తడుపబడినదియును, నాయొక్క భావనయనెడి యభినివేశవాయువుచేత ప్రేరేపింపబడినదియును, బ్రహ్మచర్యాది సాధనసంస్కారముగల తెలివియనెడి వత్తిగలదియును, విరక్తిగల అంతఃకరణము ఆధారముగాగల విషయములనుండి వేఱుపడిన చిత్తమనెడి రాగద్వేషాదులచే కలకబారునట్టి గాలిలేని ప్రమిదయం దుండునట్టిదియు, సదా ప్రవర్తించునట్టిదియు నగు ఏకాగ్రస్థితిచే, ధ్యానమువలన పుట్టిన సమ్యగ్దర్శనమనెడి ప్రకాశముగల జ్ఞానదీపముచేత, అజ్ఞానమువలన గల్గినదియును, అవివేకముచేబుట్టినదియును అగు మిథ్యాజ్ఞానస్వరూపమైన మోహాంధకారమైన చీకటి నాశమగుగాత. అనుఆశీర్వాదము నిరంతరము కల్గునుగాక.

౩౩. పరమేశ్వరం ప్రీతిపూర్వకం భజన్తో భక్తాయేన బుద్ధియోగేన
సమ్యగ్దర్శనలక్షణే నాత్మభూతం భగవన్తం పరమేశ్వర మాత్మ
త్వేనోపయాన్తి ప్రతిపద్యతేతం బుద్ధియోగం భగవాన్ వాసు
దేవో మే దదాత్విత్యాశీ ర్నిరన్తరం భూయాత్॥

తా॥ పరమేశ్వరుని ప్రీతితో భజించు భక్తులు ఏ శ్రేష్ఠమైన దర్శనమే లక్షణముగాగల బుద్ధి (జ్ఞాన) యోగముచేత ఆత్మస్వరూపమైన భగవంతుడగు పరమేశ్వరుని ఆత్మమాత్రముగా (గ్రహించి) పొందుచున్నారో (అనగా ఎఱుగుచున్నారో) అట్టిబుద్ధియోగమును భగవంతుడైన వాసుదేవు డొసంగునుగాత; అనెడి మంగళాశాసనము సర్వకాలమును కలుగునుగాక.

౩౫ అసంగోఽహం చిదాత్మాహ మితిప్రత్యగాత్మవినివేశితే వృత్తి రహితే సంస్కారశేషమాత్రతయా సూక్ష్మరూపేణావస్థితే చిత్తే ఆత్మనః స్వరూపభూతపరమానందో నిరంతరం సమ్యగా విర్భాయాత్॥

తా॥ నేను అసంగుడను, నేను చిదాత్మ, అనెడి ప్రత్యగాత్మయందు ప్రవేశింపబడిన వృత్తిరహితమైనదియై, సంస్కారశేష మాత్రత్వముగను, సూక్ష్మస్వరూపముగను నెలకొనియుండు చిత్తము నందు, ఆత్మయొక్క స్వరూపభూతమైన పరమానందము నెల్లప్పుడును చక్కగా బ్రకాశమగునుగాక॥

౩౬ వికారమన్తరేణ స్వాధ్యస్తం సర్వం సాక్షాదవ్యవధానేన స్వరూపాభేదేనేక్షన్తే పశ్యన్తీతి సాక్ష్యనుభవః సమ్యగ్భాయాత్॥

తా॥ వికారరహితమైన తనయందు అధ్యస్తమైన సర్వమును సాక్షాత్తుగా మఱుగులేని స్వరూపాభేదముగా తలంపబడుచున్నదియును, చూడబడుచున్నదియును అగు సాక్ష్యనుభవము చక్కగా గలుగునుగాక.

౩౭ దేహేంద్రియాది సకలజడావభాసకత్వేన చిద్రూపఇతిచిదాత్మానుభవః సమ్యగ్భాయాత్॥

తా॥ దేహేంద్రియాది సమస్తజడమును ప్రకాశింపజేయునట్టి దగుటచేత చిత్స్వరూపమనెడి చిదాత్మానుభవము లెస్సగా గలుగునుగాక.

౩౭ ఆత్మని కదాచిదప్రియత్వ భావేన పరమ ప్రేమాస్పదత్వేనచఆత్మా పరమానందరూప ఇత్యానందా త్మానుభవః సమ్యగ్భూయాత్ ॥

తా॥ఆత్మయందు ఒకప్పుడును అప్రియత్వము లేనందు చేతను ఉత్తమమైన ప్రియమునకు స్థానభూతమై యుండుటచేతను ఆత్మపరమానందస్వరూపమనెడి ఆనందాత్మానుభవము చక్కగా గలుగునుగాక.

౩౮ ఆత్మరూపస్య విశ్వస్య భానరూపచైతన్యస్య సన్నిధేర్వినాక దాచిద్భానా భావాద్భారూపాత్మా సర్వగత ఇతి సర్వగతా త్మానుభవః సమ్యగ్భూయాత్ ॥

తా॥ ఆత్మ ప్రకాశ స్వరూపమైన పంచము ప్రకాశస్వ రూపమైన చైతన్యముయొక్క సాన్నిధ్యములేక యొకప్పుడును ప్రకా శించుటలేదు. కనుక ప్రకాశస్వరూపకమైన ఆత్మ సమస్తమునందున్న దనెడి సమస్తమునందుండు ఆత్మానుభవము చక్కగా గలుగునుగాక.

౩౯ అసజ్జడదుఃఖాత్మకాహంకారాదిభ్యో విలక్షణతయా ప్రాతి కూల్యేన సత్యజ్ఞానానందరూపేణ చిత్తిః ప్రకాశక ఇతిప్రత్యగా త్మానుభవ సిద్ధిర్భూయాత్ ॥

తా॥ అసత్తును, జడమును, దుఃఖమును అగు అహంకారా దులకంటె విలక్షణమైయుండునట్టి దానికి ప్రతికూలస్థితిచే సత్య మును, జ్ఞానమును, ఆనందమును, స్వరూపముగాగల చిదాత్మ ప్రకాశ మగునదెడి ప్రత్యగాత్మానుభవసిద్ధి కలుగునుగాక.

౪౦ పశ్చాద్భాసమానస్య జడస్య ప్రథమతోభాసమానంచైతన్య మే వవాస్తవం రూపమితి నిశ్చిత్య జడముపేక్ష్య చిన్మాత్రమేవచిత్తం నిరంతరంభూయాత్ ॥

తా॥ తరువాత గోచరించు నట్టి జడమునకు పూర్వము గోచరించు చైతన్యమే, వాస్తవస్వరూపమని నిశ్చయించి, జడమును ఉపేక్షించి, చిన్మాత్రమేయని చిత్తము నిరంతర మగునుగాక.

౪౧ సర్వాణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతీతి వాక్యేన దేహేంద్రియాది సాక్షిరూపం యత్ప్రజ్ఞానం త్వం పదార్థరూపం నిర్ణీతం తదేవైవబ్రహ్మేత్యాది వాక్యేన జగత్కారణతయా నిర్ణీతం పరంబ్రహ్మ నచానయోరీషదపి భేదోఽస్తీతి ఐతరేయ మహావాక్యజన్య జ్ఞానసిద్ధి నిరంతరంభూయాత్ ॥

తా॥ ఇవియన్నియును ప్రజ్ఞానముయొక్క నామధేయముల గుచున్నవనెడి వాక్యముచేత దేహేంద్రియాది సాక్షిస్వరూపమైన ఏప్రజ్ఞానత్వంపదార్థస్వరూపము నిర్ణయింపబడినదో, అదే "ఇదిబ్రహ్మము" అను నిమొదలగువాక్యములచేత జగత్కారణముగా నిర్ణయింపబడిన పరబ్రహ్మమగును. ఈరెంటికిని కొంచెమైనను భేదము లేదు. అనెడి ఐతరేయోపనిషత్తునందు చెప్పబడిన మహావాక్యమువలన కలిగిన జ్ఞానసిద్ధి నిరంతరము కలుగునుగాక.

౪౨ యతఃసర్వత్రావస్థితం ప్రజ్ఞానం బ్రహ్మాఽతోమయ్యవస్థితం ప్రజ్ఞానం బ్రహ్మైవ ప్రజ్ఞానత్వా విశేషాది త్యైతరేయమహావాక్యోక్త జీవబ్రహ్మైక్య జ్ఞానసిద్ధి ర్నిరంతరం భూయాత్ ॥

తా॥ దేనివలన సకల స్థలములందుండు ప్రజ్ఞానము బ్రహ్మమో, దానివలన నాయందును నెలకొనియుండు ప్రజ్ఞానము బ్రహ్మమే. ప్రజ్ఞానత్వముయొక్క అభేదమువలననెడి ఐతరేయమహావాక్యమునందు చెప్పబడిన జీవబ్రహ్మైక్య జ్ఞానసిద్ధి నిరంతరముకలుగునుగాక.

౪౩ ఆత్మసన్నిధౌ విద్యమానత్వేవ జడరూపస్యాఽపి దేహేంద్రియాదేర్భాసమానత్వా దాత్మచిద్రూప ఇతి చిదాత్మానుభవః సమ్యగ్భూయాత్ ॥

తా॥ ఆత్మసన్నిధియందుండుటచేత జడస్వరూపమైన దేహాదులకును ప్రకాశత్వముండుటవలన ఆత్మచిత్స్వరూపమనెడి చిదాత్మానుభవము చక్కగాగల్గునుగాక.

౮౮ ఆత్మసహితత్వేన దుఃఖాత్మకస్య దేహాదేరపి ప్రియతమత్వాదాత్మపరానందరూప ఇత్యానందానుభవః సమ్యగ్భూయాత్॥

తా॥ ఆత్మతో గూడియుండుటచేత దుఃఖస్వరూపమైన దేహాదులకును మిక్కిలి ప్రియమునకు విషయమగు స్థితియుండుటచే ఆత్మపరమానందస్వరూపమనెడి ఆత్మానందానుభవము చక్కగా గలుగునుగాక.

౮౯ దేశతో కాలతో వస్తుతః పరిచ్ఛేదరహితాద్వితీయ బ్రహ్మానుభవసిద్ధి ర్భూయాత్॥

తా॥ దేశముచేతను, కాలముచేతను, వస్తువుచేతను, పరిచ్ఛేదములేని అద్వితీయ (రెండవది లేని) బ్రహ్మాత్మానుభవసిద్ధి కలుగునుగాక.

౯౦ పూర్వాఽపరపరామర్శమంతరేణ సహసోత్పద్యమానస్య క్రోధాదివృత్తివిశేషస్య హేతోశ్చిత్తసంస్కారస్య వివేకజన్యాయాం శాన్తివాసనాయాం దృఢాయాం సత్యాం నశ్యమానత్వాత్ బాహ్యనిమిత్తేన క్రోధాద్యనుత్పత్తిః సమ్యగ్భూయాత్॥

తా॥ ముందు వెనుక నాలోచింపక తటాలున (ఉన్నట్లుండి) కలుగుక్రోధము మొదలగు వృత్తివిశేషమునకు కారణమైన చిత్తమునందలి సంస్కారములు, వివేకమువలన గలిగినశాంతము మొదలగు వాసన దృఢమైనప్పుడు నశింపబడునదిగా నుండుటంబట్టి బాహ్యనిమిత్తముచేత క్రోధాదులు కలుగమి చక్కగా గలుగునుగాక.

౪౮ యస్య ప్రసాదాదహమేవ విష్ణుర్మయ్యేవసర్వం పరికల్పితం చే తీ
త్థమాత్మస్వరూపం విజానామి తస్యపాదారవిందయో రచఞ్చ
లాభక్తిర్నిరంతరం భూయాత్॥

తా॥ ఎవనియొక్క అనుగ్రహమువలన నేనేవిష్ణువును, నా
యందే సర్వమును కల్పింపబడియున్నది. అని యిట్లు ఆత్మస్వరూప
మును తెలియుచున్నాడనో, (అట్టి) భగవంతుని పాదరవిందములయం
దు అచంచల (దృఢ)మైనభక్తి యెల్లప్పుడు నుండునుగాక.

౪౯ అచిద్రూపస్య సర్వస్య జగతశ్చిత్సన్నిధౌ విద్యమానత్వా చ్చి
ద్రూపాత్మా సర్వగతఇతి సర్వగతాత్మానుభవః సమ్యగ్భ
యాత్॥

తా॥ అచిత్తుయొక్క స్వరూపముగానుండు సకలప్రపంచ
మును చిత్తుయొక్క సన్నిధియందుండుటవలన, చిద్రూపమైన ఆత్మ
సకలమునందున్నదనెడి సమస్తమునందుండు ఆత్మయొక్క అనుభవము
చక్కగా కలుగునుగాక.

౪౯ సర్వార్థసాధకత్వహేతునా సర్వసంబంధిత్వేన చాత్మాసర్వః పరి
పూర్ణ ఇతి పరిపూర్ణాత్మానుభవః సమ్యగ్భయాత్॥

తా॥ సకలవస్తువులకును సాధకమైయుండు కారణముచేత
ను, సమస్తవస్తువులతో సంబంధము కలదిగానుండుటచేతను, ఆత్మసక
లపరిపూర్ణుడనెడి పరిపూర్ణాత్మానుభవము చక్కగా కలుగునుగాక.

౫౦ దేశకాలావ్యవహితత్వేన పరోక్షహేతోరభావాత్ సాధనాంత
రనిరపేక్షతయా స్వయంప్రకాశమానశ్చిదాత్మా సర్వదాస్వ
తస్సిద్ధా పరోక్షరూప ఇత్యపరోక్షానుభవః సమ్యగ్భయాత్॥

తా॥ దేశకాలముల మరుగులేనిదిగానుండుటచేతను, పరో
క్షజ్ఞానమునకు కారణముకానిదగుటచేతను, ఇతరసాధనములయొక్క

అపేక్ష లేక తనంతట ప్రకాశించు చిదాత్మ ఎల్లప్పుడును స్వయముగా గల్గిన అపరోక్షస్వరూపుడు, అనెడి అపరోక్షానుభవము చక్కగా ప్రకాశించునుగాక.

౫౧ యత్ర యద్వస్తు వీక్షతే తేన వస్తునాऽన్యతా ప్రవన్యాగతత్వే నాత్మా అసఙ్గ ఇత్యసంగానుభవః సమ్యగ్భాయాత్ ॥

తా॥ ఎచ్చోట ఏపదార్థమును జూచుచున్నదో, ఆపదార్థములతో గూడ వేఱు వాటికి వెంబడించిరాకుండుటచేత, ఆత్మ అసంగుడనెడి అసంగానుభవము లెస్సగా కలుగునుగాక

౫౨ నిరవయవత్వే నాసంగత్వేన చాత్మనః కేనాపి సంబన్ధాऽభావాదాత్మా నిత్యముక్త ఇతి నిత్యస్వరూపాత్మానుభవః సమ్యగ్భాయాత్ ॥

తా॥ నిరవయవత్వముచేతను, అసంగత్వముచేతను, ఆత్మకు దేనితోను సంబంధము లేనందువలన ఆత్మ నిత్యముక్తుడనెడి నిత్యముక్తాత్మానుభవము బాగుగా గలుగునుగాక.

౫౩ అవేద్యత్వేऽసత్యపరోక్షవ్యవహారయోగ్యత్వా దాత్మా స్వయంప్రకాశ ఇతి స్వయంప్రకాశాత్మానుభవః సమ్యగ్భాయాత్ ॥

తా॥ తెలియబడినదిగానుండి అపరోక్షవ్యవహారమునకు తగినదిగా నుండుటంబట్టి ఆత్మ స్వయంప్రకాశమనెడి స్వయంప్రకాశాత్మానుభవము చక్కగా గల్గునుగాక.

౫౪ సాధనాంతరనిరపేక్షతయా స్వయమేవభాసమానత్వా దాత్మా స్వయం ప్రకాశ ఇతి స్వయం ప్రకాశాత్మానుభవః సమ్యగ్భాయాత్ ॥

తా॥ ఇతరసాధనమును గోరక తనంతటతానే ప్రకాశించు స్వరూపము కలదియగుటవలన, ఆత్మ స్వతఃప్రకాశము అనెడి స్వయంప్రకాశాత్మానుభవము చక్కగా కలుగునుగాక.

ఇతి శ్రీమద్విద్యారణ్యమునివిరచితా

బ్రహ్మవిదాశీర్వాదపద్ధతిః

సమాప్తా.

ఇట్లు శ్రీమద్విద్యారణ్యస్వామి విరచితమైన

బ్రహ్మవిదాశీర్వాదపద్ధతి

సమాప్తము.

౫౪ స్వరూపానుసంధానాష్టకం.

౧ తపోయజ్ఞదానాదిభిశ్శుద్ధబుద్ధి ।
ర్విరక్తోగ్రిజాతేః పదేతుచ్ఛబుద్ధ్యా ।
పరిత్యజ్యసర్వం యదాప్నోతితత్త్వం ।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

౨ దయాళుం పరబ్రహ్మనిష్ఠం ప్రశాంతం।
సమారాధ్య భక్త్యా విచార్యస్వరూపం।
యదాప్నోతితత్త్వం నిధిధ్యాస్య విద్వా।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

౩ యదానందరూపం ప్రకాశస్వరూపం।
నిరస్తప్రపంచం పరిచ్ఛేదశూన్యం।
అహంబ్రహ్మవృత్త్యైకగమ్యం తురీయం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

యదజ్ఞానతోభాతివిశ్వం సమస్తం।
ప్రణష్టంచ సద్యోయదాత్మప్రబోధే।
మనోవాగతీతం విశుద్ధం విముక్తం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

నిషేధేకృతేనేతి నేతీతివాక్యైః।
సమాధిస్థితానాం యదాభాతిపూర్ణం।
అవస్థాత్రయాతీత మద్వైతమేకం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

యదానందసారాసమానంహి విశ్వ।
గ్యధాభాతమన్యత్తధాభాతిసర్వం।
యదాలోచనేహేయమన్యత్సమస్తం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

అనంతంపరం నిర్వికల్పం నిరీహం।
శివం సంగహీనం యదాకారగమ్యం।
నిరాకారమేకం జగన్మృత్యుకృత్యం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

యదానందసింధౌ నిమగ్నః పుమాన్స్యా।
దవిద్యావిలాస స్సమస్తః ప్రపంచః।
యదానస్ఫురత్యద్భుతం యన్నిమిత్తం।
పరబ్రహ్మనిత్యం తదేవాహమస్మి॥

స్వరూపానుసంధానకోపిస్తుతిర్యః।
పఠేదాదరా ద్భక్తిభావై ర్మనుష్యః।
శృణోతీహవా నిత్య ముద్యుక్తచిత్తో।
భవేద్విష్ణురత్రైవ వేదప్రమాణాత్॥

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతం

సమాప్తం

శ్లో॥ అహమివజనయోగం సర్వదావర్జయేద్యః।
కుణపమివసునారీం త్యక్తకామోవిరాగీ।
విషమివ విషయాన్యోమన్య మానోదురంతాన్।
జయతి పరమహంసో ముక్తిభావం సవేతి॥

తా॥ ఎవడు జనసంగమును యెల్లప్పుడును సర్పమునువలె త్యజించునో ఏవిరాగిత్యక్తకాముడై సౌందర్యవతియగు స్త్రీని శవమును బోలె పరిత్యజించునో, ఎవ్వాడు విషయములను దురంతములుగా దలచి విషము చందంబున నుజ్జగించునో, యట్టి పరమహంస సర్వోత్కృష్టుడై ముక్తిని బొందుచున్నాడు.

శ్లో॥ సంపూర్ణం జగదేవ నందనవనం సర్వేపి కల్పద్రుమాః।
గాంగంవారి సమస్తవారినివహాః పుణ్యాస్సమస్తాః క్రియాః।
వాచః ప్రాకృత సంస్కృతాశ్శ్రుతి శిరో వారాణసీమేదినీ।
సర్వావస్థితిమోచనాత్మతుపదో దృష్టేపరబ్రహ్మణి॥

తా॥ఆత్మేతరములగు భ్రాంతులన్నియు విడుచుటవలన పరమాత్మ దర్శనముబొందిన వానికి సంపూర్ణజగంబు నందనవనంబును, సర్వ వృక్షములు గల్పద్రుమంబులును, సమస్తోదకములు గంగాజలంబులును, నశేషక్రియలు పుణ్యకార్యంబులును, వాక్కు లుపనిషద్వాక్యంబులును, భూమి శ్రీకాశీక్షేత్రంబును నైయొప్పు.

ఓం తత్సత్.



# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౫ | ౧౫ | పచనా | వచనా |
| ౧౦ | ౭ | ఇంద్రియములను | ఇంద్రియములు |
| ౧౪ | ౧౯ | మూడవస్థలమందును | మూడవస్థలయందును |
| ౧౫ | ౧౩ | నిరుపాధికృతము | నిరుపాధికత్వము |
| ౧౯ | ౪ | స్వప్నః | స్వప్నః |
| ౨౨ | ౧౨ | సస్వరూపమగు | స్వస్వరూపమగు |
| ౨౩ | ౨ | సుషుప్త్యవస్థ | సుషుప్త్యవస్థ |
| ౨౬ | ౧౦ | నాదిలేనిదనియు | నాదిలేదనియు |
| ౨౭ | ౧౩ | కరుణించెదు | కరుణించిచెదు |
| ౨౯ | ౨ | కొనినయెడల | కొననియెడల |
| ౩౭ | ౫ | మృతీ | మృతి |
| ౪౮ | ౨ | కాప్య | రాప్య |
| ౫౫ | ౫ | లేరని | వేరని |
| ౫౮ | ౧౪ | యశీతావస్థ | యతీతావస్థ |
| ౬౬ | ౧౯ | స్నేహముచే | స్నేహమునే |
| ౭౫ | ౧౨ | తత్సుప్తావివ | తత్సుషుప్తావివ |
| ౭౬ | ౧౧ | జగద్భాతు | జ్జగద్భాతు |
| ,, | ౧౩ | శుద్ధకాశో | శుద్ధాకాశో |
| ౭౭ | ౫ | జయము | జగము |
| ౯౩ | ౧౮ | భృహిర్బ్రహ్మా | బృహిర్బ్రహ్మా |
| ౯౮ | ౬ | స్పృధయు | స్వధయు |
| ౧౦౦ | ౮ | వెలియుః | వెలియుః |
| ౧౦౭ | ౨౩ | ర్వంమహదాది దేవహర్యంతం | సర్వంమహదాది దేహాపర్యంతం |

| | | | |
|---|---|---|---|
| ౧౦౮ | ౯ | సర్వానుసూతే | సర్వానుస్యూతే |
| ౧౧౦ | ౯ | వేనియర్ధంబు | లేనియర్థంబు |
| ,, | ౧౩ | పరిభావంబును | పరిభాసంబును |
| ౧౧౨ | ౨౧ | ద్ధశాంగులం | ద్దశాంగులం |
| ౧౧౬ | ౩ | కార్యము | కార్శ్యము |
| ౧౨౦ | ౨౪ | నాది | సాది |
| ౧౨౬ | ౯ | లయుత్న | అయుత్న |
| ౧౩౧ | ౨౨ | దివిసం | దివసం |
| ౧౩౮ | ౧౫ | యుగకమలంబు | యుదకమయూంబు |
| ౧౪౦ | ౧౧ | ఆర్స్రేయ | ఆశ్లేష |
| ౧౪౬ | ౧౭ | పుతాృ | పుత్రి |
| ౧౬౪ | ౧౩ | శరీము | శరీరము |
| ౧౬౫ | ౧౧ | తెలివి | తెలుపు |
| ,, | ౧౨ | వృక్షములను | వృక్షఫలములను |
| ౧౯౫ | ౧౦ | అభాసకులు | అభ్యాసకులు |
| ౨౧౧ | ౨౩ | cure | guru |
| ౨౧౮ | ౨౨ | కాల్యం | తాల్యం |
| ౨౧౯ | ౧౫ | మానసః | మానసః |
| ౨౨౧ | ౧౦ | సద్విద్యావ | సద్విద్యా |
| ౨౨౫ | ౧ | సంగాద్ద్వితీయ | సంగాద్వితీయ |
| ౨౨౭ | ౧ | ౨ న్వత్వేన | ౨ న్యత్వేన |
| ౨౪౪ | ౧ | అహమివ | అహమివ |

